C1

"వర్గాల మధ్య పోరాటం ముమ్మరంగా సాగుతున్న కాలంలో వర్గ వైషమ్యాల్ని అదుపులో వుంచడం కోసం రాజ్యం పుట్టింది. అందుచేతనే అది సహజంగా మంచి శక్తి, ఆర్థికబలమూ వున్న వర్గం యొక్క ప్రభుత్వంగానే వుంటుంది. రాజ్యం యొక్క సహాయంతో ఆ వర్గం రాజకీయంగా కూడా బలపడుతుంది. ఆ విధంగా పీడిత వర్గాల్ని అదిమిపెట్టి దోచుకొనేందుకు నూతన పరికరాల్ని సంపాదించుకొంటుంది. ఆదిమ కాలంనాటి రాజ్యం బానిస యజమానుల చేతుల్లో, బానిసల్ని అణచిపెట్టి అదుపులో వుంచేటందుకు ఉపయోగపడింది. ఫ్యూడలు రాజ్యం కులీనవర్గం వారిది. దాని ద్వారా వారు దాసులయిన రైతుల్నీ, బానిసల్నీ అదుపులో వుంచేవారు. ఈనాటి రాజ్యం పెట్టుబడిదారులు కూలీలను పీల్చివేసే సాధనంగా వుపయోగపడుతూంది. ఒక్కొక్కప్పుడు ఘర్షిస్తున్న వర్గాలు ఇంచుమించు సమాన బలంతో వుంటుంటాయి. అటువంటి సమయంలో రాజ్యం తటస్థంగా వున్నట్లు కనబడుతుంది. తాత్కాలికంగా తటస్థంగానే వుండొచ్చు. 17,18 శతాబ్దాలనాటి నిరంకుశ రాజరికాలు ఈ మాదిరివే. అవి అటు కులీనవర్గాన్నిగాని, ఇటు బూర్జువా వర్గాన్నిగాని బలపరచలేదు. ఉభయుల్నీ అణచిపెట్టి వుంచాయి. మొదటి ఫ్రెంచి సామ్రాజ్యంలో, రెండో సామ్రాజ్యంలో మరీ స్పష్టంగా బోనపార్టీ అనుసరించిన విధానం ఇదే. బూర్జువా వర్గాన్నీ శ్రామికవర్గాన్నీ ఒకదాని కొకదానిని పోటీపెట్టి తాను పైన నిలబడింది. ఈ మాదిరిగానే ఈ మధ్య బిస్మార్కు నిర్మించిన నూతన జర్మను సామ్రాజ్యమూ వ్యవహరించింది. ఆ వ్యవహారంలో పాలకులూ, పాలితులూ కూడా అపహాస్యం పాలయ్యారు. పెట్టుబడిదారుల్నీ, కార్మికుల్నీ ఒకరిపై ఒకరిని ఆడించి, క్షీణించిపోతున్న ప్రష్యను యూంకర్ల ప్రయోజనాల కోసం ఆ యిద్దర్నీ ఒకే విధంగా మోసగిస్తూ వుంది".

- ఫ్రెడరిక్ ఏంగెల్స్

# జాతుల సమస్య

రచన:

జోసెఫ్ స్టాలిన్

నవయుగ ప్రచురణ

గుంటూరు.

II

జాతుల సమస్య
జోసెఫ్ స్టాలిన్

అనువాదకుడు:
ఆనందమోహన్

నవయుగ ప్రచురణలు
గడ్డిపాటి కళ్యాణ మండపము
మంగళగిరి గేటు దగ్గర, గుంటూరు.

మొదటి ముద్రణ : జనవరి 1944
రెండవ ముద్రణ : ఆగస్టు 1986 (జయంతి పబ్లికేషన్స్, విజయవాడ)
మలి ముద్రణ : 21 డిసెంబరు, 2003.

స్టాలిన్ 124వ జయంతి సందర్భంగా
(జననం : 21-12-1879, మరణం : 5-3-1953)

వెల : 25/-

ముద్రణ :
న్యూ కంప్యూటరైజ్డ్ ప్రింటింగ్ సెంటర్
9/2, అరండల్‌పేట, గుంటూరు-2.
ఫోన్ : 2235161.

ప్రతులకు :
ప్రజాశక్తి అన్ని శాఖలలోను
మైత్రి బుక్ హౌస్ & జయంతి పబ్లికేషన్స్,
కారల్‌మార్క్స్ రోడ్, విజయవాడ.

# విషయసూచిక

I. 1. మార్క్సిజం-జాతీయ సమస్య

2. రష్యాలో జాతి సమస్య

3. జాతీయ సమస్య-పార్టీ తక్షణ కర్తవ్యములు (థీసిస్)

II. జాతీయ సమస్య-పార్టీ తక్షణ కర్తవ్యములు. (రిపోర్టు)

III. సోవియట్ రిపబ్లికుల సమ్మేళన

IV. ప్రాగ్దేశ ప్రజల విశ్వవిద్యాలయం యొక్క రాజకీయ కర్తవ్యములు

V. జాతీయ సమస్యను గురించి ఇంకోసారి

VI. అనుబంధం (1)

జాతీయ సమస్యపై సో. యూ. కమ్యూనిస్టుపార్టీ యొక్క ప్రధాన నిర్ణయాలు

VII. అనుబంధం (2)

పార్టీ కార్యక్రమమునుండి (EXTRACT)

VIII. వివరణ సూచిక

# మామాట

జాతుల సమస్యపై దాదాపు 90 ఏళ్ల కిందట స్టాలిన్ చేసిన ఈ మహత్తర రచనను ఇన్నేళ్ల తర్వాత మళ్లీ వేయడమెందుకనే ప్రశ్న సహజంగానే వస్తుందని మాకు తెలుసు. స్టాలిన్ ఈ నివేదిక రూపొందించినప్పుడు లెనిన్ జీవించే వున్నారు. ఆయన కూడా పాల్గొన్న పార్టీ మహాసభలోనే మొత్తం పార్టీ తరపున స్టాలిన్ ఈ నివేదిక నిచ్చారనేది గమనించాల్సిన విషయం. అప్పటికి బోల్షివిక్ విప్లవం విజయవంతమవలేదు. జాతుల బందిఖానా అని పిలవబడ్డ జారిస్టు రష్యాను ఎదుర్కొన్న కీలక సమస్యలలో జాతుల సమస్య ఒకటి. దానికి శాస్త్రీయమైన, హేతుబద్ధమైన పరిష్కారం ఆలోచించకుండా నూతన సమాజాన్ని నిర్మించలేమని కమ్యూనిస్టులకు బాగా తెలుసు. అందుకే స్టాలిన్ నాయకత్వాన ఒక కమీషన్‌ను నియమించారు. దాని తరపునే ఆయన ఈ నివేదికనిచ్చారు. మార్క్స్ ఎంగెల్సులు జాతులసమస్యను లోతుగా పరిశీలించలేదని కొందరు ఆరోపిస్తుంటారు. అపోహపడుతుంటారు. ఫ్యూడలిజం విచ్ఛిన్నమై 19 వ శతాబ్దిలో జాతి రాజ్యాల భావన వూపిరి పోసుకుంటున్న దశలోనే వారుభయులూ ఆ సమస్యను అత్యంత శాస్త్రీయంగా విశ్లేషించారు-వివరించారు. తర్వాతి కాలంలో కమ్యూనిస్టులకు ఆ మూలసూత్రాలే వెలుగు చూపాయి. అయితే మార్క్సిస్టు సిద్ధాంతానుయాయులు మారిన పరిస్థితులను, సామ్రాజ్యవాద పాత్రను కూడా పరిగణనలోకి తీసుకుని జాతిసమస్యను పరిశీలిస్తారు.

రష్యాలో విప్లవం జయప్రదమైన తర్వాత అదివరకటి ఆక్రమిత జాతులన్నిటి స్వచ్ఛంద సమాన కలయికగా సోవియట్ సమాఖ్య ఆవిర్భవించింది. ఇందులో జాతుల శాఖామంత్రిగా వున్నది కామ్రేడ్ స్టాలిన్. ఆ విధంగా ఆయన అధ్యయనం, ఆచరణ రెండింటిలోనూ అవగాహన సంతరించుకోగలిగాడు. జాతుల ప్రత్యేకతలకు ప్రమాణలేమిటో, ఆ సమస్యలో ముడిపడివున్న ప్రమాదలేమిటో కూడా స్టాలిన్ తేటతెల్లంగా చెప్పాడు. జాతులు అన్ని బాగున్నపుడు గాని, ఏదైనా ఉమ్మడి పోరాటం చేస్తున్నపుడు గాని కలగలసి వుంటాయని, అది ముగిసిపోగానే విడిగా ఆలోచించడం మొదలవుతుందని విశ్లేషించారు. నేటి ఏర్పాటువాద, మతతత్వ, ధోరణులను ఆధునికానంతర వాదం ఆస్తిత్వవాదం అంటూ సాగే అసంబద్ధ వాదనలను గమనించినపుడు స్టాలిన్ ఎంత దూరదృష్టితో వాస్తవికతతో చెప్పాడో మనకు అర్థం అవుతుంది. మన దేశం స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్నపుడు ఏర్పడిన ఏకీభావం, తర్వాత పెరిగిన ప్రాంతీయ తత్వాలు పోల్చిచూసుకుంటే ఈ హెచ్చరికలోని వాస్తవికత కళ్లకు కడుతుంది.

అసలైన పరిష్కారాలు కనిపించనపుడు, పాలకుల తప్పుడు విధానం ఫలితంగా జీవితం దుర్భరమైనపుడు ఇలాంటి పోకడలు ప్రకోపిస్తాయి. పాలక వర్గాలనుంచే కొందరు వీటిని సొమ్ము చేసుకోవాలని చూస్తారు. పంజాబ్, అస్సాం, కాశ్మీర్, ఈశాన్య భారతం వగైరా చోట్ల మనం చూసిన వేర్పాటువాద చిచ్చు అలావుంచి మన రాష్ట్రంలోనే వేర్వేరు దశల్లో వేర్వేరు రూపాల్లో ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాలు తలెత్తడం చూశాం, చూస్తున్నాం. హిందూత్వ ఆధారంగా అధికారానికి ఎగబాకిన బిజెపి రాష్ట్రాల విభజనను అడ్డగోలుగా సాగిస్తున్న తీరు కూడా చూస్తున్నాం. ఎవరికి వారు జాతి అని చెప్పుకోవడం, అస్తిత్వం ప్రధానమని చెప్పడం జరుగుతున్నది. ఇందులో చిత్తశుద్ధి ఎంత? అనే మాట అలా వుంచి ఈ వాదనలు వాస్తవమైనవి కూడా కాదు. భాష సంస్కృతి, భౌగోళిక ఉనికి వంటి అనేక అంశాలు కలగలిస్తే తప్ప ఏ ఒక్కదాన్ని మాత్రమే పట్టుకుని జాతిగా అనుకోవడం మనను దారి తప్పిస్తుంది. మతం గాని, యాస గాని ఒక ప్రజా సమూహాన్ని వేరే జాతిగా చేయవు. అలా అని వేర్వేరు ప్రజా సమూహాల చారిత్రక ప్రత్యేకతలను, మనోభావాలను గుర్తించని ఏకపక్ష సిద్ధాంతాలు కూడా అనర్థానికే దారి తీస్తాయి. నాడు హిట్లర్ ఆర్యజాతి సిద్ధాంతంగాని, నేడు తొగాడియాలాంటి హిందూత్వశక్తులు చెప్పే "కాశ్మీర్‌నుండి రామేశ్వరం - కోలకత్తా నుండి కాందహార్ వరకు అఖండ హిందూదేశం - ఒకే జాతి సిద్ధాంతం గాని", కొందరు తెలంగాణా వాదులు చెప్పే ప్రత్యేక జాతి సిద్ధాంతాలు కాని చారిత్రక పరీక్షకు నిలిచేవి కావు.

సాధారణ ఇంగిత జ్ఞానానికి కూడా అర్థమయ్యే ఈ అంశాలనే స్టాలిన్ సశాస్త్రీయంగా, సోదాహరణంగా ఈ పుస్తకంలో పొందుపరుస్తారు. దీన్ని చదవడం వల్ల జాతి అంటే ఏమిటో జాతులకు ఎలా న్యాయం చేయాలో విదితమవుతుంది. ఈ జాతి సిద్ధాంతాలన్నీ అంతిమంగా శ్రామిక ప్రజల సువిశాల అంతర్జాతీయతకు దారి తీయాలేగాని పరస్పరం విడిపోవడానికి కాదు. ఇలాంటి సమగ్ర అవగాహన కలగడానికి జాతుల సమస్య బాగా ఉపయోగపడుతుంది. స్టాలిన్ ఈ రచన చేసిన నాటికి నేటికి ప్రపంచ పరిస్థితులలో అనేక మార్పులు వచ్చాయి. ఆయన హయాంలో రూపొందిన సోవియట్ యూనియన్ ఇప్పుడు విచ్ఛిన్నమై పోయింది. ప్రపంచమంతటా, ప్రత్యేకించి ఐరోపా దేశాలలో జాతి కలహాలు ప్రజ్వరిల్లుతున్నాయి. మనదేశంలో కూడా వేరే రూపాలలో ఈ సమస్యను ఎదుర్కొంటున్నాము. ఇలాంటి పరిస్థితులలో స్టాలిన్ రచనను అధ్యయనం చేయడం సరైన అవగాహనకు దోహదపడుతుందని విశ్వసిస్తున్నాము.

జాతీయ సమస్య అనే పదబంధం జాతుల సమస్య అనే అర్థంలో ఆనాటి అనువాదకులు వాడారు.

- ప్రచురణ కర్తలు

# జాతులకు స్వాతంత్ర్యం

(జాతుల యెడల సోవియట్ ప్రభుత్వం అవలంబించే విధానాన్ని విశదీకరిస్తూ 1917 నవంబరు 15వ తేదీన లెనిన్, స్టాలిన్‌లు చేసిన చారిత్రాత్మక ప్రకటన.)

కార్మికులూ, కర్షకులూ కలసి సాగించిన నవంబరు విప్లవం స్వాతంత్ర్యాశయ సాధన కోసం ప్రారంభించబడింది. భూస్వాముల అధికారంనుంచి రైతాంగం విముక్తి పొందుతూ ఉంది.

భూస్వామ్య పద్ధతి అంటూ ఇక లేనేలేదు. ఇక నుంచి ఎన్నికల ద్వారానే సైనికాధికారులందరూ ఎన్నుకోబడడం, తొలగించబడడం జరుగుతుంది; కాబట్టి నిరంకుశాధికారవర్గం నుంచి సైనికులకూ, నావికులకూ విముక్తి లభిస్తుంది. పరిశ్రమలపై ఇక నుంచి కార్మికవర్గ యాజమాన్యం నెలకొల్పబడుతుంది. కాబట్టి పెట్టుబడిదారుల నిరంశకుత్వం నుంచి కార్మికులకు విముక్తి కలుగుతుంది. ఒకమాటలో చెప్పాలంటే హేయమైన బానిసబంధనాలనుంచి ప్రతిజీవికీ విముక్తి లభిస్తుంది.

× × ×

పోతే ఇక నిర్బంధ విధానంతోను, నిరంకుశత్వంతోనూ అణచబడిన - అణచబడుతూన్న రష్యాజాతుల విషయం తీసుకోవలసిఉంది. ఈ జాతులకు వెంటనే సంపూర్ణంగా విముక్తి కలిగించాలి.

× × ×

జారు ప్రభుత్వకాలంలో ఒకజాతికి వ్యతిరేకంగా మరోజాతిని ఒక ప్లానుప్రకారం రెచ్చగొట్టడం జరుగుతూ ఉండేది. తత్ఫలితంగా ఒకవైపునుంచి హింసాకృత్యాలూ, మారణహోమాలూ, జరుగుతూఉంటే మరోవైపునుంచి వివిధజాతులను బానిసత్వంలో ముంచి వేయడం జరిగేది.

ఒకజాతిపైకి మరోజాతిని రెచ్చగొట్టే అతినీచమైన ఆ విధానానికి స్వస్తిచెప్పబడింది. ఆ దుష్టవిధానంవైపు మళ్ళీ తిరిగి చూడడమంటూ ఇక జరగదు. రష్యాలోని వివిధ జాతుల మధ్య ఐచ్ఛికంగా, హృదయపూర్వకంగా ఏర్పడే సుహృద్భావపూరిత సంబంధాలపైన ఆధారపడే విధానమే అనుసరించబడుతుంది.

సామ్రాజ్యవాద దశలో జరిగిన ఫిబ్రవరి విప్లవ తదనంతర బూర్జువావర్గం చేతుల్లోకి రాజ్యాధికారం వచ్చింది.

ఈ బూర్జువావర్గం పైకి మాటల్లో జాతులకు 'స్వాతంత్ర్యం', 'సమానత్వం' అని ప్రకటిస్తూ ఆచరణలో జాతి వైషమ్యాలను ఇంకా ఎక్కువగా రెచ్చగొట్టింది. తత్ఫలితంగా రష్యాలో ఉన్న ఏ జాతిని నమ్మడానికీ ఆ ప్రభుత్వానికి గుండె చాలక పోయింది.

బూర్జువా ప్రభుత్వం అవలంబించిన అసత్యపూరితమైన, అవిశ్వాసపూరితమైన, వైషమ్య పూరితమైన ఆ విధానానికి ఇంతటితో స్వస్తిజెప్పి అందుకు బదులుగా నిజాయితీగల

నిష్కపట విధానాన్ని అనుసరించాలి. అలాంటి విధానమే రష్యాలోని వేర్వేరు జాతుల మధ్య సంపూర్ణమైన పరస్పర విశ్వాసాన్ని కలిగిస్తుంది.

× × ×

అలాంటి పరస్పర విశ్వాసం ద్వారానే రష్యాలోని వివిధజాతుల మధ్య హృదయపూర్వకమైన సత్సంబంధాలు ఏర్పడుతాయి. సామ్రాజ్యవాదులూ, వాళ్ళతో చేతులు కలిపే పెట్టుబడిదారులూ సాగించే కుటిల ప్రయత్నాలను భగ్నం కావించగల ఏకైక విప్లవశక్తిగా వివిధజాతులకు చెందిన కార్మికులూ, కర్షకులూ తయారుకావాలంటే అలాంటి సుహృద్భావపూరిత సంబంధాల ద్వారానే అది సాధ్యమవుతుంది.

వీటన్నిటిని దృష్టిలో ఉంచుకునే రష్యాలోని అన్నిజాతులూ సమానంగా స్వాతంత్ర్య హక్కూ, స్వయంనిర్ణయ హక్కు కలిగి ఉంటాయని 1917 జూన్‌లో జరిగిన సోవియట్ ప్రథమ మహాసభ ప్రకటించింది.

రష్యా జాతులయొక్క ఈ జన్మహక్కులను ఇంకా విస్పష్టంగా, నిర్దుష్టంగా 1917 అక్టోబరులో జరిగిన సోవియట్ల ద్వితీయ మహాసభ బలపరిచింది.

× × ×

పై మహాసభల్లో చేసిన తీర్మానాల ప్రకారం ఈ దిగువ నుదహరించిన సూత్రాల ప్రాతిపదికపై తన కార్యకలాపాలను నడపడానికి సోవియట్ మంత్రివర్గం నిర్ణయించింది.

1) రష్యాలో ఉన్న వివిధ జాతులనన్నిటికీ సమానత్వం, సర్వ స్వతంత్ర్యం;

2) రష్యాలో ఉన్న వివిధజాతులన్నిటికీ స్వయంనిర్ణయాధికార స్వాతంత్ర్యం - కేంద్రప్రభుత్వం నుంచి విడిపోయి స్వతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పరచుకునే హక్కుతో సహా;

3) జాతిరీత్యా, మతరీత్యా సంక్రమించిన హక్కులనూ, ప్రత్యేకాధికారాలనూ పూర్తిగా రద్దుచేసివేయడం;

4) రష్యా భూభాగంలో నివసిస్తోన్న అల్పసంఖ్యాక జాతులూ, వేర్వేరు తెగలూ తమకు నచ్చినవిధంగా అభివృద్ధి చెందడానికి స్వాతంత్ర్యం;

జాతీయ వ్యవహారాలకు సంబంధించిన కమిటీ ఏర్పడినవెంటనే పై నిర్ణయాలపై అత్యవసరమైన ప్రత్యేక ఆర్డర్లు జారీచేయబడతాయి.

రష్యా రిపబ్లిక్ పేరిట

ఇట్లు

**జోసెఫ్ జుగష్విలీ - స్టాలిన్;**

జాతులశాఖామంత్రి

**వి. ఉల్యనోవ్-(లెనిన్)**

సోవియట్ మంత్రివర్గ అధ్యక్షుడు

**(15-11-1917)**

# పరిచయం

కామ్రేడ్ స్టాలిన్ యొక్క వుపన్యాసాలను, వ్యాసాలను సమీకరించి మార్టిన్ లారెన్సు (లండన్) కంపెనీవారు "మార్క్సిజము-జాతీయ వలస రాజ్యాల సమస్య" అనే పుస్తకంగా ప్రకటించారు. దానిలోని కొన్ని కొన్ని భాగాలను యెత్తి యీ పుస్తక రూపంలో ప్రకటిస్తున్నాం. జాతీయ సమస్యపై మార్క్సు, లెనిన్, స్టాలిన్‌ల అభిప్రాయాలను స్పష్టంగా తెలిసికొనేందుకు ఇందులో ఇచ్చిన వుపన్యాసాలు, వ్యాసాలు చాలును.

ఈ పుస్తకం స్టాలిన్ 1912లో వ్రాసిన 'మార్క్సిజము-జాతీయ సమస్య' అనే కరపత్రంతో ప్రారంభమౌతుంది. దానిలో నుంచి ప్రస్తుతం మనకవసరమయిన మొదటి రెండు అధ్యాయాలను, ఆఖరి అధ్యాయాన్ని మాత్రమే ఇచ్చేం. వొదిలివేయబడిన భాగాలు "జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలన" (National cultural autonomy) సమస్యపై వివాదానికి సంబంధించినవి. ఈ సమస్యను సమగ్రంగా తెలిసికోవాలంటే ఆ భాగాలు కూడా అవసరమే కాని, ప్రస్తుత మన ప్రాధమిక విచారణ (Study) (మార్క్సిజం జాతుల సమస్యపై యేవిధమైన వుపదేశాన్నిచ్చిందో తెలిసికొనుటకు) అంత అవసరం కాదు. కామ్రేడ్ స్టాలిన్ జారిస్టు రష్యాలోని జాతీయ, సాంఘిక (Commercial) సమస్యా పరిష్కారానికి మార్క్సు యొక్క యీ వుపదేశాలను ఏవిధంగా వుపయోగించాడో యీ కరపత్రంలో మనకు తెలుస్తుంది.

'జాతి' అనేది అనాదికాలంనుండీయున్న శాశ్వతమైన విషయం కాదనీ, 'జాతి' అనేది పెట్టుబడిదారీ యుగంలోనే ప్రారంభమైనదనీ, స్టాలిన్ చెబుతున్నాడు. జాతులనేకాక, బహుజాతులున్న సామ్రాజ్యవాద ప్రభుత్వాలలో (Multinational States) జాతి నిర్బంధవిధానాన్ని కూడా బూర్జువా వర్గమే సృష్టించింది. సంపూర్ణ ప్రజాస్వామ్యం-ప్రజా ప్రభుత్వం-నెలకొల్పబడిననాడే యీ జాతీయ సమస్య పరిష్కారం సాధ్యమౌతుంది. ఆ ప్రజాస్వామ్యాన్ని సాధించుటకు దేశంలోని శ్రామిక ప్రజా సామాన్యం (అన్ని జాతులవారూ) ఐక్యతను సంపాదించి ఏకోన్ముఖంగా, యేకాశయంతో పోరాటాన్ని సాగించాలి. భిన్నజాతుల ప్రజాసామాన్యం మధ్య ఐక్యతను నెలకొల్పాలంటే, ఒకటేమార్గం. అన్ని జాతుల సమత్వాన్ని ప్రతిజాతియొక్క స్వయంనిర్ణయహక్కును గుర్తించాలి. శ్రామికులందర్నీ వారి తెగతోగాని, జాతితోగాని సంబంధించని వర్గసంస్థ (Class organisation) లలో సంఘటిత పరిచినచో అది సాధ్యమౌతుంది. జారిస్టు నిరంకుశత్వకాలంలో జాతీయ సమస్యా పరిష్కారం యీ మార్గాన నడిచింది.

రష్యన్ కమ్యూనిస్టుపార్టీ 12వ సమావేశంలో (1921) జాతీయ సమస్యపై స్టాలిన్ యిచ్చిన థీసెస్‌లో జాతులసమస్య, జాతీయ నిర్బంధాల సమస్య, వాటి విముక్తి సమస్య

యివన్నీ కూడ శ్రామికవర్గ విప్లవ విజయంతో ఏవిధంగా ఒక కొత్తదశలోనికి మారుతాయో వివరింపబడింది. విజయవంతమైన శ్రామిక ప్రభుత్వం చేతిలో స్వయం నిర్ణయహక్కు ఒక జాతినుండి వేరు పరచువిధంగా గాక వివిధజాతులను ఐక్యపరచి ఒకే అంతర్జాతీయ సంఘ నిర్మాణం చేయుటకు తోడ్పడుతుంది; వివిధజాతులు ఏకమై పరస్పర సహకారం చేసుకుంటూ, వెనుకబడియున్న జాతులనుకూడ అభివృద్ధి చేయుటకెంతో సహాయం చేస్తూ, తమతమ వ్యక్తిత్వాన్ని జాతీయ జీవనాన్ని సర్వతోముఖాభివృద్ధి చేసుకుంటూ నూతన సోషలిస్టు నాగరికతా నిర్మాణంలో పాల్గొంటాయి.

తర్వాతది 1922లో U.S.S.R. మొదటి కాంగ్రెసు సమావేశంలో "సోవియట్ రిపబ్లిక్కుల సమ్మేళన (Amalgamation of the Soviet Republics) మీద స్టాలిన్ రిపోర్టు. సర్వస్వతంత్రములైన వివిధ సోవియట్ రిపబ్లికులు కలసి "యు.ఎస్.ఎస్.ఆర్." అనే ఒక ఏకరాజ్యాంగం (Single State) నిర్మించుకున్నారు; భావి ప్రపంచ సోషలిస్టు సోవియట్ రిపబ్లిక్ నిర్మాణానికి మార్గదర్శకులైనారు; స్టాలిన్ దానిని, "జాతీయ నిర్బంధాలను అరాచకాన్ని నాశనంచేసిన నూతన రష్యా విజయోత్సవదినం" అన్నాడు.

ప్రాగ్దేశ ప్రజల విశ్వవిద్యాలయ విద్యార్థులకిచ్చిన వుపన్యాసంలో (1924) స్టాలిన్ నేటి సామ్రాజ్యవాద పతనదశాకాలంలో తూర్పు బానిస దేశాలలోని జాతీయ స్వాతంత్ర్య జాతీయైక్యతా సమస్యలను గూర్చి చర్చిస్తాడు. ఆ వుపన్యాసం ఇండియాలోని జాతుల సమస్య యొక్క భావినిగూర్చి ఇచ్చినది. కమ్యూనల్ సమస్య అని పిలువబడుతున్న జాతుల సమస్యా పరిష్కారానికిగాను మనం లెనిన్, స్టాలిన్‌ల వుపదేశాలను ఏవిధంగా ఆచరణలో పెట్టవలెనో సూచిస్తుంది. "ఈనాడు హిందూదేశం అంతా ఒకటే (One Single Whole) అంటున్నారు. కాని ఇండియాలోనే విప్లవోద్యమం జరిగే పరిస్థితిలో నేటివరకూ, యింకా జాగృతిచెందని యెన్నో జాతులు, గుంపులు తమ తమ ప్రత్యేకభాషా సంప్రదాయాలతో ముందుకు వచ్చి రంగంలోనికి దూకుతాయని ఘంటాపథంగా చెప్పవచ్చును." అన్నాడు.

స్టాలిన్ 1925లో వ్రాసిన "జాతీయ సమస్య ఇంకోమారు" అనే వ్యాసంలో ఒక ప్రధాన విషయాన్ని గురించి విపులంగా చర్చించేడు. యుగోస్లావియా మొదలగు దేశాల్లో జాతీయసమస్య భిన్న జాతీయ బూర్జువా వర్గాల మధ్యపోటీమాత్రమే కాదు. ఆ దేశాలలో జాతీయసమస్య ప్రధానంగా ఒక రైతుసమస్య. ప్రజాసామాన్యంలోని జాతీయ, సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యం మూలంగా బయల్దేరిన సమస్య. ఈ ప్రధాన పాఠాన్ని మనం చాలా జాగ్రత్తగా గమనించాలి.

వాటివాటి అభివృద్ధిలోవున్న హెచ్చుతగ్గులమూలాన వివిధ జాతీయ బూర్జువా వర్గాలమధ్య బయల్దేరిన పోటీ, పోరాటం తీవ్రతరం అయిన కొలదీ, పెట్టుబడిదారీవిధానం

ముందుకు పోతూన్నకొద్దీ, జాతీయ సమస్య అంతకంతకు క్లిష్టతరం ఔతూంటుంది. జాతీయ నిర్బంధవిధానం ప్రవేశ పెట్టబడుతుందేమోనన్న భయం పుడుతుంది. కాని యిది సమస్యయొక్క ఒక కోణం (aspect) మాత్రమే. దీనికన్న ప్రాముఖ్యతగలదీ, అసలు సమస్యా పరిష్కారానికెక్కువ తోడ్పడేదీ అయిన రెండోభాగం వుంది- అదే రైతాంగానికి సంబంధించినది. రైతు ప్రజాసామాన్యంలో జాతీయ చైతన్యం సామ్రాజ్యవాద వ్యతిరేకచైతన్యమూ, సంచలనము ఒకేసారి కలుగుతాయి. అందుచేతనే అన్ని జాతులయొక్క సమానత్వాన్నీ, అన్ని జాతులయొక్క స్వయం నిర్ణయహక్కునూ గుర్తిస్తూ, ఆ పునాదిపై అన్నిజాతులను దాస్య విముక్తి పోరాటానికై ఐక్యపరచుట మన కర్తవ్యం.

బూర్జువా సామ్రాజ్యవాదులు నిర్బంధవిధానాన్ని సృష్టించి, జాతీయ విభేదాలను యెక్కువ చేయుటకే ప్రయత్నిస్తారు. జాతీయ బూర్జువా వర్గానికి తన స్వప్రయోజనాలు తప్ప ఇతరులబాగు అవసరమే లేదు. ఆ కారణంచేత ప్రజలందర్నీ ఐక్యపరచే మార్గమే దానికి కనపడదు. ప్రతిజాతీ కూడా అభివృద్ధిచెందే అవకాశాలు, దానికి కావలసిన స్వాతంత్ర్య వాతావరణమూ, సమానత్వాన్ని కల్గియున్న స్వతంత్రజాతులతో కూడిన సంస్థలోనే వుంటాయి. అట్టి సంస్థానిర్మాణానికిగాని దేశంలోని ప్రజలనందరనూ జాతీయ స్వాతంత్ర్య సంపాదనా కార్యక్రమంలో ఐక్యపరచుటకుగాని సరియైన పంథాను సూచిస్తూ ధైర్యంతో ప్రజలముందు కొచ్చేది ఒక్క శ్రామికవర్గమూ, ఆ వర్గపార్టీ మాత్రమే. సామ్రాజ్యవాదంనశించి, ఒకజాతినింకొక జాతి దోపిడీ చేసేవిధానం పోయిననాడే జాతీయ స్వాతంత్ర్యము, సమానత్వము అనేవి సార్థకమౌతాయి; అంతవరకూ అవి వట్టిమాటలుగా మాత్రమే వుంటాయి.

జారిస్టు సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయుటద్వారా యీ పై జెప్పిన పరిస్థితులను రష్యన్ శ్రామికవర్గము సోవియటు యూనియనులో నెలకొల్ప గలిగేరు. నేడు జరుగుతూన్న ప్రపంచదాస్య విమోచన పోరాటంలో ప్రపంచ సామ్రాజ్యవాదం యొక్క భవిష్యత్తు నిర్ణయింపబడుతూంది. భావి ప్రపంచ వ్యవస్థానిర్మాణంలో మనం మనపాత్రను నిర్వహించవలసియుంది. రష్యా, చైనా, అమెరికా, బ్రిటన్ ప్రజల సహకారంతో మన మాతృదేశాన్ని రక్షించుకొనుటకుగాను, స్వయం నిర్ణయసూత్రం అనే పునాదిపై భారత జాతీయైక్యతను సాధించగల్గిననాడే మన కర్తవ్యనిర్వహణ చేయగల్గుతాం. ప్రస్తుతయుగంలో జాతీయ సమస్యాపరిష్కారానికి స్టాలిన్ చూపిస్తూన్న మార్గం యిదే.

26-6-42

గంగాధర అధికారి

(సి.పి.ఐ. పొలిట్‌బ్యూరో సభ్యుడు)

తా.క : పూర్వచరిత్రాంశములకు సంబంధించినవాటికి పుస్తకము చివర వ్యాఖ్యానం యివ్వబడినది.

# మార్క్సిజమూ - జాతీయసమస్య

"మార్క్సిజమూ-జాతీయసమస్య" వ్యాసాన్ని స్టాలిన్ 1912-13లో వియెన్నాలో వ్రాశారు. జాతీయ సమస్యపై స్టాలిన్ వ్రాసిన 'వ్యాససంపుటిలో' భాగం అది. 1920లో అది తిరిగి ముద్రించబడింది. (By the People's Commissariat of Nationalities) అపుడు దానికి గ్రంధకర్త ఒక కొత్తపీఠికను కూడా వ్రాసి యిచ్చేడు. దానిలో,

"రష్యన్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీసభ్యుల్లో జాతీయసమస్య యొక్క ప్రధాన సూత్రాలను గురించి జరుగుతూన్న తీవ్రవివాదం యీ వ్యాసంలో ప్రతిబింబిస్తూంది. ప్రపంచ సామ్రాజ్యవాద యుద్ధ ప్రారంభానికి (1914) ఒకటిన్నర సంవత్సరాలముందు జారిస్టు-భూస్వాముల అభివృద్ధి నిరోధకశక్తులు నిరంకుశంగా పరిపాలిస్తూన్న రోజులవి; సరిగా ఆ సమయంలోనే బూర్జువా ప్రజాస్వామ్య విప్లవశక్తులు బలపడుతున్నాయి. ఆరోజుల్లో 'జాతి'ని గురించి రెండు పరస్పర వ్యతిరేకములైన సిద్ధాంతాలు, వాటితోబాటు రెండు భిన్న జాతీయ కార్యక్రమాలు ప్రచారంలో వున్నాయి. (1) బండ్ చేత, మెన్షెవిక్కులచేత బలపరచబడుతూన్న ఆస్ట్రియన్ ప్రోగ్రామ్; (2) బోల్షివిక్కుల 'రష్యన్' ప్రోగ్రామ్. ఈ వ్యాసంలో యీ రెండు వుద్యమాలను గురించి వివరించారు. తర్వాతి సంఘటనలు, ముఖ్యంగా సామ్రాజ్యవాద యుద్ధము, ఆస్ట్రియా-హంగరీ సామ్రాజ్యము వివిధ జాతీయ రాజ్యాలు (National States) గా విచ్ఛిన్నమై పోవుటయు పై రెండింటిలో యే పక్షపువాదన సరియైనదో స్పష్టపరచినై. స్ప్రింగర్, బవర్‌లు ఇంకా తమ పాత జాతీయ కార్యక్రమాన్నే పట్టుకు వ్రేలాడుతున్న సమయంలో చరిత్రయే 'ఆస్ట్రియన్ ప్రోగ్రామ్' శుద్ధపనికిమాలినదని నిస్సందేహముగా ఋజువు చేసింది. చివరకు బండ్ (The Bund)[1] కూడ తమపంథా లోపభూయిష్టమని అంగీకరించక తప్పినదికాదు. "జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలనకొరకు మనకోరిక (అంటే, ఆస్ట్రియన్ నేషనల్ ప్రోగ్రామ్; స్టాలిన్) - పెట్టుబడిదారీ సమాజంలో వుచితమైనదే అయినప్పటికీ,- సోషలిస్టు విప్లవ పరిస్థితులలో శుద్ధ అర్ధరహితమైనకోర్కె (demand) గా తయారౌతుంది", (బండ్ యొక్క 12వ సమావేశం, 1920). అంటే, అనుకోకుండానే, బండ్, తమయొక్క జాతీయ కార్యక్రమమూ, తమ 'జాతి' సిద్ధాంతము కూడ (Austrian Theory of Nations) దుర్బలమైనవనీ, ఆధార రహితములనీ ఒప్పుకుందన్నమాట.

"రష్యాలో 1906-1912 మధ్యకాలంలో (Period of Counter Revolution) విప్లవోద్యమంలోని లోపాలు పూర్తిగా బయలుపడినై. నిరంకుశ ప్రభుత్వం యెదురుదెబ్బ కొట్టినకొలదీ, వుద్యమంలో నిస్పృహ, తమ శక్తిలోనే అవిశ్వాసం యెక్కువ కాసాగేయి. "ముందు ముందు మనకు మంచి దినాలొస్తున్నాయి" అనే విశ్వాసం ప్రజల్లో వున్నంతకాలం జాతిభేదాలను మరచి వారందరూ ఐక్యపోరాటాన్ని సాగించేరు. అందరికీ సంబంధించిన విషయాలకే ప్రాధాన్యత నీయాలి! అన్నారు. కాని తమ విజయంలో సందేహం కలిగేసరికి,

వెంటనే యెవరిదోవ వారు చూసుకున్నారు. ఏజాతి కాజాతి వేరుపడిపోయింది. వుద్యమం వదలిపెట్టి "ఎవడిసంగతి వాడే చూసుకోవాలి! ఇప్పుడు అతిప్రమాదమైనది 'జాతీయ సమస్య' మాత్రమే"! అనే ధోరణి నిరుత్సాహ ఫలితంగా వచ్చింది.

"అదే సమయంలో దేశంయొక్క ఆర్థిక జీవనంలో ఒక బ్రహ్మాండమైన సంచలనం కలుగుతూంది. 1905లో (Country districts) బానిసత్వంపై మరొక గట్టిదెబ్బ తీయబడింది. కొన్ని సంవత్సరాలు వరుసగాయెక్కువ పంటలు పండటం, సత్వర పారిశ్రామికాభివృద్ధి కలసి పెట్టుబడిదారీ విధానాన్ని బలపరచేయి. పట్టణాలెన్నో పెరిగి పోయేయి; రైతులు, పల్లెవాసులు పట్టణవాసులనుండి వేరై పోయేరు; వర్తకవ్యాపారాలు రాకపోకల మార్గాలు యెన్నో రెట్లు అభివృద్ధి చెందేయి, ఇదంతా రష్యా సరిహద్దు ప్రదేశాలలో (Border Regions) మరీ యెక్కువగా జరిగింది. ఈ మార్పులన్నింటిమూలంగా రష్యాలోని జాతులన్నీ ఆర్థికంగా సన్నిహితం అవక తప్పదు; అవసాగేయికూడాను, ఆ జాతులన్నింటిలో సంచలనం కలగసాగింది.

"ఆ సమయంలోనే స్థాపించబడిన "శాసనబద్ధ పరిపాలనాయంత్రం" (Constitutional Regime) కూడా యీ జాతీయ సంచలనాన్ని రగుల్కొల్పడానికే దారితీసింది. వాఙ్మయం, వార్తాపత్రికలు యెక్కువగా వ్యాపించాయి. వైజ్ఞానిక సంస్థలకు స్వేచ్ఛ యివ్వబడినది. జాతీయ విజ్ఞానరంగ స్థలాలసంఖ్య యెన్నో రెట్లు యెక్కువైంది; ఇవన్నీ మొత్తంమీద "జాతీయ భావాన్ని " బలపరచుటకే తోడ్పడినాయి. డ్యూమా (రష్యన్ శాసనసభ) లోని రాజకీయమతాలు, ఎలక్షన్ ప్రచారాలమూలంగా కూడ వివిధజాతులు రాజకీయాలలో యెక్కువ ఆతురతతో పాల్గొనుటకు, తమ ప్రజలను సమీకరించు కొనుటకు యెన్నో అవకాశాలు కలిగేయి.

"జాతీయ భావప్రేరితులైన సరిహద్దు ప్రదేశాలలోని ప్రజలస్వాతంత్ర్య పిపాసను అధికారంలోవున్న నిరంకుశ ప్రభుత్వం అతికఠినంగా అణగద్రొక్కేసింది. దానితో ఆ జాతులలో జాతీయభావం యింకా యెక్కువైందేకాని నశించిపోలేదు; కొన్ని సమయాల్లో అది జాతీయ దురహంకారానికి (Chauvinism) కూడా దారితీసింది. యూదులలో జియోనిజమ్ (Zionism)[2] వ్యాప్తమైనది; పోలండులో జాతీయ దురహంకారం, తార్తారులలో "పాన్-ఇస్లామిజమ్" [3] యెక్కువయేయి; ఆర్మీనియన్, జార్జియన్, యుక్రేనియన్ ప్రజలలో జాతీయత వ్యాపించింది; సామాన్యంగా అందరూ యూదులంటే ద్వేషభావంతో చూడసాగేరు. (Anti Semitism); ఇవన్నీ అందరికీ తెలిసిన విషయాలే.

"శ్రామిక ప్రజాసామాన్యాన్ని కూడా తనలోకి ఆకర్షించి లాగేస్తుందా అన్నంతబలంతో జాతీయాభిమాన ప్రవాహం ముంచుకొచ్చింది. ప్రజా స్వాతంత్ర్య వుద్యమం సన్నగిల్లినకొలదీ జాతీయ సంకుచితత్వం బలపడసాగింది."

"సోషల్ డెమోక్రాటిక్ పార్టీ ఆ క్లిష్టసమయంలో సంకుచిత జాతీయతను యెదుర్కొని, ఆ అంటువ్యాధి ప్రజాస్వామ్యానికి తగలకుండా కాపాడవలసియుంది. దాన్ని యెదుర్కొనుటకు తగిన ఆయుధంగాని, కావలసిన ధైర్యంగాని ఒక్కసోషల్ డెమోక్రాటులకే

ఉంది. జాతీయతకు యెదురుగా వారు అంతర్జాతీయతను, వర్గపోరాటంయొక్క ఐక్యతను నిలబెట్టియెదుర్కోవాలి. జాతీయ భావంయొక్క వుధృతి యెక్కువైనకొలదీ అంతకన్న యెక్కువ దీక్షతో, యింకా గట్టిగా రష్యాలోని అన్ని జాతుల శ్రామికులను తమవర్గ ఐక్యతను సుహృద్భావాన్నీ పెంపొందించుకోమని హెచ్చరించాలి. ఈ జాతీయోద్యమాలు సరిహద్దు ప్రదేశాలలో తీవ్రంగా నడుస్తూండడంవలన ఆ ప్రదేశాలలోని సోషల్ డెమోక్రాట్లపై యెక్కువ బాధ్యతలుంటాయి; వారు తమ బాధ్యతా నిర్వహణకు అంకురిత ధైర్యంతో పనిచేయవలసి యుంటుంది.

"కాని 'సోషల్ డెమోక్రాటు' లందరు ముఖ్యంగా సరిహద్దు ప్రదేశాల్లోనివారు తమ కార్యనిర్వహణను సరిగా చేయలేకపోయేరు. అప్పటివరకు ఉమ్మడి ఆశయాలకు (Common aims) ప్రాధాన్యతనిస్తూ వచ్చిన 'బండ్' ప్లేటుమార్చి పూర్తిగా సంకుచిత జాతీయోద్దేశాలకు ప్రాముఖ్యత నీయసాగింది; ఎలక్షన్ ప్రచారంలో "సబ్బాత్; ఇడ్డిష్‌భాష గుర్తింపబడాలి" అనేవి ప్రధాన సమస్యలుగా చేసింది. కాకసస్‌లోని కొందరు సోషల్ డెమోక్రాట్లుకూడా బండ్ ననుసరిస్తున్నారు. వెనక "జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలన" నినాదాన్ని నిరాకరించినవారే నేడు దానిని తక్షణ సమస్యగా ప్రచారం చేస్తున్నారు. 'లిక్విడేటర్సు' (Liquidators)[4] కాన్ఫరెన్సు కొంతవరకు యీ జాతీయవూగుడు తత్వానికి తన సానుభూతినిచ్చింది."

"దీనినంతనూబట్టి జాతీయ సమస్యపై రష్యన్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీ యొక్క అభిప్రాయాలు సోషల్ డెమోక్రాట్లందరకూ పూర్తిగా అర్థం అవలేదని తేలుతోంది.

"జాతీయ సమస్యమీద సంపూర్ణమైనచర్చ అవసరమని స్పష్టపడుతోంది. నిజమైన సోషల్ డెమోక్రాట్లందరూ జాతీయతపేరుతో చెలామణీ అవుతూన్న తప్పుడు సిద్ధాంతాలను ప్రచారాన్ని ధైర్యంతో యెదుర్కొని పోరాడాలి."



## సిద్ధాంతం

"విప్లవ సిద్ధాంతం ఒక మంత్రంలాంటిది కాదు" అని కామ్రేడ్ లెనిన్ చెప్పాడు. ఆచరణకు సిద్ధాంతం సహాయకారిగా ఉండాలి గనుక "ఆచరణలో ఎదుర్కొనే సమస్యలను సిద్ధాంతం పరిష్కరించవలసి ఉంటుంది". సిద్ధాంతానికి ఎప్పుడూ ఆచరణే గీటురాయి కాబట్టి "నిజమైన ప్రజాసామాన్యంలోనూ, విప్లవోద్యమంలోనూ అమలుజరపడం ద్వారా నిగ్గుదేరినప్పుడే అది అసలు సిద్ధాంతం అవుతుంది".

\- స్టాలిన్

# I. జాతి

## జాతి అనగా యేమిటి?

ఒక నిర్దుష్టమైన మానవసంఘమే జాతి యనబడుతుంది. కాని యీ సంఘం ఒకతెగకు (Race) గాని, గుంపుకుగాని సంబంధించినదికాదు. రోమన్లు, ట్యూటన్లు, ఎట్రూస్కన్లు, గ్రీకులు, అరబ్బులు మొదలగు తెగలన్నీ కలిసి నేటి యిటాలియన్ జాతి యేర్పడింది. గాల్సు, రోమన్లు, బ్రిటన్లు, ట్యూటన్లు కలిసి ఫ్రెంచిజాతి యేర్పడింది. ఈవిధంగానే బ్రిటిష్, జర్మనీ జాతులు కూడా వివిధతెగలకు చెందిన ప్రజల కలయిక వలన యేర్పడినవే.

అంటే, ఒకతెగకుగాని, గుంపులకుగాని సంబంధించినదిగాగాక చారిత్రాత్మకంగా నిర్మితమైన మానవసంఘమే 'జాతి' అనబడుతుంది.

అయితే వివిధతెగల కలయికతో చారిత్రాత్మకంగా యేర్పడిన సైరస్, అలెగ్జాండర్ల సామ్రాజ్యాలను జాతులనడానికి వీలులేదు. ఆ సామ్రాజ్యాలు ఒకటిగా వుండుటగాని, విచ్ఛిన్నమగుటకాని, ఆయా చక్రవర్తుల జయాపజయాలపై ఆధారపడియుండేవి; వాటిలోని వివిధతెగల కలయిక తాత్కాలికమైనది మాత్రమే, సన్నిహితసంబంధంలేదు.

కనుక, తాత్కాలికంగా యేర్పడిన వివిధగుంపుల కలయికగాక (Conglomeration) స్థిరత్వాన్ని కల్గియున్న ప్రజాసంఘమే జాతియనిపించుకుంటుంది.

కాని స్థిరత్వాన్ని కల్గియున్న ప్రతి ప్రజాసంఘమూ (Community) జాతి అవదు. ఆస్ట్రియా, రష్యాలే మనకుదాహరణ. అవి జాతులని పిలువబడుటలేదు. జాతీయసంఘానికీ (National Community) రాజకీయ కలయికకు (Political Community) తేడా యెక్కడవుంది? ఒక సామాన్యభాషలేనిదే జాతిలేదు: కావి రాజకీయకలయికకు భాషాసామ్యం అవసరంలేదు. ఒకేరాజ్యం (State) లో వివిధ భాషలు వాడుకలో వుండవచ్చు. ఆ ప్రజలకు సామాన్యభాషయే లేకపోయినట్లయితే ఆస్ట్రియాలోని జెక్కులందరూ ఒకజాతిగాను, రష్యాలో పోల్సు అంతా ఒకజాతిగాను యేర్పడుటే అసంభవమయేది. అయితే వివిధభాషలు తమ సరిహద్దులో మాట్లాడబడుతూండుట ఆస్ట్రియా, రష్యా రాజ్యాంగాలకు యేవిధంగానూ అభ్యంతరంకాదు. ఇక్కడ మనంచెప్పేది ప్రజల వ్యావహారిక భాషను గురించే కాని ప్రభుత్వభాషను గురించికాదు.

కాబట్టి ఒకే సామాన్యభాషను కలిగియుండుట జాతికుండవలసిన ప్రధాన లక్షణాలలో ఒకటి.

అయితే వివిధజాతుల ప్రజలు తప్పకుండా భిన్నభాషల నుపయోగిస్తారనికాని, ఒకభాషను మాట్లాడే ప్రజలంతా ఒకే జాతియనికాని దీని అర్థంకాదు. ఒక జాతి ప్రజలు

ఒక భాషనే వాడాలి; కాని వివిధజాతులు వేర్వేరు భాషల నుపయోగించకపోవచ్చు. ఒకే జాతి ప్రజలు ఒకటికన్న యెక్కువ భాషల నుపయోగించరు, కాని ఒకేభాషను మాట్లాడే రెండు వేర్వేరు జాతులుండవచ్చును.

ఇంగ్లీషు, అమెరికన్ ప్రజలు ఒకేభాషను మాట్లాడుతున్నా వారొకటేజాతిగా యెన్నడూ పరిగణింపబడరు. నార్వీజియన్లు, డేన్లు (Danes) ఒకేభాష నుపయోగిస్తారు. కాని వారు రెండు భిన్నజాతులుగానే పరిగణింపబడతారు. ఇంగ్లీషు, ఐరిష్ ప్రజల విషయంలో కూడ యిదే వర్తిస్తుంది.

ఇంగ్లీషువారూ, అమెరికన్లు భాషాసామ్యం కల్గియున్నా ఒకేజాతిగా యెందుచేత గుర్తింపబడుటలేదు?

ప్రధానమైనకారణం, వారు కలిసి ఒకేప్రదేశంలో నివశించకుండా వేర్వేరు దేశాలలో నివశిస్తున్నారు. తరతరాలుగా కలిసిమెలిసి యుంటూ యెడతెగని చిరకాలసాంగత్యాన్ని కల్గియుండుటద్వారానే జాతి అనేది యేర్పడుతుంది. ఆ చిరకాలసాంగత్యం, సన్నిహిత తత్వం అనేవి ఒకటిగా కలసి వున్న భూప్రదేశంలో (Geographical territory) నివశించే ప్రజలలో తప్ప సాధ్యంకావు. మొదట ఇంగ్లీషువారూ, అమెరికన్లూ కలసి ఇంగ్లండులో వుంటూన్న రోజుల్లో వారందరూ ఒకేజాతి. తర్వాతవారిలో ఒక భాగం అమెరికా అనే కొత్తదేశానికిపోయి కాలక్రమేణ అమెరికన్ జాతిగా యేర్పడ్డారు. ఈవిధంగా భిన్న దేశాల్లో నివశిస్తూండుటవలన వారు భిన్న జాతులుగా యేర్పడ్డారు.

అందుచేత ఒకే ప్రదేశంలో (Territory) నివశించుట, జాతికి వుండవలసిన ముఖ్యలక్షణాలలో ఒకటి.

అయితే ఒకేప్రదేశంలో నివశిస్తూన్నంతమాత్రాన ఆ ప్రజలందరూ ఒకజాతిగా యేర్పడరు. ఆ ప్రజల్లోని వివిధభాగాలను ఒకటిగా సంఘటితపరచే అంతరంగిక ఆర్థిక సంబంధాలు కూడా వుండాలి. ఇంగ్లండు అమెరికాల మధ్య అటువంటి సంబంధం లేకపోవుటచేతనే అవి రెండూ భిన్నజాతులుగా పరిగణింపబడుతున్నాయి. ఉత్పత్తివిధానంలో కల్గిన అభివృద్ధికరమైనమార్పులు, రాకపోకల సౌకర్యాల అభివృద్ధి మొదలగు వాటిద్వారా అమెరికాలోని వేర్వేరు ప్రదేశాలు ఒకే ఆర్థికవిధానం క్రిందకు వచ్చినై, తద్వారానే అమెరికా కూడ జాతియని పిలువబడుటకు అర్హతను సంపాదించింది.

ఉదాహరణకు, జార్జియన్ల సంగతి చూడండి. 1861లో బానిసత్వ నిర్మూలనకు పూర్వం జార్జియన్లు ఒకే ప్రదేశంలో వుంటూ, ఒకేభాషను మాట్లాడుతూవుండేవారు. అయినా, వారందరూ చిన్న చిన్న జమీందారీలుగా విడిపోయి, పరస్పర కలహాలను విద్వేషాలను పెంచుకుంటూ ఒకే ఆర్థిక జీవనవిధానం క్రిందకు రాలేకపోయేరు. అందుచేతనే వారిని ఆనాడు 'జాతి' అనలేదు. శతాబ్దాల తరబడి యీ పరస్పరకలహాలు, యుద్ధాలు తీవ్రంగా నడిచేయి, అపుడపుడు తమకలహాలలో యితరరాజ్యాల సహాయాన్నికూడ అర్థిస్తూండేవారు.

ఎప్పుడైనా ఒక బలవంతుడైన రాజు క్రింద యీచిన్నరాష్ట్రాలన్నీ ఒకే పరిపాలనలోనికి తాత్కాలికంగా వచ్చినా, జమీందార్ల పరస్పర ద్వేషాలు, ప్రజాసామాన్యం యొక్క మూకీభావం మూలాన ఆ ఏకత్వం త్వరలోనే విచ్ఛిన్నమైపోయేది. ఆర్థికంగా విచ్ఛిన్నమైయున్న ఆనాటి జార్జియాలో యింకోలా జరుగుతుందనుకోవడానికి అవకాశం లేదు. 19వ శతాబ్దపు చివరిభాగంలో జార్జియాలో బానిసత్వం నిర్మూలమై ఒకే దేశీయార్థిక జీవనవిధానం అనేది అభివృద్ధి చెందింది. రాకపోకల సౌకర్యాలు విస్తృతమయేయి. పెట్టుబడిదారీవిధానంకూడ అపుడపుడే తలచూపుతోంది. వీటన్నిటివలన వివిధరాష్ట్రాల మధ్య సంబంధం యెక్కువైంది. అంతవరకు అవి అవలంబించిన ఆర్థికస్వయంపోషకత్వం (Economic selfsufficiency) పూర్తిగా నిర్మూలించబడి అవన్నీ ఒకే ఆర్థికవిధానం క్రింద శ్రమ విభజన (Division of labour) ప్రవేశపెట్టబడి రాష్ట్రాలన్నీ ఒకే వ్యవస్థ (System) లోని భిన్నభాగాలుగా యేర్పడినై. అప్పటినుండి జార్జియా ఒకజాతిగా పరిగణించబడింది.

భూస్వామ్యవిధానంలోనుండి పెట్టుబడిదారీవిధానంలోనికి మార్పుచెందిన యితర జాతులన్నింటికీ కూడా యిది వర్తిస్తుంది.

కాబట్టి, ఒకే రకపు ఆర్థికజీవనాన్ని కల్గియుండి, ఒకే ఆర్థిక నిర్మాణం క్రిందవుండుట 'జాతికి' వుండవలసిన ముఖ్యలక్షణాలలో ఒకటి.

ఇంతలో పూర్తిగాలేదు. ఈపై చెప్పినవే గాక ప్రజల మనోతత్వాన్ని (Spiritual Complexion) కూడ మనం గుర్తించవలసియుంటుంది. జాతులు తమతమ జీవన విధానాల్లోనేగాక, మనోతత్వాల్లో కూడ భేదిస్తాయి. ఆ మనోతత్వం వారి వారి జాతీయ సంస్కృతిలో ప్రతిబింబిస్తుంది. బ్రిటీష్, అమెరికన్, ఐరిష్ ప్రజలు ఒకే సామాన్యభాషను కల్గియున్నా వారు వేర్వేరు జాతులుగా పరిగణింపబడుతున్నారంటే కారణం యేమిటి? వారి వారి భిన్న జీవిత పరిస్థితులమూలంగా తరతరాలనుండి వారిలో పెంపొందుతూ వచ్చిన ప్రత్యేక మానసికతత్వాలే చాలావరకు కారణం అని చెప్పవచ్చును. జాతీయస్వభావం (National Character) అనబడే యీ మానసికతత్వం నిర్వచనం చేయడం సాధ్యంకాదు. కాని అది ఆ జాతి ప్రజలయొక్క సంస్కృతిలో ప్రతిబింబించినంత వరకు దాని స్వభావాన్ని వర్ణించి నిర్వచనరూపం యివ్వవచ్చును. దానినెంత మాత్రమూ త్రోసి పారెయ్యడానికివీల్లేదు.

ఈ 'జాతీయస్వభావం' అనేది యెట్టిమార్పుకూ లోనుగాని, శాశ్వత లక్షణం కాదు. జీవిత పరిస్థితులలోని మార్పుతోబాటు అదికూడా యెప్పటిప్పుడు మారుతూనేవుంటుంది. మార్పుకు లోనౌతూన్నా అది ప్రతినిమిషం ప్రత్యక్షమవుతూనే వుంటుంది. దాని ప్రభావం జాతియొక్క నిర్మాణం (Physiognomy of the nation) మీద యెప్పుడూ కన్పిస్తూనే వుంటుంది.

అందుచేత, ఒకే మానసిక తత్వాన్ని కల్గియుండుట జాతికి వుండవలసిన ప్రధాన లక్షణాలలో ఒకటి.

ఇపుడు 'జాతి'ని నిర్వచిద్దాం. "ఒకే భాషను మాట్లాడుతూ, ఒకే రకపు ఆర్ధికజీవనాన్ని, మానసికతత్వాన్ని, సామాజిక సంస్కృతిలో ఒకేరకపు విజ్ఞానాన్ని కల్గియుండి, ఒకే భూభాగంలో నివశిస్తూ చారిత్రకంగా (నిర్మితమై) అభివృద్ధిపొందిన ప్రజాసంఘమే జాతి యనబడుతుంది."

ప్రతి యితర చారిత్రక విషయానికివలెనె 'జాతి' కూడా యెప్పుడూ మార్పుకు లోనౌతూనే వుంటుంది. దానికీ చరిత్రవుంది; ఆద్యంతాలున్నై.

ఒకటిమాత్రం గుర్తించాలి. పై లక్షణాల్లో యే వొక్కటీ ప్రత్యేకంగా 'జాతి'ని నిర్వచింపజాలదు. కాని వీటిలో యే ఒక్కటి లోపించినా అది 'జాతి' అనిపించుకోజాలదు.

ఒకజాతి ఆర్ధికంగా విచ్ఛిన్నమై యున్నపుడు, వేర్వేరు ప్రదేశాలలో నివశించేటపుడు, వివిధ భాషలను మాట్లాడుతూన్నప్పుడు, ఆ ప్రజలందరకూ ఒకే జాతీయస్వభావము, సంస్కృతి వున్నాసరే వారు 'జాతి' అని పిలువబడుటకు అనర్హులే. రష్యాలో, గెలీషియాలో, అమెరికాలో, జార్జియాలో, కకేషియాలో నివశించే యూదులను ఒకేజాతిగా పరిగణింపక పోవుటకిదే కారణం.

అలాగే, ఒక ప్రదేశంలోనే నివశిస్తూ సామాన్య ఆర్ధిక జీవనాన్ని కల్గియున్న ప్రజలు కూడా వారిలో భాషాసామ్యం, జాతీయ స్వభావం లోపించి నట్లయితే. 'జాతి'యని పిలువబడరు. బాల్టిక్ ప్రదేశంలో లెట్సు, జర్మన్లుకు యిదివర్తిస్తుంది.

నార్వీజియన్లు, డేనులు ఒకేభాష నుపయోగిస్తారు. అయినప్పటికీ మిగతా యితరలక్షణాలు లోపించుటచేత వారు ఏకజాతిగా పరిగణింపబడుటలేదు. ఈ లక్షణాలన్నీ వుంటేనే 'జాతి' అనే పేరు సార్ధకమూ, ఉచితమూ ఔతుంది; జాతీయసమస్యా సిద్ధాంతవేత్తలైన (Theoriticians) సోషల్ డెమోక్రాట్సుగా ఆస్ట్రియాలో ప్రసిద్ధులైన స్ప్రింగర్ (R. Springer), బవర్ (G. Baver) ల అభిప్రాయ ప్రకారం, 'జాతీయ స్వభావం' జాతికి వుండవలసిన వివిధలక్షణాల్లో ఒకటిమాత్రమేకాక అసలు అది ఒక్కటే 'జాతి'కి వుండవలసిన ప్రధాన లక్షణం. మిగిలినవన్నీ "జాతి" యొక్క అభివృద్ధికి తోడ్పడే అంశములు (Factors) మాత్రమే, కాని అవి ప్రత్యేకంగా లక్షణాలుకావు.

'జాతి'ని గురించి వాళ్ళసిద్ధాంతం యేమిటో పరిశీలిద్దాం. స్ప్రింగర్ అభిప్రాయం ప్రకారం "ఒకేభాష మాట్లాడుతూ, ఒక దృక్పథం (Similarly thinking) కల వ్యక్తుల సమూహమే 'జాతి' అవుతుంది. అది ముఖ్యంగా ఒక వైజ్ఞానిక సమాజం. ఆ ప్రజలు ఒకే ప్రదేశంలో నివశించక పోవచ్చును కూడాను."

అంటే, ఒకేభాషను మాట్లాడుతూ ఒకే దృక్పథం కల్గియున్న ప్రజా సమూహం-వారిలో యెన్ని విభేదాలున్నా, అనైక్యతయున్నా, వారెక్కడ నివశిస్తూన్నాసరే - జాతి అనబడుతుంది.

బవర్ యీ సిద్ధాంతాల్నింకా విపులీకరించేడు.

"జాతి అంటే యేమిటి? ఒకేభాషను మాట్లాడేవారందరూ ఒక 'జాతి' అవుతారా?

అయితే ఇంగ్లీషువారు ఐరిష్ ప్రజలు ఒకేభాషను కల్గియున్నా వారొక జాతికాదే, యూదులకు ఏకభాష లేకపోయినా వారొకటేజాతిగా పరిగణింపబడుతున్నారే."

అయితే మరి 'జాతి' అంటే యేది?

"ఇంచుమించు ఒకే స్వభావాన్ని కల్గియున్న ప్రజాసమూహమే జాతి." కాని స్వభావం అంటే, జాతీయస్వభావం అంటే ఏమిటి?

జాతీయ స్వభావం అంటే,

'ఒక జాతినుంచి మరొక జాతిని, ఒకజాతి ప్రజలనుండి, మరొక జాతి ప్రజలను వేరుగా చూపించే (distinguish) భౌతిక (శారీరక) ఆత్మిక లక్షణముల మొత్తం.

జాతీయస్వభావం అనేది యెలాపుట్టింది. ఆకాశంమీద నుంచి వూడిపడిందా? దానికి సమాధానంగా బవర్ ఇలా అంటాడు.

"ప్రజలయొక్క స్వభావాన్ని నిర్ణయించేది వాళ్ళ అదృష్టమే (Fate). ఇంచుమించు ఒకే అదృష్టమునకు లోనైయున్న ప్రజలందరూ ఒకజాతిగా ఏర్పడతారు, తమ జీవితావసరముల నెట్లు వుత్పత్తి చేసుకుంటారో, తమ శ్రమశక్తి ఫలితములనెట్లు విభజించుకుంటారో ఆ పరిస్థితులను బట్టియే ఆ 'అదృష్టం' అనేది నిర్ణయింపబడుతుంది."

అందుచేత "ఒకే విధమైన అదృష్టంవలన కల్గిన ఒకేవిధమైన సామాన్యస్వభావం కల్గియున్న ప్రజల సమూహమే జాతి" ఇదీ బవర్ యొక్క నిర్వచనం.

అంటే, స్వభావసామ్యం (Community of character) వుంటే చాలు. సామాన్య ప్రదేశం, ఒకేభాష, ఆర్థిక జీవనవిధానం లేకపోయినాసరే.... జాతి అవుతుందన్నమాట.

కాని అటువంటి 'జాతి'లో యేముంది? వేర్వేరు ప్రదేశాల్లో నివశిస్తూ, భిన్న ఆర్థికవిధానాలక్రింద జీవిస్తూ, తరతరాలుగా వేర్వేరు భాషలను మాట్లాడుతూవుండే ప్రజలను ఒకే 'జాతి'గా పరిగణించుటలో యేమైనా అర్థంవుందా?

యూదులకు ఏకభాష లేకపోయినా, వారు ఒకే 'జాతి' అంటాడు బవర్. కాని వేర్వేరు ప్రదేశాల్లోవుంటూ, వేర్వేరుభాషలు మాట్లాడుతూ, పరస్పరసంబంధం లేకుండావున్న జార్జియన్, రష్యన్, అమెరికన్ దేశాలలోని యూదులమధ్య 'అదృష్టసామ్యంగాని, స్వభావసామ్యంగాని, యేమి వుంటుంది? ఏకజాతి ప్రజల మధ్యనుండే కూర్పు (Cohesion) కలయిక వారిలో యేం వుంటుంది?

పై చెప్పిన యూదులందరూ తాము నివసించే ప్రదేశంలోని మిగతాజాతి ప్రజలతోబాటు ఒకే రాజకీయజీవనంలో పాల్గొంటూ, ఒకే వైజ్ఞానిక వాతావరణంలో వుంటారు; అంటే జార్జియాలోని యూదులు జార్జియన్ల యొక్క విజ్ఞానంలో, ఆర్థికరాజకీయవ్యవస్థలో పాల్గొంటారు. అమెరికాలోని యూదులు అమెరికన్లయొక్క

విజ్ఞాన, ఆర్థిక రాజకీయజీవితంలో పాల్గొంటారు. అదేవిధంగా రష్యాలోని యూదులు. వాళ్ళజాతీయ స్వభావంమీద యీ పరిసరాలకెంతో ప్రాబల్యంవుండకతప్పదు, ఈ యూదులందరకూ సామాన్యమైనదేమైనావుంటే అది వారియొక్క మతము, పుట్టుక (Origin), యేవో కొన్ని జాతీయాచారములు మాత్రమే. అయితే, వారు నివశించే సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక పరిసరములకంటే కూడ యేవో పురాతనాచారములు, మతచిహ్నములు వారి అదృష్టముమీద, స్వభావంమీద యెక్కువ ప్రాబల్యాన్ని గల్గియుంటాయనడంలో యేమీ సబబు లేదు. ఈ పురాతన మతాచారములే వారి 'అదృష్టము' నిర్ణయిస్తాయని అనుకుంటేనేతప్ప 'యూదులు' ఏకజాతిగా పరిగణింపబడరు.

ఆధ్యాత్మికవాదుల అగోచరమైన 'జాతీయ (National spirit) స్ఫూర్తికీ, బవర్ యొక్క 'జాతి'కి తేడాయేమిటి?

బవర్ సిద్ధాంతప్రకారం, 'జాతి' నిర్ణయించే అసలైన లక్షణం 'జాతీయస్వభావం'. అందుచే అతడు ఆ 'స్వభావాన్ని' ఆ ప్రజల జీవనపరిస్థితులనుండి పూర్తిగా వేరుచేసి వాటికి మధ్యగా పెద్దగోడ కట్టేసేడు. కాని జాతీయస్వభావం జీవిత పరిస్థితులయొక్క ప్రతిబింబమేనని, పరిసరముల స్వభావమే దానిని నిర్ణయిస్తుందనీ బవర్ మరచిపోయేడు. అటువంటప్పుడు అసలు విషయాన్ని వదిలేసి ప్రతిబింబమైన జాతీయ స్వభావాన్ని మాత్రమే ప్రాధాన్యత నీయడం అసంబద్ధముకాదా?

19వ శతాబ్దపు ప్రారంభంలో కూడ అమెరికా సంయుక్త రాష్ట్రాలు 'నూతన ఇంగ్లండు' (New England) అనే వ్యవహరింపబడేయి. ఆరోజుల్లో కూడా ఇంగ్లీషు, అమెరికన్ జాతులు రెండు భిన్నజాతులుగా యెందుకు పరిగణింపబడినవి? వారిద్దరిమధ్యగల తేడా ఏమిటి?

'జాతీయస్వభావం' కాదని నిశ్చయంగా చెప్పవచ్చును. ఎందుచేతనంటే అమెరికన్లు కూడ మొదట యింగ్లీషువారే; వారు తమతో ఇంగ్లీషు భాషను, ఇంగ్లీషు జాతీయ స్వభావాన్ని కూడా అమెరికాకు తెచ్చుకున్నారు. అమెరికాదేశపు నూతన పరిస్థితులలో వారి ప్రత్యేక స్వభావం ఏర్పడే అవకాశం వున్నప్పటికీ, ఆనాటికి వారొచ్చి ఎక్కువకాలం కాకపోవుటచేత వారిలో అప్పటికి ఇంగ్లీషు జాతీయ స్వభావమేవుంది. అది ఇంకా అప్పటికి మాసిపోలేదు. కాని వారురివురిలో ఒకే జాతీయస్వభావం వున్నప్పటికీ, ఆనాటికే అమెరికన్లూ, ఇంగ్లీషువారు భిన్నజాతులుగా వ్యవహరింపబడుతున్నారు. దీన్నిబట్టి, న్యూ ఇంగ్లండు (అమెరికన్) జాతికీ, ఇంగ్లండుజాతికి గల తేడా జాతీయ స్వభావంలో కాదనీ, వారివారి భిన్నపరిసరాలు, జీవనపరిస్థితులలోనే అనీ తేలుతూంది. అంటే వారిని వేరు 'జాతి'గా నిర్ణయించినవి యితర విషయాలేకాని 'జాతీయ స్వభావం' కాదని తెలుస్తూంది.

ఒక జాతికి ఒకే ఒక ప్రత్యేక లక్షణం (Characterisic) వుండదని దీన్నిబట్టి స్పష్టమౌతుంది. పైచెప్పిన లక్షణాలన్నీ కలిసేవుంటాయి. కాని వివిధజాతులను పోల్చి చూచినపుడు ఒక్కొక్క లక్షణం ప్రకారం ప్రాధాన్యత కల్గియుంటుంది. కొన్ని జాతులకు

భాష ప్రధానమైవుండొచ్చు; కొన్నిటిలో దేశం, ఆర్థికపరిస్థితులు యెక్కువ ప్రాముఖ్యతతో కన్పించవచ్చు; అయినప్పటికీ యీ లక్షణాలన్నీ (కొద్దో, గొప్పో) కలిసిననాడే అది 'జాతి' అవుతుంది.

బవర్ అభిప్రాయప్రకారం 'జాతి', 'జాతీయస్వభావం' రెండూ ఒకటే; అతని 'జాతికి' పరిసరాలతో సంబంధంలేదు: అది యొక స్వయంపరిపూర్ణమైన, అగోచరమైన శక్తి (Force). 'జాతి' అంటే ఒక సజీవ విషయంకాదు. అది మానవాతీతమైనది, అవాఙ్మానసగోచరమైనది.

ఉదాహరణకు చూడండి. జార్జియన్, డాగేస్తావియన్, అమెరికన్, రష్యన్ యూదులందరు కలిసి ఏకజాతి యెట్లా అవుతారు? వాళ్ళలో వొకరి భాష మరొకరికి తెలియదు. ప్రపంచంలో వేర్వేరు ప్రదేశాల్లో నివశిస్తారు. ఎటువంటి సమయంలోనూ కూడా వారంతా కలిసి యే పనీ చేయరు; యెట్టి పరస్పర సంబంధాలు లేవు వారి మధ్య వారినందరినీ కలిసి 'వొకేజాతి' అనడంలోయేమీ అర్థంలేదు; అది వాస్తవికతకు దూరం. సోషల్ డెమోక్రాటిక్ పార్టీ యొక్క 'జాతీయ కార్యక్రమం' (National Programme) యిటువంటి వూహాజనితములైన జాతులకుకాదు. తమ పనుల ద్వారా దృష్టినాకర్షించే సజీవమైన 'జాతుల'కు మాత్రమే మన 'జాతీయ కార్యక్రమం' వుద్దేశింపబడింది.

బవర్ 'జాతి'కీ (Nation) తెగ (Tribe) కీ మధ్యతేడా సరిగా గ్రహించక రెండింటినీ కలగాపులగం చేస్తున్నాడన్నమాట. 'జాతి' అనేది చారిత్రకంగా పుట్టింది. 'తెగ' అనేది మానవులలోని శారీరక భేదాలనుబట్టి నిర్ణయింపబడింది. (Nation is a historical category, tribe is an ethnographical category)

తన సిద్ధాంతంలోని బలహీనతను బవర్ కూడా గుర్తించినట్లే తోస్తుంది. తన పుస్తకంలో మొదట 'యూదులు' ఒకే జాతియని చెప్పేడు కాని, చివరమాత్రం మళ్ళీ తన తప్పులు సవరించుకున్నాడు. "పెట్టుబడిదారీవిధానం ఫలితంగా యూదులొకేజాతిగా వుండుట అసంభవంగా వుంది." అని చెప్పేడు. వాళ్ళు నివసించుటకు ప్రత్యేకంగా ఒక ప్రదేశం లేకపోవుటే దీనికి కారణం అని చెప్పేడు; జెక్కులకటువంటి ప్రత్యేక ప్రదేశం వుంది కనుక వారొకజాతిగా నిలబడతారనికూడా అంగీకరించేడు. చివరికి 'ఒకే ప్రదేశం లేకపోవుటే యూదులు 'జాతి'గా పరిగణింపబడకపోవుటకు కారణం'.

యూదుశ్రామికులకు 'జాతీయ స్వపరిపాలన' అడుగుటకు హక్కులేదని నిరూపించుటకుగాను బవర్ యీ విధంగా వాదించుకొచ్చేడు. కాని యీవాదన పాపం! అతడి 'జాతి' సిద్ధాంతాన్నంతటినీ తలక్రిందులు చేసింది. అతని సిద్ధాంతం ప్రకారం 'ఒకే నివాసప్రదేశం' వుండుట 'జాతి'కి అవసరం లేదు. కాని యూదులను గురించిన చర్చలో అతడు తేల్చిన సారాంశాన్ని బట్టి 'ఆ ప్రదేశం' ముఖ్యం అని అతడే అంగీకరించేడు.

బవర్ అంతటితో ఆగలేదు. మొదట "యూదులకు సామాన్యభాష లేకపోయినా, వారు ఏకజాతియే" అన్నాడు. కాని అతడి పుస్తకంలో 126వ పేజీలోనే సామాన్యభాష

లేనిదే 'ఏకజాతి' అనేది అసంభవం అని స్పష్టంగా చెప్పేడు.

అతడి సిద్ధాంతంలో 'సామాన్యభాష'కు ప్రాధాన్యత లేనేలేదు. మానవులమధ్య పరస్పరసంబంధాలను పెంపొందించుటకు అతి ప్రధానమైన సాధనం భాషయేనని నిరూపించబోయి, అనుకోకుండానే, తన 'జాతి' సిద్ధాంతం శుద్ధ తప్పు అని ఋజువు చేసుకున్నాడు.

అందుచేత బవర్ యొక్క సిద్ధాంతం పరస్పర విరుద్ధమనీ, అసంబద్ధమైనదనీ స్పష్టమైంది.



"ఇతరులతో వారెంత అవిశ్వసనీయులైనప్పటికీ - తాత్కాలికంగా ఒడంబడిక చేసుకొని కలసి పనిచేయడానికి ఆత్మవిశ్వాసం లేనివారు మాత్రమే భయపడతారు. ఆవిధంగా ఇతరులతో ఎలాంటి ఒడంబడికలు లేకుండా ఏ ఒక్క రాజకీయ పార్టీకూడా మనజాలదు.

"కాని ఆవిధంగా ఇతరులతో ఒడంబడిక చేసుకొన్నప్పుడు ఒక షరతుమాత్రం ఉంచుకోవాలి. అదేమంటే కార్మికవర్గ ప్రయోజనాలకు బూర్జువావర్గ ప్రయోజనాలు ఖచ్చితంగా విరుద్ధమైనవని కార్మికులలో ప్రచారం చేసుకొనేందుకు సామ్యవాదులకు పరిపూర్ణ స్వాతంత్ర్యం వుండాలి."

- లెనిన్

సభ్యులు కానివారి ఎదుట మన కామ్రేడ్స్ అనేకమంది తమ గొప్పలు చెప్పుకోజూస్తారు. ఇతరులను తక్కువ దృష్టితో చూస్తారు. ఇతరుల్లో ఉండే సుగుణాలను గుర్తించ నిరాకరిస్తారు. ఇవన్నీ ఒంటెత్తుగడల లక్షణాలు. ఏ కొంచెమో మార్క్సిజం లెనినిజం చదివిన ఈ కామ్రేడ్స్ వినయవిధేయతలు నేర్చుకోడానికి బదులుగా ఎక్కువ గర్విష్ఠులవుతున్నారు.

మో-సి-టుంగ్

"న్యు చైనా న్యు వరల్డ్"

# II. జాతీయోద్యమం

జాతి అనేది పెట్టుబడిదారీ యుగానికి సంబంధించిన చారిత్రక విషయం. భూస్వామ్య విధాన నాశనమూ, పెట్టుబడిదారీవిధానం యొక్క అభివృద్ధిక్రమమూ, జరుగుతున్న సమయంలోనే అవి ప్రజలను జాతులుగా కూడదీసేయి. పశ్చిమయూరపులో యిదే జరింది. బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీలలో పెట్టుబడిదారీవిధానం, భూస్వామ్య పద్ధతిని కూలద్రోసి సత్వరాభివృద్ధి చెందుతూన్న సమయంలోనే ఆయా దేశాల ప్రజలు జాతులుగా యేర్పడ్డారు.

పశ్చిమయూరపులో ప్రజలు జాతులుగా యేర్పడుటయు ఆ దేశములలో జాతీయ ప్రభుత్వ స్థాపనయు అవినాభావ సంబంధాన్ని కల్గియున్నాయి. బ్రిటిష్ ఫ్రెంచి ప్రజలు జాతులుగా యేర్పడుట, బ్రిటిష్ ఫ్రెంచి జాతీయ ప్రభుత్వ స్థాపనయు ఒకేసారి జరిగేయి. ఈ సూత్రానికి ఐర్లండు మాత్రం మినహాయింపు (Exception).

తూర్పు యూరపులోమాత్రం సంఘటనలు భిన్నమార్గాన నడిచేయి. పశ్చిమ యూరపు జాతులు తమ జాతీయరాజ్యాంగనిర్మాణం గావించుకునే రోజుల్లోనే తూర్పుయూరపులో బహుజాతి ప్రభుత్వాలు (Multi National States) యేర్పడుతు వచ్చేయి. ఆస్ట్రియా-హంగరీ, రష్యాలే మనకుదాహరణ, ఆస్ట్రియాలో, రాజకీయంగా యెక్కువ అభివృద్ధిదశలోవున్న జర్మన్‌జాతి ఆస్ట్రియాలోని మిగతాజాతులన్నిటినీ తన ఆధిపత్యంక్రిందకుతెచ్చి ఒక కేంద్రప్రభుత్వాన్ని స్థాపించింది. హంగరీలో మాగియారులు మిగతా జాతులను కలుపుకొని హంగరీరాజ్యాన్ని స్థాపించేరు. రష్యాలో యీ పనిని మంచి పలుకుబడీ, బలమూకల గ్రేట్ రష్యాన్ జమిందారీవర్గం చేసింది.

తూర్పు యూరపుదేశాల్లో అప్పటికింకా భూస్వామ్యవిధానం అమలులోనేవుంది, పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందలేదు. కొన్ని జాతుల ప్రజలకేవిధమైన ఆర్థిక వ్యవస్థయులేదు. అటువంటి పరిస్థితులుండుటవలన బలీయమైన జాతి మిగతాజాతుల్ని తన అధికారంక్రింద ఒకేరాజ్యాంగం (State) లోనికి తెచ్చుట సాధ్యమైంది.

కాని త్వరలోనే ఆ దేశాల్లో కూడా పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందసాగింది. పట్టణాలు, రాకపోకల సౌకర్యాలు యెక్కువయినై. వివిధ జాతులు తమతమ ఆర్థికవ్యవస్థను బలపరచుకొనసాగేయి. పెట్టుబడిదారీ విధానం పాలిత జాతుల్లో అశాంతిని, అలజడిని కల్గించసాగింది. ఆనాటి వాఙ్మయంద్వారా, రంగస్థలంద్వారాను 'జాతీయభావాలు, ప్రచారం కాసాగేయి. ఆస్ట్రియన్, రష్యన్ శాసనసభలలోని చర్చలుకూడా యీ ప్రచారానికి' తోడ్పడినై. మేధావుల (Intelligentsia) లో కూడా యీభావాల ప్రాబల్యం కన్పడింది. వారు కూడా ఆ భావాలకు దోహదం యివ్వసాగేరు.

కాని అప్పటికే ఆలస్యమైంది! పాలితజాతులలో స్వతంత్రజాతీయ భావాలు బలపడేటప్పటికే పాలకజాతులలోని అధికారవర్గాలు ప్రభుత్వాధికారసహాయంతో యీ జాతీయోద్యమాలను అణగద్రొక్కుట ప్రారంభించేయి. ఈ విధంగా ఆస్ట్రియాలోని జెక్కులు, పోల్సు; హంగరీలో క్రోటులు, రష్యాలో లెట్సు, లిధుయేనియన్లు, యూక్రేనియన్లు, జార్జియన్లు, ఆర్మీయన్లు మొదలగు పాలితప్రజలు జాతులుగా యేర్పడ్డారు.

అంటే పశ్చిమ యూరపులో జరిగినదానికి సరిగా వ్యతిరేకంగా జరిగిందన్నమాట తూర్పు యూరపులో. పశ్చిమాన ఐర్లండులో జాతీయోద్యమం బయల్దేరింది. అదేవిధంగా తూర్పుదేశాలలో కూడా జాతీయోద్యమాలు బయల్దేరాయి.

తత్ఫలితంగా నూతన జాతీయ భావప్రేరితులైన యీ పాలితజాతులకు, వారిపై అధికారం చెలాయిస్తూన్న పాలకజాతులకు మధ్య పోరాటాలు తప్పనిసరిగా జరిగేయి.

కాని యీపోరాటాలలో ఆయాజాతుల ప్రజాసామాన్యానికి సంబంధము తక్కువ. ఇరువైపులకూడా ఆయాజాతులలోని వున్నతవర్గాలే పోరాటం సాగించేయి. ఆస్ట్రియాలోవున్న జర్మన్ బూర్జువా వర్గముతో, జెక్ బూర్జువావర్గం పోరాడింది; పోలండులో పోలిష్ జమిందారీ వర్గంతో యుక్రేనియన్ భూస్వాములు పోరాడేరు; రష్యాలోని పాలకవర్గంతో పోలిష్, లిధుయేనియన్, యుక్రేనియన్ జాతులలోని బూర్జువావర్గాలు పోరాడేయి. ఏ జాతీయ పోరాటంలో చూసినా బూర్జువావర్గమే నాయకత్వాన్ని వహించింది.

ప్రతి జాతీయ బూర్జువావర్గానికి తమ సరుకు విడుదలచేసికొనుటకు మార్కెట్లను సంపాదించుటే ప్రధాన సమస్య. నమ్మకమైన మార్కెట్టు తన చేతులలోవుంటేనే అది యితరజాతుల బూర్జువావర్గాలతో పోటీకి నిలబడి జయించుట సాధ్యమౌతుంది. ‘ మా జాతికి ప్రత్యేక రాజ్యాంగం కావాలి’ అనే కోరికలోనే “మాకు నమ్మకమైన మార్కెట్లు కావాలి” అనేదికూడా యెప్పుడూ వుండితీరింది. యీ జాతీయోద్యమాలలో మార్కెట్టును సంపాదించవలసిన అవసరమే బూర్జువావర్గానికి జాతీయతను నేర్పింది.

కాని యీ సంఘటనలు ‘మార్కెట్ల’కు మాత్రమే సంబంధించి నడవవు. ఈ జాతీయోద్యమాలను అణచివేయుటకు పాలకజాతిలోని బూర్జువావర్గం తన శక్తులన్నిటిని కూడగట్టుకుని విజాతీయులపై ఎన్నో నిబంధనలను, నిర్బంధాలను ప్రయోగిస్తుంది. దాంతోటి పోరాటం, ఆర్థిక విషయాల నుండి రాజకీయ విషయాలలోకి మారుతుంది. పాలకజాతి తన శత్రువులపై యెన్నో నిర్బంధాలను పెడుతుంది; వారి హక్కులు అరికడుతుంది; భాషపై యెన్నో నిర్బంధాలు, పాఠశాలలు, మతవిషయాలు, వోటింగు హక్కు ప్రతిదానిమీదా యెన్నో నిర్బంధాలు విధిస్తుంది. తన జాతి బూర్జువా వర్గక్షేమంతో బాటు అధికారంలోవున్న తమ ముఠాయొక్క ప్రాబల్యాన్ని నిలబెట్టుకొనుటకు కూడా యీ నిర్బంధవిధానం ప్రయోగించుటలో పాలకజాతిలోని అధికారుల (Bureaucracy) ఆశయమై వుంటుంది. సామాన్యంగా అభిప్రాయం, ఆశయం యేదైనప్పటికీ ఫలితం

మాత్రం ఒకటే. పాలకజాతి బూర్జువావర్గమూ, అధికారంలోవున్న ముఠా (Bureaucracy) రెండూ కలసి పాలితజాతులపై నిర్బంధవిధానాన్ని రుద్దుతారు.

బానిసదేశంలో బూర్జువావర్గం నలుమూలలా నిర్బంధాలకూ, దోపిడీ విధానానికి గురియై కొంతకాలానికి సహజంగానే చైతన్యవంతం అవుతుంది. "మాతృదేశం" పేర జాతీయ ప్రచారం మొదలెడుతుంది. తమ వర్గకోరికలనే తమ జాతి ప్రజలందరియొక్క కోర్కెలుగా ప్రచారంచేస్తుంది; 'మాతృదేశం' ప్రయోజనాలను సాధించుటకుగాను దేశస్థులలోనుండి ఒక సైన్యాన్ని తయారుచేస్తుంది. పాలకజాతుల నిర్బంధవిధానంతో అసంతృప్తులైయున్న ప్రజాసామాన్యంకూడా బూర్జువావర్గ ప్రచారంచేత ఆకర్షింపబడి వారి వుద్యమం యెడల సానుభూతి చూపుతారు; సహాయం చేస్తారు.

జాతీయోద్యమం యీ విధంగా ప్రారంభమౌతుంది. దానిబలం రైతుకూలీ ప్రజాసామాన్యం దానిలో యెంతవరకు పాల్గొంటుందో దానిపై ఆధారపడియుంటుంది.

శ్రామికవర్గం యీ పోరాటాలలో, బూర్జువా జాతీయవాద నాయకత్వం క్రింద నడుస్తుందా, లేక తన వర్గనాయకత్వంక్రిందనే పోరాడుతుందా అనేది శ్రామికుల్లోవున్న వర్గచైతన్యంపై ఆధారపడియుంటుంది. వారిలో పూర్తివర్గచైతన్యంవుంటే శ్రామికులు తమ వర్గనాయకత్వం క్రిందనే పోరాడుతారు; బూర్జువా నాయకత్వం వారి కవసరంలేదు.

జాతీయోద్యమంలో రైతులు పాల్గొంటారా లేదా అనేది నిర్బంధ విధానంయొక్క మోస్తరు (Kind) ను బట్టి నిర్ణయింపబడుతుంది. ఐర్లండులోవలె నిర్బంధవిధానం రైతులను నష్టపరిచేదిగావుంటే దేశంలోని రైతులంతా వెంటనే జాతీయోద్యమంలో చేరుతారు. జార్జియాలో జాతీయోద్యమం రష్యన్ వ్యతిరేక (Anti Russian) స్వరూపాన్ని దాల్చకపోవుటకు కారణంవుంది. జార్జియాలో నిర్బంధవిధానాన్ననుసరిస్తున్నది- ఆర్మీనియన్ బూర్జువాలు, భూస్వాములుకాని, రష్యన్లుకాదు. అందుచేతనే జార్జియన్ జాతీయోద్యమం ఆర్మీనియన్ వ్యతిరేక స్వరూపం దాల్చింది. ఆర్మీనియన్ బూర్జువావర్గం జార్జియన్ బూర్జువావర్గాన్ని పైకిరాకుండా అణచివేసింది.

జాతీయోద్యమం ఐర్లండు, గెలీషియాలలోవలె ప్రజాసామాన్యం అంతనీ ఆకర్షించి ప్రజోద్యమం అవుతుందా, లేక బొహీమియాలోని కొన్ని పట్టణాలలోవలె చిన్న చిన్న కొట్లాటలుగామారి, చివరికి శుద్ధ పనికిమాలిన విషయాలపై కొట్లాడుకొనుటలోకి దిగుతుందా అనేది యీ పై విషయా (Factors) లన్నిటిపై నాధారపడి యుంటుంది.

జాతీయోద్యమ స్వరూపం అన్నిచోట్లా ఒకేవిధంగా వుండదు. దాని స్వభావం (Nature) అది కోరే 'డిమాండ్సు'ను బట్టి నిర్ణయింపబడుతుంది. ఐర్లండు జాతీయోద్యమం వ్యవసాయక (agrarian) స్వభావాన్ని దాల్చింది; బొహిమియాలో భాషావిషయక సమస్యగా వ్యక్తమైంది. ఒకచోట జాతీయోద్యమాశయం సమానహక్కులను, మతస్వాతంత్ర్యాన్ని సంపాదించుటై యుంటుంది; మరోచోట, వివిధసంస్థలలో తమ జాతీయులే నియమింపబడ

వలెననియో, తమకొక ప్రత్యేక 'శాసనసభ'కావలెననో జాతీయోద్యమం కోరవచ్చును. సాధారణంగా ఒకజాతియొక్క ప్రధాన లక్షణంయేదై యుంటుందో (భాష, దేశం. మొ॥) దానిమీదనే జాతీయోద్యమం యొక్క కోర్కెలు (demands) ఆధారపడియుంటాయి. బవర్ యొక్క 'జాతీయస్వభావం'తో సంబంధించినకోర్కె, యే జాతీయోద్యమంలోనూ పైకి రాలేదు; సహజమే కూడాను. "రాజకీయాల్లో దానివుపయోగం యేమీ లేదు", అన్నాడు స్ట్రాసర్ (J. Strasser)

ఇవే మామూలుగా జాతీయోద్యమం యొక్క స్వరూప స్వభావాలు. పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందుతూన్న దశలో జాతీయోద్యమాలు వివిధ బూర్జువా వర్గాలమధ్య జరిగే పోరాటాలస్వరూపంలో వుంటాయి. కొన్ని సమయాల్లో బూర్జువావర్గం శ్రామికవర్గాన్ని కూడా జాతీయోద్యమంలోని కాకర్షించి ఆ వుద్యమానికి ప్రజోద్యమ స్వరూపాన్నిస్తుంది. పైకి ప్రజోద్యమంగావున్నా, ఆంతర్యంలో బూర్జువావర్గంచేత వారి వర్గలాభాలకొరకు జరుపబడే పోరాటమేకాని వేరుకాదు. అయితే జాతీయ నిర్బంధవిధానాన్నెదుర్కొను శ్రామికులు బూర్జువావర్గంలో కలవనేకూడదని దీని అర్థంకాదు.

పౌరసత్వహక్కులు లేకపోవుట, భాషపై, పాఠశాలలపై, విద్యాసంస్థలపై విధింపబడిన నిర్బంధాలు మొదలగునవి పాలితజాతుల బూర్జువా వర్గాన్నెంత నష్టపరుస్తాయో అంతకన్న యెక్కువగానే శ్రామికవర్గాన్ని కూడా నష్టపరుస్తాయి. పాలితజాతుల్లోని శ్రామికవర్గంలోనుండి విద్యాధికులు తయారవటానికి నిర్బంధాలెంతో అడ్డంకి వారి స్కూల్సు మూసివేసి, సభల్లో వుపన్యాసాల్లో వారిమాతృభాష నుపయోగించుకోనీయలేకపోతే యేజాతి శ్రామికునికైనా మానసిక వికాసానికి అవకాశం యెక్కడవుంటుంది?

ఇంకో కారణంచేతకూడా నిర్బంధవిధానం శ్రామికవర్గ ప్రయోజనాలకు ప్రమాదం కలిగిస్తుంది. నిర్బంధవిధానం ప్రజాసామాన్యంయొక్క దృష్టిని సాంఘిక, వర్గసమస్యలనుండి మరలించి, అన్నివర్గాలకు సంబంధించిన జాతీయ సమస్యవైపుకు తిప్పుతుంది. అంతటితో "మాజాతి ప్రజలందరి అవసరాలూ, ఆశయాలూ ఒక్కటే"నని బూర్జువావర్గం అబద్ద ప్రచారం చేయుటకూ, శ్రామికులయొక్క ప్రయోజనాలను ప్రక్కకు తోసిపారేసి, వారిని మానసిక బానిసత్వంలో పడద్రోయుటకూ తగిన వాతావరణం యేర్పడుతుంది. అన్నిజాతుల శ్రామికులను ఐక్యపరచుటకిదియొక పెద్ద ఆటంకంగా తయారౌతుంది. పోలిష్ శ్రామికులు చాలామంది యిప్పటికీ తమ బూర్జువాజాతీయవాదుల పలుకుబడి క్రిందనేయుండి, అంతర్జాతీయ కార్మికోద్యమానికి విముఖులుగా వున్నారంటే దానికి కారణం పాలకజాతులు తరతరాలనుండి అవలంబిస్తూన్న "పోలిష్ వ్యతిరేక నిర్బంధవిధానమే." ఆ విధానమే శ్రామికులు తమ బూర్జువాలనుంచి దాస్యవిముక్తులు గాకుండా ఆటంకంగా వుందన్నమాట.

ఈ నిర్బంధ విధానం యింతటితో ఆగదు. 'అణగద్రొక్కుట'తో ప్రారంభించి క్రమక్రమంగా యిది జాతివిద్వేషాలను పురిగొల్పి, జాతికీ జాతికీ మధ్యయుద్ధాలు

కల్పించుటానికీ, మూకుమ్మడి ప్రజాహత్యలను (Massacres) ప్రోత్సహించటానికీ దిగుతుంది. ఈ మూకుమ్మడి ప్రజాహత్యలు, పోగ్రామ్సు అన్నిచోట్లాకాకపోయినా, ప్రాథమిక పౌరసత్వహక్కులుకూడా లేనిచోట్లలోమాత్రం అవి చాలా భయంకరరూపాన్ని దాలుస్తాయి. వాటిమూలంగా శ్రామికవర్గ ఐక్యత పూర్తిగా నాశనమైపోతుంది. కాకసస్‌లోనూ, దక్షిణరష్యాలోనూ యిటువంటివి ఎన్నోసార్లు జరిగాయి. వివిధ జాతుల్లో అనైక్యతవుంటేనే విజాతీయులు పాలించగల్గుతారు. ఆ అనైక్యతను కల్గించుటకే పాలకజాతి జాతి విద్వేషాలను, కలహాలను ప్రోత్సహిస్తుంది. ఈ నిర్బంధవిధానం, అనైక్యతను పెంపొందించే విధానం జయప్రదమైన ప్రతిదేశంలోనూ, కార్మికవర్గ ఐక్యతకు గట్టిదెబ్బ తగిలి తీరుతుంది. అట్టి ఐక్యతాసాధన కదియొక పెద్ద ఆటంకంగా వుంటుంది.

కాని శ్రామికవర్గంయొక్క ఆశయం యేమిటి? తమ వర్గానికి చెందిన అన్నిజాతుల ప్రజలూ ఒకే అంతర్జాతీయ సమ్మేళనంలో ఐక్యపరచబడాలి. బూర్జువావర్గ భావదాస్యంనుండి అతి త్వరితంగా విముక్తులు గావాలి. తమ సోదరుల మానసిన వైజ్ఞానికశక్తులు యెట్టి ఆటంకాలు లేకుండా పూర్తిగా వికసించుటకు సంపూర్ణావకాశాలుండాలి. ఈ సమయంలో జాతి భేదాలను మూలబెట్టాలి. శ్రామికులు "యేజాతికిచెందినవారైనా, వారి అవసరాలు ఒకటే". నిర్బంధవిధానాన్ని - అది యేరూపంలో వ్యక్తమైనసరే-శ్రామికులు తప్పక యెదిరించి తీరుతారు. జాతివిద్వేషాలను పురిగొల్పే విధానాన్ని కూడా వారు తప్పక యెదిరిస్తారు. అందుచేతనే ప్రతిదేశములోను కమ్యూనిస్టుపార్టీలు 'జాతుల స్వయం నిర్ణయహక్కును' బలపరుస్తాయి.

ఒకజాతికి స్వయంనిర్ణయహక్కు వున్నదంటే యేమిటి? ఆ జాతి ప్రజలే తమభావిని నిర్ణయించుకొనుటకు బాధ్యులు; వారి జాతీయజీవనంలో బలవంతంగా కల్పించు కొనుటకెవ్వరికీ హక్కులేదు; ఆ ప్రజల యొక్క విద్యాసంస్థలను నశింపజేయుటకుగాని, వారిభాషను అణగద్రొక్కుటకుగాని, వారి ఆచార వ్యవహారాలను నిరశించి నాశనంచేయుటకుగాని, వారి హక్కులను సంకుచితపరచుటకుగాని యెవ్వరికీ హక్కులేదు.

అయితే కమ్యూనిస్టులు ఒక జాతియొక్క ప్రతి ఆచారాన్నీ, సంస్థనూ విచక్షణలేకుండా బలపరుస్తారని అర్థంకాదు. జాతి నిర్బంధవిధానాన్ని తీవ్రంగా ప్రతిఘటిస్తారు. ఒక జాతియొక్క స్వయంనిర్ణయహక్కుకొరకు పోరాడేటప్పుడు కూడా ఆ జాతిలోని అర్థంలేని, అనర్థదాయకములైన వ్యవస్థలను, ఆచారాలను తొలగించుటకు అతి తీవ్రమైన ఆందోళన సాగిస్తూనే వుంటారు. ఎందుచేతనంటే ఆ జాతిలోని ప్రజాసామాన్యం దాస్య బంధాలనుండి విముక్తులుగావాలంటే యీ అనర్థదాయకములైన వ్యవస్థలూ, ఆచారాలు నశించక తప్పదు.

ఒక జాతి స్వయంనిర్ణయహక్కును కల్గియున్నదంటే ఆ ప్రజలకు తమ ఆర్థిక, రాజకీయ జీవితాన్ని తమ ఇష్టానుసారం నిర్మించుకొనుటకునూ, ఇతర జాతులతోకలిపి సమాఖ్యనేర్పరచుటకూ - ఆ సమాఖ్యనుండి విడిపోవుటకూకూడా-సంపూర్ణమైన స్వాతంత్ర్యాన్ని కలిగియున్నదన్నమాట.

అయితే 'జాతి' యొక్క ప్రతి కోర్కెనూ విషయ పరిశీలన చేయకుండా కమ్యూనిస్టులు బలపర్చరు. పైన చెప్పిన ప్రకారం ఒక జాతికి అభివృద్ధిమార్గాన్ని విడిచి వెనుకకు పోవుటకుకూడా హక్కు వుంటుంది. ఆ ప్రజాఅభివృద్ధి వ్యతిరేక పంథాను త్రొక్కినపుడు కమ్యూనిస్టులు అట్టి నిర్ణయం యెడల సానుభూతీ, సహకారమూ చూపరు. శ్రామికవర్గం యొక్క అభివృద్ధియే ఆశయంగాగల సోషల్ డెమోక్రాట్లయొక్క విధులు వేరు; భిన్న వర్గాలతో కూడిన జాతుల హక్కువేరు. ఆ రెండింటి పంథాలూ యెల్లప్పుడూ యేకీభవిస్తాయని చెప్పుటకు వీల్లేదు.

కమ్యూనిస్టులు జాతుల స్వయంనిర్ణయ హక్కుకొరకు పోరాడుటలో జాతీయ నిర్బంధ విధానమును నిర్మూలించి, వివిధజాతుల మధ్య కలహకారణాలను, విద్వేష బీజాలను తొలగించి, వాటిమధ్య సామరస్యాన్ని నెలకొల్పటమే వారి ఆశయం.

ఇందులోనేవుంది, వర్గచైతన్యంతో పనిచేసే శ్రామిక వర్గవిధానానికీ, బూర్జువావర్గం అవలంబించే విధానానికీ తేడా. కమ్యూనిస్టుల జాతీయ సమస్యా పరిష్కారమార్గం ఏమిటంటే వివిధజాతుల మధ్య సుహృద్భావాన్ని పెంపొందించటం, బూర్జువా విధానానికి వ్యతిరేకంగా జాతీయ పోరాటాలను రెచ్చకొట్టి, జాతీయోద్యమాలలో సాధించాలనే భావాన్నీ, తీవ్రతనూ కల్గించడం.

ఆ కారణం చేతనే వర్గచైతన్యంకల శ్రామికవర్గం, బూర్జువాల 'జాతీయ' పతాకం క్రిందకు చేరజాలదు.

అందుచేతనే బవర్ యొక్క 'పరిణామజాతీయ' విధానం (Evolutionary National Policy) శ్రామికులకు అంగీకృతంకాదు. ఈ పరిణామ జాతీయ విధానమూ, నేటి శ్రామిక వర్గవిధానము ఒకటేనని చెప్పి కార్మికుల వర్గకలహాన్ని జాతీయ పోరాటాలకనుగుణంగా వుండేలా మారుద్దామని బవర్ ప్రయత్నించేడు.

జాతీయోద్యమం ప్రధానంగా బూర్జువా వుద్యమం. జాతీయోద్యమం యొక్క అదృష్టమూ, బూర్జువావర్గంయొక్క భవిష్యత్తు చాలాదగ్గరగా సంబంధం కలిగియున్నాయి. బూర్జువావర్గం తొలగింపబడిననాడే జాతీయ సమస్య యొక్క పూర్తి పరిష్కారం సాధ్యపడుతుంది. సోషలిజం యొక్క ఏలుబడిలోనే శాశ్వతమైన శాంతి యేర్పడుతుంది. అయినప్పటికీ పెట్టుబడిదారీ విధానం క్రిందకూడా జాతీయ పోరాటాన్ని చాలావరకు తగ్గించవచ్చు. అట్టి పోరాటం యొక్క పునాది పెళ్ళగించేసి దాని వలన శ్రామికవర్గానికి సాధ్యమైనంతవరకు ప్రమాదము లేకుండా చేయవచ్చును. ఈ విషయంలో స్విట్జర్లాండు, అమెరికాలను ఉదాహరణగా తీసికోవచ్చు. దేశంలో ప్రజాస్వామ్యంవుండి, జాతులు అభివృద్ధిచెందడానికి అవకాశాలీయబడినపుడే అది సాధ్యపడుతుంది.



# III. రష్యాలో జాతీయ సమస్య

జాతీయ సమస్యకు మనం సరియైన పరిష్కారమార్గం చూపించాలి. ప్రస్తుత పరిస్థితులకు సంబంధించినట్లుగానే జాతీయ సమస్యకు పరిష్కారం సాధ్యమని మనం అనుకుంటున్నాము.

ప్రస్తుతం రష్యా తీవ్రమైనమార్పులు జరిగే సంధిదశ (Transition Period) లో వుంది. రాజకీయ పరిస్థితులు యింకా చాలా క్లిష్టంగానే ఉన్నాయి. ('సాధారణ' శాసనబద్ధ Constitutional జీవితం ఇంకా నెలకొల్పబడలేదు) ప్రజాజీవనం యింకా మామూలు పరిస్థితులలోనికివచ్చి కుదుటబడలేదు. ముందు యింకా యెన్నో క్లిష్టసమస్యల నెదుర్కొనవలసియున్నది. దీనిమూలంగానే సంపూర్ణ ప్రజాస్వామ్య సంస్థాపన కొరకు వుద్యమం బయలుదేరుతుంది.

ఆ వుద్యమాన్ని మనసులో వుంచుకొని మనం జాతీయ సమస్యను జాగ్రత్తగా పరిశీలించాలి. దేశంలో సంపూర్ణ ప్రజాస్వామ్యం అనే పునాది వుంటేనే జాతీయ సమస్యకు పరిష్కారం సాధ్యమౌతుంది.

ఈ సమస్యకు పరిష్కారమార్గం ఆలోచించేటపుడు మనదేశంలోని పరిస్థితినేకాక, విదేశాలలోని పరిస్థితులను కూడా గమనించవలసియుంటుంది. రష్యా-ఆసియా, ఐరోపాల మధ్య వుంది. దానికొకవైపున ఆస్ట్రియా, మరొక వైపున చైనా వున్నాయి. ఆసియాఖండంలో ప్రజాస్వామ్య విధానం అనివార్యంగా అభివృద్ధి చెంది తీరుతుంది.

యూరోపులో సామ్రాజ్యవాదం కొన్ని కారణాలవలన అభివృద్ధి చెందుతూంది. స్వదేశంలో ఖాళీలేక "పెట్టుబడి" (Capital) యితర దేశాలవైపు ప్రవహిస్తూంది. దానికి కొత్తమార్కెట్లు, చవకలేబరు (Cheap labour) కావాలి. పెట్టుబడి (Investment) పెట్టుటకు కొత్తమార్గాలు వెతుకుతూంది. ఇదంతా యెన్నో క్లిష్ట పరిస్థితులను కల్పించి చివరకు యుద్ధానికి దారితీస్తుంది. బాల్కన్ యుద్ధం[5] యిట్టి చిక్కు పరిస్థితులకు మొదలు, దేశంలోని పరిస్థితుల్లోనూ, విదేశ పరిస్థితులలోను కొన్ని మార్పులు రావచ్చు. ఆ మార్పుల మూలంగా, కొన్ని జాతులు తమ స్వాతంత్ర్యాన్ని స్థాపించుకొనుట అవసరం కావచ్చు. అటువంటివాటి విషయంలో మార్క్సిస్టులెప్పుడూ ఆటంకములు కల్పించరు.

అంటే, రష్యన్ మార్క్సిస్టుల దృష్టిలో "జాతుల స్వయంనిర్ణయం హక్కు"కు యెంతో ప్రాధాన్యత వుంది.

జాతీయ సమస్యపరిష్కారానికి "స్వయం నిర్ణయహక్కు" ప్రధానాంశం. తర్వాత మేము విడిపోము. మీతోనే కలిసివుంటాం అనేజాతుల విషయంలో మనం యేమి చేయాలి? అనేదొక సమస్య.

'జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలన' తగిన మార్గం కాదని తేలింది. ఎందుచేతనంటే అది అస్వాభావికమూ, ఆచరణ సాధ్యంకానిదీని. దాని ప్రకారం ఒక జాతిగా కలుపబడిన ప్రజలే దేశంలోని పరిస్థితులమూలాన చెల్లాచెదరై దేశం నలుమూలలకూ పోతున్నారు. ఆ జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలన వారిలో ఐక్యతను నిలబెట్టలేక పోతూంది; వాస్తవిక సంఘటనల బలంముందు అది నిలువలేకుండా వుంది.

ఈ వైజ్ఞానిక స్వపరిపాలన "జాతీయత"ను బలపరుస్తుంది. దీనికీ, జాతిప్రత్యేకతను బట్టి ప్రజలు విభజింపబడాలి, ప్రతిజాతిలోను వున్న విలక్షణమైన విషయాలను పెంపొందించవలెను అనే అభిప్రాయానికీ చాలా దగ్గర సంబంధం వుంది. కాని ఇది కమ్యూనిస్టుల పాలసీకి పూర్తిగా వ్యతిరేకం.

రీషాట్ (Reichsrat) లోని మొరేవియన్ "సెపరేటిస్టులు జర్మన్ సోషల్‌డెమో క్రాట్లనుండి విడిపోయి మొరేవియన్ బూర్జువాడెప్యూటీలతో కలసి ఒక 'ముఠా' (Ring)గా యేర్పడ్డారు. బండ్‌లోని రష్యన్ సెపరేటిస్టులు 'సబ్బాత్' ఇడ్డిష్ కొరకు ఆందోళన చేస్తున్నారు; 'డ్యూమా'లో యింకా "బండిస్టు" (Bundist) డెప్యూటీలు లేరు, కాని బండ్ డిస్ట్రిక్టులోని కీలకసంస్థలలో యీ అభివృద్ధి వ్యతిరేకులైన యూదుల ముఠావుంది. బండ్ ద్వారా యూదు కార్మికుల్నీ, బూర్జువా వర్గాన్నీ ఐక్యపరచడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈపై రెండువిషయాలూ కూడా 'జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలన' యెట్లు పరిణమిస్తుందో స్పష్టంగా వెల్లడిస్తున్నాయి.

దీన్నిబట్టి చూస్తే "జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలన" జాతీయ సమస్యలు పరిష్కరింపజాలదని తేలుతూంది.

అయితే మార్గాంతరం యేమిటి?

నిజమైన పరిష్కారమార్గం ప్రాంతీయ స్వపరిపాలన (Regional autonomy) ఒక్కటే. పోలండు, యుక్రైన్, కాకసస్ మొదలైన ప్రత్యేక ప్రాంతాలకు స్వపరిపాలన యివ్వాలి.

ఇందులో ముఖ్యమైన లాభం యేమిటంటే, ఒక ప్రత్యేక ప్రదేశంలో నివశించే జనానికే స్వపరిపాలన యివ్వబడుతూంది; కాని, నివాస ప్రదేశమైనాలేని వూహాజనిత విషయాని (Fiction) కి కాదు.

రెండోది, అది 'జాతి'ని బట్టి ప్రజలను విభజించదు; జాతీయ విభజన (Partition) లను బలపరచదు; పైగా ఆ విభజనలను కూలద్రోసి ప్రజలనందరినీ ఐక్యపరుస్తుంది. అప్పుడు విభజన వర్గభేదాలను బట్టి జరుగుతుంది కాని జాతి బేధాలను బట్టి గాదు.

పైగా, కేంద్ర ప్రభుత్వ నిర్ణయాలకొరకు కనిపెట్టుకు కూచోవలసిన అవసరంలేకుండానే, తమ ప్రాంతంలోని సహజసంపదను పూర్తి వుపయోగంలోనికి తెచ్చుటకూ, వుత్పత్తి శక్తులను లాభకరమైన మార్గాల్లో అభివృద్ధి చేయుటకూ మంచి అవకాశాలుంటాయి.

"జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలనకు యీ పనులలో వేటిని చేయుటకూ సమర్థత వుండదు".

అందుచేత జాతీయ సమస్య పరిష్కారానికి, ప్రాంతీయ స్వపరిపాలన చాలా ప్రధానమైనది.

కాని యేప్రాంతం (Region) లోనూ కూడా ప్రజలంతా ఒకే జాతికి చెందినవారుగా లేరు. ప్రతి ప్రాంతంలోనూ యెన్నో అల్పసంఖ్యాక జాతులున్నాయి. పోలండులో యూదులు; లిథుయేనియాలో లాట్వియన్సు; కాకసస్‌లో రష్యన్లు, యుక్రైనులో పోల్సు వున్నారు. అట్టి పరిస్థితులలో అధికసంఖ్యలోవున్న జాతి మిగతా అల్పసంఖ్యాకవర్గాలను నిర్బంధ విధానానికి లోనుగావించదా అని సందేహం రావచ్చు. కాని వెనుకటి సమాజవిధానం (old order) లోనే అటువంటి నిర్బంధ విధానానికి అవకాశం వుంటుంది. కాని దానిని తొలగించి, దేశంలో సంపూర్ణ ప్రజాస్వామికం నెలకొల్పిననాడు అటువంటి భయానికి తావుండదు.

చెల్లాచెదురుగావున్న యీ అల్పసంఖ్యాక వర్గాలనన్నింటినీ కలిసి జాతీయ సమ్మేళన (National Union) యేర్పరుస్తే బాగుంటుందంటారు కొందరు. కాని నిజంగా యీ'అల్పసంఖ్యాకు'లు కోరేది తాము నివశించే ప్రాంతాల్లో యితరులతో సమానహక్కులు కాని, యేదో కృత్రిమమైన సమ్మేళనకాదు. సంపూర్ణ ప్రజాస్వామ్యంలేనినాడు ఆ జాతీయ సమ్మేళన వలన వారికి యేమీ లాభంలేదు. ఆ ప్రజాస్వామ్యమే నెలకొల్పబడిననాడు 'జాతీయ సమ్మేళన' (National Union) యొక్క అవసరమేలేదు.

ఏ అల్పసంఖ్యాకవర్గమైనా దేన్ని గురించి యెక్కువ భయపడుతుంది? దాని అసంతృప్తి కారణమేమిటి?

దాని అసంతృప్తి కారణం తన మాతృభాష నుపయోగించుకొనే హక్కులేకపోవుటే; (ఏక జాతీయ సమ్మేళన లేకపోవడం దానిలో అంత అసంతృప్తిని కల్గించదు.) మాతృభాష నుపయోగించుకొనుటకు ఆ ప్రజలకు స్వాతంత్ర్యం యివ్వండి; వెంటనే అసంతృప్తి తొలగిపోతుంది.

అల్పసంఖ్యాక ప్రజల అసంతృప్తికి కారణం వారికి స్వంత పాఠశాలలు, వివిధ పౌరసత్వపు హక్కులు, మత స్వాతంత్ర్యము, మొదలగునవి లేకపోవుటేకాని యింకోటికాదు. వారికి జాతీయ పాఠశాలలు, మిగిలిన వివిధ హక్కులు, స్వాతంత్ర్యములు యివ్వండి; వారి అసంతృప్తికి కారణాలన్నీ తొలగిపోతాయి.

అన్ని విషయాలలో (భాష, పాఠశాలలు మొ॥) వారికి యితరజాతులలతో సమానహక్కులనిచ్చుటవలన జాతీయ సమస్య చాలావరకు పరిష్కారం అవుతుంది. ఏజాతికీ ప్రత్యేకాధికారాలు (Privileges) వుండకూడదు. అల్పసంఖ్యాక జాతులహక్కులపై నిర్బంధాలూ, నిబంధనలూ తొలగించాలి. న్యాయదృష్టిలో అన్ని జాతులకూ

సమానహక్కులివ్వాలి. ఇదంతా జరగాలంటే దేశంలో సంపూర్ణ ప్రజాస్వామ్య పద్ధతులపై నిర్మింపబడిన రాజ్యాంగవిధానం స్థాపింపబడాలి.

అట్టి ప్రజాస్వామ్యం, నిష్పాక్షికమైన రాజ్యాంగచట్టం వున్నవాడే మైనారిటీ జాతులకు, తమహక్కులు రక్షింపబడతాయనే విశ్వాసం కలుగుతుంది. కాని వూరికే కాగితం మీద గ్యారంటీ యిచ్చినంత మాత్రాన లాభంలేదు.

'ఆర్గనైజేషనల్ ఫెడరలిజమ్'కీ, 'జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలన'కూ చాలా దగ్గర సంబంధంవుంది. వైజ్ఞానిక స్వపరిపాలన అన్‌లిమిటెడ్ ఫెడరలిజానికి (ఇది వివిధ జాతులను పరస్పరం వేరుచేయుటకూ, విబేధాలకూ దారితీస్తుంది.) అనుకూలమైన వాతావరణాన్ని సృష్టిస్తుంది. ఆస్ట్రియాలో జెక్కులు, రష్యాలో 'బండిస్టులు' కూడా మొదట "స్వపరిపాలన" కావాలన్నారు; తర్వాత సమాఖ్య (Federation) లోకి దిగేరు; చివరికి యెవరి మట్టుకువారు వేరుగా వుండుంటే (Separation) మంచిదన్నారు. దీనికి కారణం 'జాతీయ స్వపరిపాలన' వలన ప్రజల్లో బయల్దేరిన జాతీయవాతావరణమే. ఆర్గనైజేషనల్ ఫెడరలిజము, నేషనల్ అటానమీ, ఒకేపంధాన నడుచుటలో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు. రెండింటి ప్రకారమూ కూడా 'జాతి'ని బట్టి విభజన జరగాలి. జాతిని బట్టియే నిర్మాణం జరగాలంటాయి రెండూను. కాని ఒక్క తేడా వుంది. ఒకదాని ప్రకారం మామూలుగా 'జనాభా' అంతా విభజింపబడుతుంది; రెండోదాంట్లో శ్రామికులను విభజించటం జరుగుతుంది.

జాతి భేదాలనుబట్టి శ్రామికులను విభజిస్తే కలిగే చెడుఫలితాలెన్నో వున్నాయి. ఐక్యశ్రామికవర్గపార్టీ విచ్ఛిన్నంకావడం, ట్రేడ్‌యూనియనులో కూడా యీజాతి విభజన ప్రవేశపెట్టబడుట, జాతుల మధ్య విద్వేషాలు పెరుగుట, ఒక జాతి శ్రామికులు సమ్మెచేస్తుంటే మరో జాతివారిచే దానిని భగ్నం చేయడం (National Strike Breaking) వీటన్నిటి మూలంగా కమ్యూనిస్టుపార్టీ శ్రేణులలో (Ranks) అధైర్యం, నిస్పృహ కలగడం యితర ఆర్గనైజేషనల్ ఫెడరేషన్ యొక్క ఫలితాలు.

ఆస్ట్రియాలో సోషల్ డెమోక్రసీ యొక్క చరిత్రను బట్టీ రష్యాలో 'బండ్' యొక్క కార్యకలాపం చూస్తేనూ యీ విషయం నిజమని తెలుస్తుంది.

దీనికొకే నివారణ మార్గంవుంది. పార్టీని, అంతర్జాతీయ పార్టీగా నిర్మించాలి.

రష్యాలోని శ్రామికులందరికీ వివిధ ప్రాంతీయ సంఘాలు (Collective bodies) యేర్పరచాలి. సాధ్యమైనంత వరకు ఒకజాతి శ్రామికులందరను ఒకే సంఘంలో ఐక్యపరచాలి. (United and Integral) ఆ సంఘాలన్నిటినీ కలిపి ఒకే ఒకపార్టీగా నిర్మించాలి. ఈ విధమైన పార్టీ నిర్మాణంలో సభ్యులుగావున్న వివిధ ప్రాంతాలకు (Regions) విశాలమైన స్వపరిపాలన హక్కులుంటాయని వేరే చెప్పనక్కరలేదు.

కాకసస్ ప్రదేశంయొక్క అనుభవాన్ని బట్టిచూచినా, యిట్టి నిర్మాణం అవసరమని తేలుతూంది. కాకేషియన్లు, ఆర్మీనియన్, తార్తార్ శ్రామికుల మధ్యగల విద్వేషాలను

తొలగించగల్గేరు. మూకుమ్మడి ప్రజాహత్యలు, కాల్పులు, జరగడానికే అవకాశంలేకుండా చేసేరు. యెన్నో జాతులకు నివాసస్థానమైన 'బాకూ'లో కొట్లాటలు లేకుండా చేయగల్గేరు; శ్రామికులందరను ఒకే బలమైన వుద్యమంలోనికి ఆకర్షించగల్గేరు; వారు దీనినంతనూ జయప్రదంగా సాధింపగల్గుటకు కారణము కకేషియన్ కమ్యూనిస్టుపార్టీ యొక్క అంతర్జాతీయ నిర్మాణమే (Inter national Structure).

నిర్మాణ విధానం యొక్క తరహా శ్రామికుల మానసిక జీవితం అంతమీదనూ యెంతో ప్రభావాన్ని కలిగియుంటుంది. తాను సభ్యుడుగా వున్న సంస్థయొక్క జీవితమే శ్రామికులలో ప్రతిఫలిస్తుంది. ఆ సంస్థయే అతని మానసికాభివృద్ధికి దోహదం చేస్తుంది. అతనికి విద్యగరపుతుంది. అతడు ఆ సంస్థలోని ఇతరజాతి శ్రామికులతో నిరంతరం సాహచర్యంలోనికివస్తూ వొకే నాయకత్వం క్రింద వారందరితో చేయి చేయి కలిపి తమ అందరియొక్క సామాన్యాశయసిద్ధికై ఐక్యపోరాటాల్లో పాల్గొంటాడు. దానివలన అతనిలో "శ్రామికులందరు ఒకే వర్గకుటుంబములోని సభ్యులు, సోషలిజాన్ని సాధించబూనిన మహాసైన్యంలోని వీరసైనికులు" అనే చైతన్యం కలుగుతుంది. శ్రామికుల్లో ఎంతో ఉత్తేజం కలిగిస్తుంది. వారిలోని శక్తులనభివృద్ధిచేసి శ్రామికోద్యమానికే బలం యిస్తుంది.

అందుచేత అంతర్జాతీయ పద్ధతులమీద నిర్మాణం, వివిధజాతుల మధ్య పరస్పర విశ్వాసాన్ని, సుహృద్భావాన్ని పెంపొందిస్తుంది. అంతర్జాతీయ భావం పెంపొందించటానికిది ఎంతో సహాయపడుతుంది.

కాని జాతీయసూత్రాల (national lines) ప్రకారం నిర్మితమైనవాని విషయం వేరుగా వుంటుంది. శ్రామికులు తమజాతినిబట్టి తమ సంఘాలను నిర్మించుకొన్ననాడు వారికి తమవర్గానికేచెందిన ఇతర జాతుల శ్రామికులతో యేమీ సంబంధాలుండవు; తమ 'జాతి' సరిహద్దులలోనే బంధితులైపోయి ఇతరులనుండి వేరుచేయబడిపోతారు. ఈ రకం నిర్మాణ సంస్థలో, శ్రామికులందరూ సామాన్యమైన (Common) విషయాలకు గాక, వారినొకరినుండి ఒకరిని వేరుపరచే (distinguish) తేడాలకే యెక్కువ ప్రాధాన్యత ఇస్తారు. దాని దృష్టిలో ప్రతి శ్రామికుడు ఫలానా జాతికి చెందినవాడుగానే కన్పడుతాడు. అతడు యూదుజాతీయుడా, పోలిష్ జాతీయుడా అనే విషయమే పరిగణింపబడుతుంది. కాని ఏజాతికి చెందినప్పటికీ శ్రామికులందరకూ ఒకే విధమైన ఇబ్బందులు (Grievances) సామాన్యాశయాలు (common aims) వున్నాయనే సంగతి విస్మరింపబడుతుంది. అలాంటప్పుడు శ్రామిక సంస్థలలో "నేషనల్ ఫెడరలిజమ్"ను ప్రవేశపెట్టుటవలన వారిలో "మాజాతికి ఇతరజాతులతో సంబంధంలేదు" అనే ఏకాకితనం అభివృద్ధి చెందుతుంది.

అనగా 'జాతి'ని బట్టి సంస్థలను నిర్మించుట, జాతీయ సంకుచితతత్వానికి, ఇతరజాతుల ఎడల నిరసనకూ దారితీస్తుంది.

ఇక్కడ మనకు రెండురకాల నిర్మాణ తరహాలున్నాయి. ఒకటి అంతర్జాతీయ ఐక్యతపై నాధారపడుతుంది; రెండోది 'జాతి'ని బట్టి కార్మిక వర్గాన్ని విభజిస్తుంది.

ఈ రెండూ పరస్పర వ్యతిరేక పంథాలు. వాటి మధ్య సామరస్యం కల్గించుట ఇప్పటివరకూ సాధ్యంకాలేదు.

1897 వింబెర్గ్‌పార్టీ కాంగ్రెస్‌లో ఆస్ట్రియాలో సోషల్ డెమోక్రాటిక్ పార్టీపై రెండు విధానాలను సమన్వయపరచే వుద్దేశ్యంతో కొన్ని సూచనలు చేసింది. కాని అవి ఎవ్వరూ ఆమోదించక పోయేటప్పటికి ఆస్ట్రియన్‌పార్టీ వేరుపడిపోయింది. తనతోబాటు ట్రేడు యూనియన్లను కూడా కాంగ్రెను నుండి విడగొట్టింది. 'సామరస్యం' కల్గించుట అసాధ్యమైపోయింది. స్ట్రాసర్ (Strasser) చెప్పినట్లు "వింబెర్గ్‌పార్టీ కాంగ్రెస్‌లో (సెపరేటిజమ్) 'విచ్ఛిన్నవాదం' మొదటి విజయాన్ని పొందింది."

రష్యాలో కూడా ఇలాగే జరిగింది. స్టాక్హోమ్ కాంగ్రెసులో రెండుపార్టీలమధ్యనూ జరిగిన "రాజీ" వలన పరిస్థితులేమీ చక్కబడలేదు. ఆ 'రాజీ' (Compromise) ని 'బండ్' వ్యతిరేకించింది. వివిధ ప్రాంతాలలో వివిధ జాతుల శ్రామికులందర్ని 'ఒకే సంస్థ'లోకి తేవడానికి జరిగే ప్రయత్నాలను 'బండ్' వ్యతిరేకించసాగింది. 1907-1908లో రష్యన్ సోషల్ డెమోక్రటిక్‌పార్టీ అన్ని జాతుల శ్రామికులమధ్య ఐక్యతను నెలకొల్పి పార్టీని బలపర్చవలెనని గట్టిగా ఆదేశించింది. అప్పుడుకూడా 'బండ్' తన విచ్ఛిత్తికిదారితీసే ఎత్తుగడలను (Separatist Tactics) విడిచిపెట్టలేదు. మొదట 'జాతీయ స్వపరిపాలన'ను వుపదేశించిన "బండ్" క్రమంగా సంపూర్ణ విచ్ఛిత్తికి, విభేదాలకు కారణమైంది. రష్యన్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీనుండి విడిపోయి దానిని బలహీనపరచి దానిలోని ఐక్యతను చెడగొట్టింది. 'జగిల్లో' (Jagiello)[6] వ్యవహారం జ్ఞాపకం తెచ్చుకుంటే యిదంతా బోధపడుతుంది.

'రాజీ' పద్ధతి యేమాత్రమూ ప్రయోజనకారికాదు; పైగా అది చెడ్డది కూడాను. అందుచేత మనం ఆ మార్గాన్ని విడిచిపెట్టాలి.

రెండేమార్గాలున్నాయి. ఒకటి, శ్రామికులందర్నీ వారివారి 'జాతి'ని బట్టి వేర్వేరు సంస్థలుగా నిర్మించడానికి అంగీకరించి దాని కనుగుణ్యంగా రష్యన్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీ తన నిర్మాణాన్ని సంస్కరించుకోవాలి; లేదా, శ్రామికవర్గమును అంతర్జాతీయ పద్ధతులపై సంఘటితపరచుటకు 'బండ్' ఒప్పుకొని, ప్రాంతీయ స్వపరిపాలన సిద్ధాంతానుసారం పునర్నిర్మింపబడాలి. (కాకేషియన్, పోలిష్, లెట్టిష్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీల విధానం మీదనే నిర్మింపబడినై) అల్లా చేస్తేనే యూదు శ్రామికులు రష్యాలోని యితర జాతులకు చెందిన శ్రామికులతో కలిసి ఐక్యతను పొందుట వీలుపడుతుంది.

ఇంకో మధ్యమార్గంలేదు, సిద్ధాంతములు (Principles) జయం పొందుతాయి, కాని యెప్పుడూ 'రాజీ'కి దిగవు.

అందుచేత, జాతీయ సమస్య పరిష్కారానికి శ్రామికవర్గపు అంతర్జాతీయైక్యత ఒక ప్రధానాంశం.

వియెన్నా, జనవరి, 1913.

# IV జాతీయ సమస్య - పార్టీ తక్షణ కర్తవ్యములు.

## Theses on the Immediate Tasks of the Party in Connection with the National Problem.

(కమ్యూనిస్టుపార్టీ పదో సమావేశం ముందుంచబడింది. సెంట్రల్ కమిటీ వారి ఆమోదంతో 1921)

### 1. పెట్టుబడిదారీ విధానము - జాతీయ నిర్బంధ విధానం.

1. పెట్టుబడిదారీ యుగంలోనే 'జాతులు'పుట్టేయి. భూస్వామ్య విధాన నాశనమూ, పెట్టుబడిదారీ విధానాభివృద్ధిక్రమమూ, జరుగుతున్న సమయములోనే ప్రజలను వివిధజాతులుగా కూడగట్టేయి. బ్రిటన్, ఫ్రాన్సు, జర్మనీ, ఇటలీలలో పెట్టుబడిదారీ పద్దతి భూస్వామ్య పద్దతిని కూలద్రోసి సత్వరాభివృద్ధి చెందుతూన్న సమయంలోనే ఆ ప్రజలు జాతులుగా యేర్పడ్డారు.

2. కొన్నిచోట్ల ప్రజలు జాతులుగా యేర్పడుట, కేంద్రీకృత రాజ్యాంగ (Centralised State) స్థాపనా యించుమించు ఒకేసారి జరిగేయి. అప్పుడా రెండూ యేకమై స్వతంత్ర బూర్జువా జాతీయ ప్రభుత్వాలుగా అభివృద్ధి చెందేయి. గ్రేట్‌బ్రిటన్ (ఐర్లండును మినహాయించి) ఫ్రాన్సు, ఇటలీలలో యిదే జరిగింది. తూర్పు యూరపు దేశాల్లో మాత్రం భూస్వామ్య విధానం విధ్వంసం చేయబడకముందే, ప్రజలు జాతులుగా యేర్పడుటకు పూర్వమే, బలమైన కేంద్రరాజ్యాంగ స్థాపన అవసరమైంది. ఆ దేశాలకు దండయాత్రల నెదుర్కొని స్వరక్షణ చేసుకోవలసిన అవసరం మూలాన కేంద్రరాజ్య స్థాపనలు చాలా త్వరగా జరిగేయి. అందుమూలంగా తర్వాత తర్వాత జాతులుగా యేర్పడిన ప్రజలు స్వంతంగా జాతీయ రాజ్యాంగములను స్థాపించుకొనుటకు వీల్లేకపోయింది. బహుళజాతి బూర్జువా ప్రభుత్వాలు (Multinational) యేర్పడ్డాయి. వాటిలో ఒక బలవంతమైన జాతి, మిగతా బలహీన జాతులన్నిటిని అణగద్రొక్కి తనకు బానిసలుగా చేస్తుంది. ఆస్ట్రియా-హంగరీ, రష్యాలు యీ రకమైన బహుళజాతి రాజ్యాంగములే.

3. ఫ్రాన్సు, ఇటలీ మొదలగు జాతీయ రాజ్యాంగములలో - ప్రజలందరూ ఇంచుమించు ఒకజాతివారే కావడంచేత-జాతీయ నిర్బంధ విధానం అనేది వుండేది కాదు. బహుళజాతి రాజ్యాంగాలు మొదటినుంచీ ఈనిర్బంధ విధానానికి, జాతీయోద్యమాలకూ పుట్టినిల్లు. వాటిలో ఒకజాతి ఇతరజాతుల మీద స్వారీచేసేది; పాలితజాతుల అభివృద్ధికేమీ తోడ్పడేదికాదు, పాలక పాలిత జాతుల యొక్క ప్రయోజనాలు, ఆశయాలు పరస్పర వ్యతిరేకంగా వుండేవి. వాటి మధ్య సామరస్యం వుంటేనే బహుళజాతి ప్రభుత్వాలు

జీవించగల్గుతాయి. ఈ వ్యతిరేకతను తొలగించుటకు చేయబడిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయి; పైగా జాతులమధ్య సమానత్వం స్థాపించుటకూ, అల్పసంఖ్యాకజాతుల హక్కులను రక్షించుటకూ చేయబడిన ప్రయత్నమూ జాతీయ విద్వేషాలను, కలహాలను యెక్కువ చేసిందేకాని పోగొట్టలేకపోయింది. ఆ ప్రయత్నాలు విఫలమగుటకు ప్రధాన కారణం వుంది. వ్యక్తిగత ఆస్తివిధానమూ, వర్గభేదాలు అంతరించనంతవరకు ఈ ప్రయత్నాలన్నీ అపజయం పొందితీరుతాయి వాటినల్లాగేవుంచి జాతీయ సమస్యను పరిష్కరింపబూనుట శుద్ధ తెలివితక్కువ.

4. యూరపులో పెట్టుబడిదారీవిధానం స్థిరపడి అభివృద్ధి చెందిన కొలదీ వివిధదేశాల బూర్జువావర్గాలకు మార్కెట్లు, ముడిపదార్థాలు, చవక పనివాళ్ళయొక్క అవసరంకూడా ఎక్కువైంది. తమ వర్తక రహదారులను కాపాడుకోవాలి; తమచేతిలోవున్న అధిక పెట్టుబడులను పారిశ్రామికంగా వెనుకబడియున్న దేశాలకుపంపి అక్కడ పెట్టుబడిపెట్టి వాటిపై తమ ఆర్థిక అధికారం నెలకొల్పసాగేరు: ఇతరదేశాలను వశపరచుకొని వాటిని తమ పరిశ్రమలకు మార్కెట్లుగా, ముడిసరుకులను, చవకలేబరు సప్లయిచేసే దేశాలుగా ఉపయోగించుకోసాగేరు. ఈ విధంగా వెనుకటి ఏకజాతి ప్రభుత్వాలన్నీ సామ్రాజ్యాలు సంపాదించి బహుళజాతి రాజ్యాలుగా తయారయ్యాయి. తమ ఆర్థికోన్నత్యాన్ని నిలబెట్టుకొనేందుకు వలసదేశాల ప్రజలపై నిర్బంధ విధానాన్ని నిరంకుశంగా సాగించేరు. ఇదంతాచూసి తూర్పు యూరపులోని బహుళజాతి ప్రభుత్వాలలోని పాలకజాతులుకూడా తన నిరంకుశ విధానాన్ని కొనసాగిస్తూనే ఇంకా కొత్తదేశాలను, బలహీన ప్రజలను తమక్రిందకు తెచ్చుకొని తమ సామ్రాజ్యాలను విస్తృతం చేయుటకు ప్రయత్నించసాగేరు. జాతిసమస్య క్రమంగా వలసరాజ్య సమస్యగా మారింది. నాటినుండి జాతీయ నిర్బంధవిధానం ప్రభుత్వాల అంతరంగిక సమస్యనుండి, వివిధ ప్రభుత్వాల మధ్య నిర్ణయింపబడవలసిన సమస్యగా మారింది; వలసరాజ్యాలకొరకు బలహీనజాతులపై తమ నిరంకుశత్వాన్ని స్థాపించి, తమ దోపిడీ విధానాన్ని కొనసాగించేందుకు పెద్ద సామ్రాజ్యవాద దేశాలమధ్య యుద్ధాలుగా పరిణమించింది.

5. సామ్రాజ్యవాద యుద్ధకాలంలో ఈ బహుళజాతి రాజ్యాంగాలలో వివిధజాతుల మధ్యనున్న అణచరాని విద్వేషాలు తీవ్రంగా బయటికొచ్చేయి. ప్రభుత్వాలు పైకి డాబుగావున్నా లోపలయేమీ సత్తాలేదని తేలిపోయింది. ఆ యుద్ధ పర్యవసానంగా, గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ మొదలగు సామ్రాజ్యవాద రాజ్యాలలో జాతివిద్వేషాలూ పోరాటాలు చాలా ఉధృతంగా బయల్దేరినై. ఓడిపోయిన ఆస్ట్రియా-హంగరీ, రష్యా (1917) మొదలగు పాతబహుళజాతి రాజ్యాంగాలు పూర్తిగా విచ్ఛిన్నమైపోయేయి; పోలండు, జెకోస్లొవేకియా, యుగోస్లావియా, జార్జియా, ఫిన్లండు ఆర్మీనియా మొ॥ నూతన బూర్జువా జాతీయ ప్రభుత్వాలు స్థాపించబడినై. బూర్జువా ప్రపంచానికి తెలిసినంతవరకు ఇదొక్కటే అతి

తీవ్రమైన శక్తివంతమైన జాతీయ సమస్యా పరిష్కారమార్గం. కాని, కొత్తబూర్జువా జాతీయ ప్రభుత్వాల పుట్టుక వివిధజాతులమధ్య సామరస్యం కల్గించలేకపోయింది; వివిధజాతుల మధ్యగల అసమానతనుగాని, జాతీయ నిర్బంధవిధానాన్ని గాని తొలగించలేకపోయింది. అవి జాతీయ సమస్యను పరిష్కరించుకోలేకపోవుటకు అసలు కారణం ఆ దేశాలలోవున్న ఆర్థిక, సామాజిక వ్యవస్థయే. వ్యక్తిగతఆస్తి (Private Property), వర్గాలమధ్య అసమానత వున్నంతకాలం ఆయా జాతీయ రాజ్యాలుకూడ (ఎ) అల్పసంఖ్యాక జాతులను అణగద్రొక్కుటకే, ప్రయత్నిస్తాయి. (పోలండులో తెల్లరష్యన్లు, యూదులు, యుక్రేనియన్లు ఎంతో హింసకు గురియౌతున్నారు; జార్జియాలో ఆర్మీనియనులు, ఓస్సెట్లు, అబీఖాసియన్లు హింసింపబడుతున్నారు. యుగోస్లావియా క్రోటులను, బోస్నియన్లను అణగద్రొక్క జూస్తుంది.) (బి) బలహీనులైన తమ ఇరుగుపొరుగు వారిని తమ అధికారం క్రిందకు తెచ్చుకోజూస్తాయి. చివరకు ఆ దురాక్రమణ విభేదాలకూ, యుద్ధానికీ దారితీస్తుంది. (పోలండు, లిథుయేనియా, యుక్రేన్, రష్యాల ఎడలను; యుగోస్లావియా బల్గేరియాకు వ్యతిరేకంగానూ, జార్జియా, ఆర్మీనియా, టర్కీలకు వ్యతిరేకంగానూ దురాక్రమణ విధానం అవలంబిస్తున్నారు.) (సి) తమ అధికారం నిలబెట్టుకొనేందుకు 'పెద్ద' సామ్రాజ్యవాద ప్రభుత్వాలనుండి సహాయంకోరి ఆర్థికంగానూ, సైనికంగానూ వారికి దాసులౌతారు.

6. యుద్ధానంతర కాలంలో (Postwar period) ఎక్కడచూచినా జాతీయ విద్వేషాలు, అసమానత, నిర్బంధవిధానం, యుద్ధాలు ఇవే కన్పిస్తున్నాయి. నాగరకజాతులు ఒకరిమీద ఒకరూ, ఇతర బానిస జాతులమీద కూడ తమ సామ్రాజ్యవాద పెత్తనాన్ని రుద్దాలని ప్రయత్నిస్తున్నాయి. అగ్రరాజ్యాలు (Great Powers) తమకు లోబడియున్న దేశాలనూ, పేరుకు స్వతంత్రంగావున్న జాతీయ ప్రభుత్వాలనూ కూడ పీడించి దోపిడీ చేస్తున్నాయి; మళ్ళీ వాటిలో అవే ఇతరులను దోచుకొనే హక్కుకోసం పోట్లాడుకుంటున్నాయి. ఇంకో ప్రక్క యీ జాతీయ రాజ్యాంగాలన్నీ పెద్దరాజ్యాల బానిసత్వంలోనుండి తప్పించుకొనుటకు గించుకుంటున్నాయి; వాట్లలో అవి తమ సరిహద్దులను పెంచుకొనేందుకు ఇతరులతో పోరాడుతున్నాయి; మళ్ళీ ప్రతిఒక్కరూ తమక్రిందవున్న అల్పసంఖ్యాక జాతులపై దారుణ నిర్బంధాలను ప్రయోగిస్తున్నారు. వలస రాజ్యాల్లో కూడ సామ్రాజ్యవాద ప్రభుత్వ వ్యతిరేక పోరాటాలు తీవ్రరూపం దాలుస్తున్నాయి. సామ్రాజ్యవాద దేశాల్లోనూ, జాతీయ రాజ్యాల్లోనూ కూడా జాతి విభేదాలంతకంతకూ ఎక్కువౌతున్నాయి. అల్పసంఖ్యాక జాతులకూ, పాలకజాతికీ మధ్య తీవ్రపోరాటాలు జరుగుతున్నై. సామ్రాజ్యవాద యుద్ధం ప్రపంచానికిచ్చిన వారసత్వంయిది. బూర్జువా సమాజం జాతీయ సమస్యనెంతమాత్రమూ పరిష్కరింపజాలదని ప్రపంచానికి స్పష్టంగా వెల్లడయింది.

## 2. సోవియట్ విధానము - జాతీయ స్వాతంత్ర్యము

1. వ్యక్తిగత ఆస్తి, పెట్టుబడి ప్రజల ఐక్యతను భంగపరుస్తాయి. జాతి విభేదాలనెక్కువచేసి జాతీయ నిర్బంధవిధానాన్ని బలపరుస్తాయి. సమిష్టి ఆస్తి, లేబరు శ్రామిక ప్రజలనైక్యపరచి జాతీయ నిర్బంధాన్ని తుదిముట్టిస్తాయి. సోషలిజం వున్నచోట జాతీయ స్వాతంత్ర్యం నెలకొల్పబడి, నిర్బంధ విధానం నిర్మూలింపబడుతుంది. పెట్టుబడిదారీ విధానంలో నిర్బంధవిధానం వుంటుంది. రైతులు, పెటీబూర్జువావర్గమూ బూర్జువావర్గ నాయకత్వం క్రింద నడుస్తూ సంకుచిత జాతీయ భావాలను కల్గియున్నంత కాలం జాతీయ దురహంకారము (Chauvinism), జాతీయ పోరాటాలూ తప్పవు. శ్రామికవర్గ నియంతృత్వం స్థాపించబడినప్పుడే జాతీయ స్వాతంత్ర్యం, వివిధ జాతుల మధ్య సుహృద్భావం, శాంతి నెలకొల్పబడతాయి. అందుచేత జాతి నిర్బంధవిధానం తొలగి వివిధ జాతులమధ్య సమానత్వం యేర్పడవలెవంటే, అల్పసంఖ్యాక జాతులహక్కులు పూర్తిగా రక్షింపబడవలెనంటే, సోవియట్ల విజయం. శ్రామికవర్గ నియంతృత్వస్థాపనా జరిగితీరాలి.

2. సోవియట్ విప్లవానుభవం కూడా ఈ సత్యాన్ని బుజువుచేస్తూంది. రష్యాలో సోవియట్ ప్రభుత్వం ఏర్పడిన వెంటనే వివిధ జాతులకు స్వయం నిర్ణయహక్కు (విడిపోవుటకుకూడ హక్కు)గలదని ప్రకటనలు వెలువడ్డాయి. దానితో రష్యాలోని వేర్వేరు జాతులకు చెందిన శ్రామిక ప్రజాసామాన్యం మధ్యగల పరస్పరసంబంధాల్లో ఒక కొత్తమార్పువచ్చింది. పూర్వపు విద్వేషాలు నశించేయి. జాతి నిర్బంధ విధానం యొక్క మూలాధారం పడగొట్టబడింది. రష్యన్ శ్రామికుల యెడల యూరపు, ఆసియాలలోని వివిధజాతుల ప్రజలకు సోదరభావం, వారివిధానంలో విశ్వాసమూ యెక్కువయేయి. ఆ విశ్వాసబలం వారిలో ఒకనూతనోత్సాహాన్ని కల్గించి, శ్రామికవర్గక్షేమం కొరకు జరిగే పోరాటాల్లో పాల్గొనుటకు కూడా తయారుగావుండేలా చేసింది. అజర్-బైజాన్, ఆర్మీనియాలలో సోవియట్ రిపబ్లికుల స్థాపనతో జాతివైషమ్యాలు నశించాయి. టర్కిష్ ఆర్మీనియన్ ప్రజల మధ్యనూ, ఆర్మీనియన్ అజర్-బైజాన్, ఆర్మీనియాలలో సోవియట్ రిపబ్లికుల స్థాపనతో జాతివైషమ్యాలు నశించాయి. టర్కిష్, ఆర్మీనియన్ ప్రజల మధ్యనూ, ఆర్మీనియన్ అజర్-బైజాన్ ప్రజాసామాన్యంమధ్యనూ తరతరాలుగావున్న పాతశతృత్వాలు నశించేయి. హంగరీ, ఫిన్లండు, బల్గేరియా, లాట్వియా దేశాల్లో సోవియటు విజయం తాత్కాలికమేయైనా ఆ కొద్దికాలంలోనే యీ మంచి ఫలితాలు సాధింపబడినాయని చెప్పవచ్చును. తమదేశంలో నిర్బంధవిధానాన్ని, జాతివైషమ్యాలను నాశనంచేసి తద్వారా యూరపు ఆసియా ప్రజల సానుభూతినీ, సహాయాన్నీ పొందియుండకపోయినట్లయితే, రష్యన్ శ్రామికవర్గం కోల్చాక్, డెనికిన్ (తెల్ల సైన్యాధ్యక్షు)లను ఓడించుటగాని, అజర్బైజాన్, ఆర్మీనియన్ రిపబ్లిక్కులకు సహాయంచేయుటగాని అసాధ్యమై యుండేదని చెప్పవచ్చు. సోవియట్ రిపబ్లిక్కులన్నిటిని ఐక్యపరచుట (Consolidation) జాతి నిర్బంధవిధానాన్ని

నాశనం చేయుట, ఇవి రెండూ కూడా సామ్రాజ్యవాద బానిసత్వం నుండి తప్పించుకొనుటకు శ్రామికవర్గం జరిపే స్వాతంత్రపోరాట క్రమంలోని రెండు అంశాలు (aspects).

3. సోవియటు రిపబ్లికుల వునికి సామ్రాజ్యవాదానికి పక్కలోబల్లెం వెనుక సామ్రాజ్యాలలోని భాగాలుగా, వలస దేశాలుగా వున్న దేశాలు తమ బానిసత్వంనుండి విముక్తులై స్వతంత్రరాజ్యాలుగా, నేటి సోవియట్ రిపబ్లికులుగా యేర్పడుట ఒక కారణం; అంటే అవి సామ్రాజ్యవాదుల లాభాలను, ఆదాయాన్ని కొంతవరకు తగ్గించేయన్నమాట. ఇంతకన్న ముఖ్యమైన యింకో కారణం వుంది. ఈ సోవియటు రిపబ్లికులు బూర్జువా వర్గనాశనానికి, శ్రామికవర్గ నియంతృత్వాన్ని బలపరచుటకు తీసికొనే ప్రతిచర్యా కూడా పెట్టుబడిదారీ విధానాన్ని సామ్రాజ్యవాదాన్ని బలహీనపరచుటకు తోడ్పడుతుంది. బానిస దేశాల స్వాతంత్ర్య పోరాటాలకెంతో అనుకూల వాతావరణాన్నేర్పరుస్తుంది. పెట్టుబడిదారీ విధానంయొక్క విచ్ఛిత్తికి, పతనానికి దారితీస్తుంది. ఆ కారణంచేతనే గ్రేట్‌పవర్సుకి పెద్ద సామ్రాజ్యవాద దేశాలకు యీ సోవియటు రిపబ్లికుల యెడల తీరనివైరం. వారంతదీక్షగా యీ రిపబ్లిక్కులను నాశనం చేయజూచుటకు కూడ అదే కారణం. ప్రస్తుతం సోవియటు రష్యాకు వ్యతిరేకంగా యీ పెద్దరాజ్యాలు చేస్తూన్న అన్యాయ యుద్ధంనుండి ప్రతి సోవియటు రిపబ్లిక్కూ నేర్చుకోవలసిన పాఠం ఒకటుంది. "వారందరూ ఐక్యతతో పోరాడితోనే ప్రపంచ సామ్రాజ్యవాద ముఠాయొక్క దురాక్రమణ నెదిరించగలుగుతారు" అనేది; ప్రపంచ సామ్రాజ్యవాదులు సోవియటు ప్రభుత్వానికి వ్యతిరేకంగా యెన్నో బూర్జువా ప్రభుత్వాలను బోర్డరు రీజియన్సులో నిలబెడుతున్నారు; వాటిని ముందుపెట్టుకొని వెనకాల తాము నాటకం ఆడుతున్నారు; అన్నివిధాల సహాయం యిచ్చి విప్లవవ్యతిరేక సేనా నాయకులను సోవియటు రష్యామీద యుద్ధానికి పంపుతున్నారు. సోవియటు ప్రభుత్వాన్ని నలుమూలలా చుట్టుముట్టి యెక్కడనుండీ యే సహాయమూ రాకుండా చేస్తున్నారు; సోవియటుదేశాన్ని, ఆర్థికంగా 'వెలి'వేయుటకు యేమూలనుండి కూడ దానికి ఆర్థిక సహాయం రాకుండా చేయుటకు యెంతో దీక్షతో ప్రయత్నిస్తున్నారు. ఈనాడు ఒక విషయం స్పష్టమైంది. నేటి అంతర్జాతీయ పరిస్థితులలో సోవియటు రష్యా పెట్టుబడిదారీ దేశాలచే అన్నివైపులా చుట్టుముట్టబడి యున్నప్పుడు ఏ ఒక్క సోవియటు రిపబ్లికూ తనంతటతాను యేకాకియై ప్రపంచ సామ్రాజ్యవాదంతో పోరాడి జయించలేదు. అట్లా యేకాకియై పోరాడుట అంటే స్వవినాశనాన్ని కొనితెచ్చుకొనుటే ఔతుంది. అట్టి పోరాటానికి తగిన ఆర్థిక సంపదగాని, సైన్యబలంగాని యే ఒక్క రిపబ్లిక్కూ లేదు.

4. సామ్రాజ్యవాదుల దాడిమూలంగా ప్రతి రిపబ్లికు యొక్క వునికికి క్షేమానికి భంగం కలిగేలా వుంది. స్వరక్షణకొరకు, యుద్ధకాలంలో పాడైపోయిన వుత్పత్తి శక్తులను పునరుద్ధరించుకొని, దేశాన్ని ఆర్థికదుస్థితినుండి తప్పించుట కొరకు తమలో తాము పరస్పర సహాయం చేసికొని ఆహార దుస్థితి నుండి ప్రజలను కాపాడుటకొరకు ఈ రిపబ్లిక్కులన్నీ కలిసి రాజకీయ సమ్మేళన (Political Union) యేర్పరచుకొంటేనే

సామ్రాజ్యవాద బానిసత్వం నుండి, జాతీయ నిర్బంధ విధానంనుండి విముక్తులు కాగలరు; అదొక్కటే మార్గం. 'జాతీయ' 'విజాతీయ' బూర్జువావర్గాన్ని పారద్రోలి, తమ స్వాతంత్ర్యం సంపాదించుకొన్న యీ జాతీయ సోవియట్టు రిపబ్లిక్కులు వెంటనే బలీయమైన ఐక్యరాజకీయ సమ్మేళనగా యేర్పడితేనే సామ్రాజ్యవాదుల సైన్యాలనెదుర్కొని ఓడించగలవు; అట్టి ఐక్యతను అవి సాధించలేకపోయినట్టయితే అన్ని రిపబ్లిక్కులూ సర్వనాశనమైపోతాయి.

5. తమ అందరికీ సంబంధించిన ఆర్థిక, సైనిక (Military) వ్యవహారాలను విజయవంతముగా పరిష్కరించుకొనుటగాను "సోవియట్ రిపబ్లిక్కుల (ఫెడరేషన్) సమాఖ్యను నిర్మించుకోవాలి. అట్టి సమాఖ్య యీ క్రింది విషయాలను హామీయివ్వాలి:-

(ఎ) మొత్తం సమాఖ్యయొక్కయు, దానిలోని ప్రతి రిపబ్లిక్కు యొక్కయు వ్యక్తిత్వమును, ఆర్థికాభివృద్ధిని పెంపొందించుటకు పూచీయివ్వాలి.

(బి) భిన్ననాగరికతా దశల్లోవున్న వివిధ ప్రజల యొక్క సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక పరిస్థితులకు సరిపడే రూపంలోనే సమాఖ్య నిర్మింపబడాలి.

(సి) ఫెడరేషన్‌లో చేరిన వివిధజాతుల మధ్య సౌహార్దము, స్నేహభావం పెంపొందింపచేయాలి.

సోవియట్ రిపబ్లికులను సంఘటితపరచుటకు "సమాఖ్య"యే అనుకూలమైన రాజకీయవిధానమని సోవియటు రష్యాయొక్కపూర్వానుభవం బుజావు చేస్తూంది. సోవియట్ యూనియను వివిధరకాల సమాఖ్యలను ఆయా పరిస్థితులకు సరిపడేలా నిర్మించింది. కిర్ఘిజ్, బష్కిర్, తాతర్ రిపబ్లిక్కులు, గోర్కి, డాఘేస్తాన్‌లను కలిపి సోవియట్ స్వపరిపాలన సిద్ధాంతంపై ఒక ఫెడరేషన్ నిర్మితమైంది. తర్వాత యుక్రేన్, అజర్-బైజాన్ మొదలగు స్వతంత్ర రిపబ్లిక్కుల మధ్య పరస్పరాంగీకారంతో ఒకరకమైన ఫెడరేషను నిర్మింపబడింది ఈ రూపములు కూడా సోవియట్ ఫెడరేషను యెట్టి పరిస్థితులకైనా సరిపడేలా మార్పుచెందే గొప్పతనం (flexibility) దానిలో వుందని తెలియబరుస్తున్నాయి.

6. అయితే సమాఖ్యలో సభ్యులుగా వున్న దేశాలమధ్య పరస్పర విశ్వాసం, సుహృద్భావం వుంటేనే ఆ సమాఖ్యనిలచుటకుగాని, తన ఆశయాలను, విధులను నెరవేర్చుటకు గాని అవకాశం వుంటుంది. ప్రపంచం అంతలో వివిధజాతులు సోదరభావంతో పరస్పరం తోడ్పడుతూ కలసి మెలసి యుండుట ఒక్క 'రష్యన్ సోషలిస్టు ఫెడరేటెడ్ సోవియట్ రిపబ్లిక్కు; (R.S.F.S.R.) లోనే సాధ్యమైంది. దానికి కారణమేమిటంటే, దానిలో పాలక పాలిత జాతులనే బేధాలు నాశనం చేయబడినై; సామ్రాజ్యవాదం, నిర్బంధవిధానం తొలగింపబడినై; మాతృదేశాలు, వలసలు అనే భేదం తొలగించబడింది. అన్ని జాతులకు సమానహక్కులున్నై. దోపిడీవిధానం పూర్తిగాపోయింది. ఈ వివిధ జాతులకు చెందిన శ్రామిక ప్రజాసామాన్యం అందరియొక్క ఐచ్ఛిక సహకారంతోనే వారందరిమధ్య పరస్పర విశ్వాసం వుండుటచేతనే (R.S.F.S.R.) నిర్మింపబడుట జరిగింది.

ఒకే ప్రపంచ ఆర్థికవ్యవస్థ (a single world economic system) యొక్క ఆవశ్యకత రోజురోజుకి యెక్కువౌతూంది. అట్టి వ్యవస్థలో ప్రపంచశ్రామికులందరను ఒకే ఐక్యశక్తిగా నిర్మించుటకు ఐచ్ఛిక సహకారంమీద ఆధారపడిన 'సమాఖ్య' ఒక్కటే సంధిదశ (Transition Stage) గా వుపకరిస్తుంది. అందుచే సమాఖ్యయొక్క ఐచ్ఛిక స్వభావాన్ని (Voluntary Character) నిలబెట్టుట చాలా అవసరం.

## రష్యన్ కమ్యూనిస్టు పార్టీయొక్క తక్షణ కర్తవ్యాలు

1. రష్యన్ సోవియట్ ఫెడరల్ రిపబ్లికులోని మొత్తం 14కోట్ల ప్రజలలో 6కోట్ల 50 లక్షలమంది రష్యనేతర జాతులకు చెందినవారు. (యుక్రేయన్లు, తెల్లరష్యనులు, కిర్ఘాజులు, ఉజ్బెక్కుస్, టర్క్‌మెన్స్, తాడ్జిక్కుస్, అజర్ బై జానియన్లు, వోల్గా తాతార్లు, క్రిమియన్ తాతార్లు, బొఖారన్స్, ఖివాన్స్, బషీర్లు, ఆర్మేయనులు, చెచెన్లు, కబార్డియన్లు, ఒసెట్సుస్, సర్కేషియన్లు, ఇంగుషీలు, కరచాయ్‌లు, బాల్కేరియన్లు, కాల్మక్కుస్, కరేలియన్లు, అవేరియన్లు, డార్ఘన్లు, కజకుముఖియన్లు, క్యూరియన్‌లు, క్యూమిక్కుస్మారిస్, ఓట్‌లు, ఛువాషేలు, వాల్గాజర్మన్లు, బుర్యట్‌లు, యాకుషియన్లు, మొదలగువారు) జారిస్టు ప్రభుత్వం క్రింద జమీందార్ల, బూర్జువాల చేతుల్లో ఈ జాతులన్నీ దుర్భర నిర్బంధ విధానానికి గురియైనాయి; వారి రాజకీయ స్వాతంత్ర్యం, అభివృద్ధి పూర్తిగా అరికట్టబడినై; వారిభాషపై, విజ్ఞానాభివృద్ధిపై ఎన్నో నిర్బంధాలు విధింపబడి ఆ ప్రజలలో అజ్ఞానం, నిరక్షరాస్యత బుద్ధిపూర్వకంగా ఎక్కువచేయబడినవి: ఆ జాతులను 'రస్సిఫై' చేయుటకు (Russify) (అంటే ఇతరజాతుల వ్యక్తిత్వాన్ని పోగొట్టి వారిపై రష్యన్ జాతియొక్క ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక భాషా ప్రాబల్యాన్ని రుద్దుటకు ప్రయత్నించుట) ఎన్నోవిధాల ప్రయత్నించేరు. ఆ జాతులన్నీ అంత వెనుకబడియుండుటకూ, రాజకీయంగా ఎట్టి అభివృద్ధినీ పొందకుండుటకు యీ జారు ప్రభుత్వపు దారుణ నిర్బంధ విధానమే కారణం.

ఆయాదేశాల్లోని ప్రజాసామాన్యం జమీందార్లను, బూర్జువా వర్గాన్ని కూలద్రోసి సోవియటు ప్రభుత్వ స్థాపనచేసినమీదట ఆయా ప్రజలనందరను ఆర్థికంగా, వైజ్ఞానికంగా మంచి అభివృద్ధి దశలోవున్న మధ్య రష్యాతో సమానస్థితికి తెచ్చుట కమ్యూనిస్టుల ప్రధాన కర్తవ్యం అయింది. అట్టి కర్తవ్య నిర్వహణకు -

(ఎ) ఆయాజాతుల ప్రత్యేక స్వభావాల కనుగుణ్యమైన రూపంలో వారివారి సోవియటు రాజ్యాంగ వ్యవస్థను నిర్మించవలెను.

(బి) ఆయా ప్రాంతీయుల యొక్క ఆచార వ్యవహారాలను, మనస్తత్వాన్ని పూర్తిగా అర్థంచేసికొని, సానుభూతిలో చూడగల వారినే వివిధ పరిపాలనాశాఖల్లో వుద్యోగులుగా నియమించాలి; పరిపాలనా విధానం అంతా ఆ ప్రజల మాతృభాషలోనే జరగాలి.

(సి) ఆయా ప్రజల మాతృభాషలోనే వారివారి జాతీయ పత్రికలను, వాఙ్మయమును, విద్యాసంస్థలను నిర్మించి అభివృద్ధి చేయాలి.

2. ఈ $6^1/_2$కోట్ల నాన్‌రష్యన్ ప్రజలలో కూడ వారి అభివృద్ధి దశలలో ఎన్నో తేడాలున్నాయి. యుక్రేన్, తెల్లరష్యా, అజర్ బైజాన్‌లో కొంతభాగం, ఆర్మీనియాలలో పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం చాలావరకు అభివృద్ధిచెందియున్నది: వారిని మినహాయిస్తే మిగిలిన 3 కోట్ల ప్రజలలో పెట్టుబడివిధానం ఇంకా వేళ్ళూనుకోలేదు. పరిశ్రమలు లేకపోవడంచేత ఆ దేశాల్లో కార్మికవర్గంలేదు. వాటిలో కొన్ని జాతులు (కిర్ఘీజియా, బష్కిరియా, ఉత్తర కాకసస్‌లు) ఇంకా పూర్వపు పితృస్వామ్య (Patriarchal) జీవిత విధానాన్ని విడనాడనేలేదు. మరికొని 2 జాతుల్లో ఇంకా మధ్య యుగపు భూస్వామ్య విధానమే అమల్లో వుంది. కాని యీ జాతులన్నీ కూడ సోవియటు యూనియనులో చేరిన కారణంచేత వారందరి యొక్క అభివృద్ధి విషయంలో పార్టీకి పూర్తి బాధ్యత వుంది.

మధ్యరష్యాలో అమల్లోవున్న ఆర్థిక వ్యవస్థను, అంతకన్న ఎన్నోరెట్లు వెనుకబడియున్న ఇతరజాతుల ప్రజలలో ఒక్కసారిగా ప్రవేశపెట్టజూచుట చాలా అనాలోచితమూ, ప్రమాదభూయిష్టమూ అయిన పని. ఆనాటికే రష్యన్ ఆర్థిక వ్యవస్థ మిగిలిన ప్రజలలో కంటె చాలా వున్నత స్థితిలో వుంది. ఆ పరిస్థితుల్లో వెనుకబడియున్న ప్రజల ఎడల వారి సర్వతోముఖాభివృద్ధి విషయంలో కమ్యూనిస్టుపార్టీ అవలంబించవలసిన విధానంఏది? 1వ పేరాలో చెప్పినవేగాక ఈ క్రింది విధులను కూడ పార్టీ నెరవేర్చిన నాడే ఆ ప్రజలను అభివృద్ధిచేయుట సాధ్యపడుతుంది. భూస్వామ్య పద్ధతిని (Feudalism) ఇతర సాంఘిక దురాచారాలను తుదముట్టించి, సోవియట్ ఆర్థికవ్యవస్థా నిర్మాణంలో ఆ ప్రజలకు సహాయం, సలహాలు యివ్వాలి. శ్రామికులచే యెన్నుకోబడిన గ్రామసోవియట్లు సోవియటు వ్యవస్థ అంతటికీ పునాదిగా యేర్పడేలా చేయాలి; సోవియటు వ్యవస్థా నిర్మాణంలో, ఆర్థికాభివృద్ధి పోరాటంలో రష్యన్ శ్రామికవర్గం సంపాదించిన అమూల్యానుభవాలను తమ ప్రస్తుత కార్యక్రమంలో వినియోగించుకొనుటకు తమ కార్యక్రమాన్ని ఆయాజాతుల ప్రత్యేక సాంఘిక, ఆర్థిక పరిస్థితులకు, వర్గవ్యవస్థకు అనుగుణంగా వుండేటట్లు సమయాను కూలంగా మార్చుకొనుటకూ, తగిన సమయస్ఫూర్తి, ధైర్యము, సామర్థ్యంగల కమ్యూనిస్టు పార్టీ సంస్థలను వివిధ ప్రజలలో నిర్మించాలి.

3. ఈ మూడుకోట్ల ప్రజలలో అజర్ బైజాన్, వోల్గా, తాతర్సు, క్రిమియను తాతర్సు, బొఖావా, ఖీనా మొదలగు ప్రదేశాల్లోని ప్రజలకు ఒక స్థిరనివాసం అనేది వుంది. వారొక నిర్ణీత భూభాగంలో స్థిరపడిపోయేరు. వీరుపోగా కిర్ఘీజ్, బష్కిర్స్, చెచైన్స్, ఓసైట్సు మొదలగు తెగలవారు ఒకకోటివరకూ వుంటారు. మొన్న మొన్నటివరకూ, వీరు నివశించే ప్రదేశాల్లో సారవంతమైన భూములన్నిటినీ రష్యన్ భూస్వాము లాక్రమించుకొని వారిని నిస్సారమైన యెడారి భూములలోకి తోసివేశారు. ఈ దూరసామ్రాజ్య భాగాల్లోకి వీలైనంత యెక్కువమంది రష్యన్, కోసక్ భూస్వాములను వలస పంపించి వారికి మంచి భూములన్నిటినీ ఆక్రమించుకొనే హక్కు, యితర అన్ని సౌకర్యాలూ యిచ్చి జారిస్టు

ప్రభుత్వం తన సామ్రాజ్య విస్తరణకు తగిన పరిస్థితులను కల్పించుకుంది. ఈ నిరంకుశ దురాక్రమణ విధాన ఫలితంగా యీ తెగలు క్రమక్రమంగా నశింపసాగాయి.

ఈ అనాగరికి ప్రజల విషయంలో మనపార్టీ కర్తవ్యం యేమిటి? కులకులపై (భూస్వాములపై) ముఖ్యంగా గ్రేట్ రష్యన్ కులకులపై పోరాటం సాగించి వారి అధికారం నిర్మూలనం చేయుటకుగాను, యీ ప్రజలనందరను రష్యన్ ప్రజాసామాన్యంతో సంఘటితపరచి ఒకే ఐక్యవిప్లవ ప్రజాఉద్యమాన్ని నిర్మించుట కులక్ వలసదారులను పారద్రోలి మానవజీవితాధారమైన భూమిని మరల ఆప్రజల కిప్పించుట-ఇవియే ఆ ప్రజల యెడల మనపార్టీ నిర్వర్తించవలసిన విధులు.

4. ఈపై చెప్పినవేకాక, స్థిరనివాసాలుగాని, వర్గ నిర్మాణంగాని లేని యెన్నో, అల్పసంఖ్యాకజాతులు, గుంపులు రష్యన్ ఫెడరేషన్‌లో వున్నాయి. వారికొక ప్రత్యేక నివాస ప్రదేశంలేదు. ఇతరజాతులు నివశించే ప్రదేశాల్లోనే వీరు అనేకచోట్ల చెల్లాచెదురుగా వున్నారు. లెట్టులు, ఎస్తోనియన్లు, యూదులు, మొదలగు యీ చిన్న గుంపులను జారిస్టు ప్రభుత్వం పూర్తిగా నిర్మూలించుటే తన లక్ష్యంగా పెట్టుకుని తదాశయ సిద్ధికి తనకు చేతనైనన్ని విధాల ప్రయత్నించింది. మూకుమ్మడి ప్రజాహత్యలకుకూడ వెనుదీయ లేదు. యూదులపై చిత్రవధలను, పోగ్రాములను (రౌడీలను పురిగొల్పి వారి ఆస్తులను పాడుచేసి, హత్యలుచేయించుట.) పురికొల్పింది.

సోవియటు వ్యవస్థ అన్ని జాతులమధ్య సమానత్వాన్ని గుర్తిస్తుంది. ఆ వ్యవస్థలో వివిధ జాతుల హక్కులు (తమ అభివృద్ధి కార్యక్రమాన్ని నిరాటంకంగా కొనసాగించు కొనుటకు పూర్తిగా "గ్యారింటీ" చేయబడతాయి. ఆ ప్రజల యెడల పార్టీ చేయవలసిన పని ఒక్కటే వుంది: ఆ అల్పసంఖ్యాక ప్రజలు తాము సంపాదించిన హక్కులను, అవకాశాలను పూర్తిగా, సద్వినియోగం చేసుకొనేటట్లు చూడాలి. ఆ విషయంలో వారికి తోడ్పడాలి.

5. సరిహద్దు ప్రదేశాలలో (Border Regions) కమ్యూనిస్టు నిర్మాణ సంస్థల అభివృద్ధి కొన్నిపరిస్థితుల మూలకంగా ఒక విచిత్ర పంథాలో నడుస్తూంది. దానిని వెంటనే అరికట్టి, సవరించక పోయినట్టయితే ఆ ప్రదేశాలలో పార్టీ అభివృద్ధికే ముప్పు కల్గుతుంది. ఒక ప్రక్క యీ ప్రదేశాలలో పనిచేస్తూన్న గ్రేట్‌రష్యన్ జాతికిచెందిన కమ్యూనిస్టులు తరచుగా జాతి ప్రత్యేకతలను అలక్ష్యంచేయుటగాని, పూర్తిగా విస్మరించుటకాని జరుగుతూంది. వారు మొదటినుంచీ, (పాలకజాతికి) స్వతంత్రజాతికి చెందిన వారవడంచేత జాతి నిర్బంధ విధానం అంటే యేమిటో వారికి అనుభవంలేదు. అందుమూలంగా వారు తమ పార్టీ నిర్మాణంలో ఆయా ప్రజల యొక్క వర్గనిర్మాణంలో, విజ్ఞానంలో, సాంఘిక జీవితంలో వారి చారిత్రక సాంప్రదాయాలలోవున్న ప్రత్యేక లక్షణములను గుర్తించకపోవడం, వాటికి తగిన ప్రాధాన్యతనీయకపోవడం జరుగుతూంది.

అంటే జాతీయ సమస్యపై పార్టీయొక్క విధానానికి వారు తప్పు వ్యాఖ్యానాలు చేసి పెడదోవలు త్రొక్కిస్తున్నారన్నమాట. ఈ పంథా యిలాగే నడచినట్లయితే చివరకది కమ్యూనిజం నుండి, గ్రేట్ రష్యన్ జాతీయ దురహంకారంలోకి సామ్రాజ్య స్థాపన స్వభావంలోనికి పతనమైపోతుంది. ఇంకో ప్రక్క, ఆయా స్థానిక ప్రజలకు చెందిన (Native) కమ్యూనిస్టులు తమ పార్టీ నిర్మాణంలో జాతీయ ప్రత్యేకతలకు యెక్కువ ప్రాముఖ్యతనిచ్చుట జరుగుతూంది. వారి మనస్సులలో వెనుకటి నిర్బంధ విధానంయొక్క దారుణ కార్యాలు మాసిపోలేదు. దాని యెడల వారికింకా భయంపోలేదు. దానిమూలంగా వారు ఒకే జాతికి చెందినా శ్రామికులయొక్కయు, యితరులయొక్కయు ప్రయోజనాలు వేరు అనే సంగతిని మరచిపోయి, తమ పార్టీ నిర్మాణకార్యక్రమంలో శ్రామికుల ప్రయోజనాలను పూర్తిగా వదలివేయుటగాని, లేదా 'జాతి' అంతటి యొక్క సామాన్య ప్రయోజనాలతో (General interest) కలిపి వేయుటగాని చేస్తున్నారు. ఇదొక తప్పుడు పంథా. ఇది కమ్యూనిజంనుండి బూర్జువా ప్రజాస్వామ్య జాతీయవాదానికి దారితీస్తుంది. ఒక్కొక్కపుడది "పాన్-ఇస్లామిజమ్; పాన్-టర్కిజమ్"లవంటి అభివృద్ధి నిరోధక స్వరూపములను కూడా పొందవచ్చును.

ఈ రెండు తప్పుడు పంథాలు (Deviations) కూడా కమ్యూనిజం యొక్క క్షేమానికీ, అభివృద్ధికీ మిక్కిలి హానికరములని, యీ 'కాంగ్రెస్' అభిప్రాయపడుతూంది. ముఖ్యముగా మొదటి పంథా యెక్కువ ప్రమాదకరమైనది. పార్టీసభ్యులలో యీ వలసరాజ్యస్థాపనభావాలు, సంకుచిత జాతీయ భావాలు పూర్తిగా పోతేనే తప్ప సరిహద్దు ప్రదేశాలలో కమ్యూనిస్టుపార్టీని బలమైన ప్రజాపార్టీగా నిర్మించుట సాధ్యపడదనే సంగతి అందరూ గుర్తించాలి; మనపార్టీ సిసలైన కమ్యూనిస్టుపార్టీగా అభివృద్ధిచెంది, 'అంతర్జాతీయత' అనే పునాదిపై రష్యన్, రష్యనేతర జాతులకు చెందిన శ్రామికప్రజాసామాన్యాన్నంతటినీ తన జెండా క్రింద ఐక్యపరచాలి. అందుచేత సంకుచిత జాతీయవాదులు, కాలనైజర్సు, వూగిసలాట తత్వానికి లోనైపోయిన యీ పైరెండు రకాల వాళ్ళనీ కూడ కమ్యూనిస్టుపార్టీ నుండి వెంటనే తొలగించుట 'సరిహద్దు ప్రదేశాల'లో పార్టీ ప్రధానకర్తవ్యాలలో ఒకటిగా యీ కాంగ్రెసు అభిప్రాయపడుతూంది.

యుద్ధరంగాలలో మనకు విజయంమీద విజయం లభిస్తూండటం వలన ముఖ్యంగా 'రాంగెల్' సైన్యాలు పూర్తిగా నాశనం చేయబడిన తర్వాత నుంచీ, కార్మికవర్గంలేని వెనుకబడియున్న సరిహద్దు ప్రదేశాలు కొన్నింట పెట్టీ బూర్జువా జాతీయవాదుల ముఠాలు పార్టీలో చేరుటకు వుబలాటపడుతున్నారు. అందులో వాళ్ళవుద్దేశ్యం నాయకత్వం సంపాదించుటే. పార్టీ నేడు యెంతో బలీయమైనదనీ, ప్రభుత్వాధికారం దాని చేతిలోనేవున్నదనీ గుర్తించి, వీరందరూ కమ్యూనిస్టు బురఖా తగిలించుకొని పార్టీలో చేరడానికి పెద్దగుంపులుగా తయారవుతున్నారు. వారితోబాటు పార్టీలోనికి వారి లంచగొండితనం, జాతీయ దురహంకారాన్నికూడ తీసుకొస్తున్నారు. బోర్డరు (సరిహద్దు) రీజియన్సులోని మనపార్టీసంస్థలు చాలామట్టుకు బలహీనంగానే వున్నాయి. ఆ కారణంచేత

యీకొత్తగావొచ్చే వాళ్ళందరనూ సభ్యులుగా తీసుకుంటే "పార్టీ" యెంతో విస్తృతం అవుతుంది, బలపడుతుంది, అనే ఆశ వాటిని పీడిస్తూంటుంది.

ఈ కాంగ్రెసు, శ్రామికవర్గ పార్టీలోనికి కమ్యూనిస్టు బురఖాతోదూరిన మోసగాళ్ళనందరనూ వెంటనే బహిష్కరించవలెనని ఆదేశిస్తూంది. పెటీబూర్జువా జాతీయవాదులను సభ్యులుగా తీసికొని పార్టీని విస్తృతంచేసే ప్రయత్నాలను విరమింపవలసినదిగా పార్టీని హెచ్చరిస్తూంది; సరిహద్దు దేశములలోని పార్టీలోనికి సభ్యులను సాధ్యమైనంతవరకు కార్మికులలోంచి బీదరైతులలోంచి మాత్రమే తీసుకోవాలి; పైగా పార్టీసభ్యుల యొక్క స్థాయిని అభివృద్ధిచేసి పార్టీని బలపర్చుటకు తీవ్రప్రయత్నాలు జరగాలి.



## రెండే రెండు సిద్ధాంతాలు....

"కార్మికవర్గం తన ప్రయోజనాల సాధనకోసం నిర్మించుకొనే ఉద్యమానికి ఒక ప్రత్యేకమైన-స్వతంత్రమైన సిద్ధాంతాన్ని తయారుచేసుకోవడమంటూ లేనేలేదు. కాబట్టి బూర్జువా, సోషలిస్టు సిద్ధాంతాలలో దేనినో ఒకదానిని అనుసరించడంకంటే వారికి వేరే గత్యంతరం లేదు. ఈ రెండు సిద్ధాంతాలకు మినహా వేరే మధ్యమార్గం అంటూలేదు. ఎందువల్లనంటే మానవజాతి మూడో సిద్ధాంతాన్ని సృష్టించనేలేదు. అంతేగాక పరస్పర వర్గవైరుధ్యాలతో నిండివున్న ఈ సమాజంలో ఏ వర్గానికి చెందనిదిగాని, లేక వర్గాలకు అతీతమైన సిద్ధాంతంగాని వుండేందుకు అవకాశం లేనేలేదు. కాబట్టి సోషలిస్టు సిద్ధాంతం యొక్క ప్రాముఖ్యతను ఏ దృష్టితో గుర్తించ నిరాకరించినా - లేక దానినుండి కొంచెం దారితప్పి పెడత్రోవ బట్టినా అది బూర్జువా సిద్ధాంతానికి బలం చేకూర్చడమే అవుతుంది".

- లెనిన్

"శ్రామికవర్గంకొరకు పాటుపడాలని కోరేవారెవరైనాసరే "తన యొక్క" ఇతరుల యొక్క బూర్జువా జాతీయతను ఖచ్చితంగా ఎదుర్కొంటూ అన్నిదేశాల కార్మికుల ఐకమత్యంకోసం కృషిచేసి తీరాలి".

- లెనిన్

# V. జాతీయ సమస్య - పార్టీ తక్షణ కర్తవ్యం

(రష్యన్ కమ్యూనిస్టుపార్టీ పదవ సమావేశంలో యిచ్చిన రిపోర్టు. మార్చి 10-1921)

జాతీయసమస్య యెడల పార్టీయొక్క తక్షణ కర్తవ్యములను నిర్ణయించుటకు ముందు ఆ సమస్య పరిష్కారానికి అత్యవసరములైన కొన్ని ముఖ్యవిషయాలను స్పష్టీకరించవలసియుంది. అవి జాతుల పుట్టుక, జాతీయ నిర్బంధవిధానంయొక్క పుట్టుక, చారిత్రకాభివృద్ధి క్రమంలో నిర్బంధవిధానం పొందిన వివిధరూపాలు, వివిధ అభివృద్ధి దశలలో జాతీయ సమస్య పరిష్కార మార్గం యొక్క స్వరూపాలు, వీటికి సంబంధించినవి.

అటువంటివి మూడుదశలు (Periods) వున్నాయి.

పాశ్చాత్యదేశాలలో భూస్వామ్యపద్ధతి అంతరించి పెట్టుబడిదారీ విధానం సుస్థిరమయేవరకూ జరిగిన మధ్యకాలమే జాతీయ సమస్యలో ప్రథమదశ. ఇదే సమయంలో ప్రజలు జాతులుగా యేర్పడ్డారు. ఇక్కడ బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ మొదలగు దేశాల గురించి చెపుతున్నాను. పశ్చిమాన బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ, కొంతవరకు జర్మనీలో - భూస్వామ్యపద్ధతి నాశనమై ప్రజలు జాతులుగా యేర్పడుట, ఆయా దేశాలలో కేంద్ర ప్రభుత్వాలు స్థాపింపబడుట, రెండూ యించుమించు ఒకేకాలంలో జరిగేయి. అందుచేతనే ఆ జాతులు రాజకీయంగా 'స్టేట్' రూపాన్ని పొందేయి. ఆ రాజ్యాలలో చెప్పుకోదగినంత సంఖ్యాబలం కలిగిన యితర మైనారిటీ జాతులు లేకపోవుటవలన జాతీయఅణచివేత విధానం (National Oppression) వాటిలో కన్పించదు. తూర్పు యూరపుదేశాలలో భూస్వామ్య విధానం నాశనమై ప్రజలు జాతులుగా యేర్పడుట, కేంద్రప్రభుత్వాల స్థాపన, ఒకేకాలంలో జరుగలేదు. దీనికి ఆస్ట్రియా-హంగరీ, రష్యాలే నిదర్శనం. ఆ దేశాల్లో పెట్టుబడిదారీ విధానం అప్పటికింకా తలచూపలేదనే చెప్పవచ్చు. అయినా టర్కు, మంగోల్సు మొదలగువారి దండయాత్రల నుండి దేశాన్ని రక్షించుకునేందుకు, బలీయమైన కేంద్ర ప్రభుత్వస్థాపన అత్యవసరమైంది. ప్రజలు జాతులుగా యేర్పడుటకెంతో ముందుగానే కేంద్ర ప్రభుత్వ స్థాపనలు జరుగుట మూలంగా ఒకేరాజ్యాంగంలో భిన్నజాతులకు చెందిన ప్రజలుండుట తటస్థించింది.

ఈ మొదటి దశలో పెట్టుబడిదారీ విధానాభివృద్ధితోబాటు ప్రజలు జాతులుగా యేర్పడ్డారు. పశ్చిమ యూరపులో జాతి నిర్బంధ విధానం యెరుగని జాతీయ ప్రభుత్వాలేర్పడినై కాని, తూర్పుయూరపులో ఒకే కేంద్రరాజ్యాంగంక్రింద వివిధజాతుల ప్రజలుండుట తటస్థించింది. వాటిలో బాగా అభివృద్ధిచెందియున్న ఒకజాతి అధికారంలో వుండి, అనాగరికదశలోవున్న యితరజాతులన్నింటినీ రాజకీయ, ఆర్థిక దాస్యానికి లోను గావించింది. జాతివైషమ్యాలకు, జాతీయోద్యమాలకు, జాతీయసమస్యకు ఆ సమస్యా పరిష్కార విధానాలకూ మూలమైన జాతీయనిర్బంధ విధానం యీ తూర్పు యూరపులోని బహుళజాతి ప్రభుత్వాలలోనే పుట్టింది.

సామ్రాజ్యవాదం పొడచూపుట, జాతీయనిర్బంధవిధానాభివృద్ధి, ఆ సమస్యా పరిష్కార విధానాలు, యివన్నీ రెండోదశ కాలంలో జరిగేయి. పెట్టుబడిదారీ దేశాలకు మార్కెట్లు, ముడిపదార్థాలు చవుక శ్రమశక్తి (cheap labor) కావలసి వచ్చాయి. ఇతర దేశాలలో పెట్టుబడులు పెట్టి తమ ఆర్థిక ఆధిపత్యాన్ని వలస దేశాలపై స్థాపించుటకు, తమ వర్తక వ్యాపారముల నెక్కువచేసికొనుట కవసరమైన సముద్ర, రైలుమార్గాలకొరకు పెట్టుబడిదారీ దేశాలమధ్య తీవ్రమైన పోటీ బయల్దేరింది. దానితో జాతీయ ప్రభుత్వాలు వలస రాజ్య సంపాదన కొరకు దురాక్రమణలు ప్రారంభించేయి. ఈ రెండోదశలో పశ్చిమ యూరపులోని వివిధ ఏకజాతి ప్రభుత్వాలు (single national states) బ్రిటన్, ఫ్రాన్సు, ఇటలీ మొదలైనవి కొత్త వలస రాజ్యాలను ఆక్రమించి సామ్రాజ్యవాద దేశాలుగా, బహుళజాతి ప్రభుత్వాలుగా మారేయి. తూర్పుయూరపు దేశాలలో వలెనే వీటిలో కూడా నిర్బంధవిధానం - మైనారిటి జాతులపై, వలసదేశ ప్రజలపై-బయల్దేరింది. తూర్పుయూరపులో ఈ రెండోదశ కాలంలోనే జెక్స్, పోల్సు మొదలగు పాలిత జాతులలో జాతీయ సంచలనం కల్గింది. 1914-18 మధ్య జరిగిన సామ్రాజ్యవాద యుద్ధానంతరం వెనుకటి బహుజాతి రాజ్యాంగములన్నీ కూలద్రోయబడి కొత్తగా జాతీయ రాజ్యాంగములు నిర్మింపబడినై. అందులో చాలావాటియొక్క ఉనికి (existence) పెద్దరాజ్యాల దయపై ఆధారపడియుంది.

మూడోది సోవియట్‌దశ. ఈ దశలో పెట్టుబడిదారీ విధానము కూలద్రోయబడుట, జాతీయ నిర్బంధ విధానం నశించుటయు జరిగింది. పాలక పాలితదేశాలు; మాతృ వలసదేశాలు అనేతేడాలు క్రమంగా పాతబడి పోతున్నాయి. రష్యను ఫెడరేషనులో వివిధజాతుల ప్రజలు సమాన హక్కులను, అవకాశాలను కల్గియున్నారు. అయితే వెనుక గ్రేట్‌రష్యన్ జాతివారు ఇతర జాతుల ఆర్థిక రాజకీయాభివృద్ధిని అణిచివేసి ప్రభుత్వాధికారాన్ని తమ ఒక్కరి రాజకీయ, పారిశ్రామికాభివృద్ధికొరకే ఉపయోగించుకున్నారు. అందుచేతనే చారిత్రకంగా కల్గిన యీ అసమానత్వం ఇంకా వుంది. ఎంతోకాలంనుండి బుద్ధిపూర్వకంగా ఎక్కువచేయబడిన యీ ఆర్థిక రాజకీయ అసమానత్వం ఒకటి రెండు సంవత్సరాలలోనేపోదు. కాని, అది నిర్మూలింపబడకతప్పదు. నేడు వెనుకబడియున్న యీ జాతుల యొక్క ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానికాభివృద్ధికి సహాయంచేయుట ద్వారానే యీ అసమానత్వం నిర్మూలింపబడాలి.

జాతీయ సమస్యలో చారిత్రకంగా మనకు తెలిసిన మూడుదశలుఇవే. మొదటి రెండుదశలకు సామాన్య (common) విషయం ఒకటుంది. ఆ రెండుదశలలోనూకూడా జాతులు నిర్బంధ విధానంకీ, బానిసత్వంకీలోనుగావడం, దానిమూలంగా యెడతెగని జాతీయ పోరాటాలు జరుగటం మొత్తానికి జాతీయసమస్య పరిష్కారం కాలేదు. మొదటిరెండుదశలకూ ఒక తేడా కూడా వుంది. మొదటిదశలో జాతీయసమస్య వివిధబహుజాతి రాజ్యాంగములలోనే వుండేది. ఆ సమస్య ఏదో కొన్ని యూరపు జాతులకు

మాత్రమే సంబంధించియుండేది. కాని రెండోదశలో అది ప్రతి ఒక రాజ్యాంగానికి సంబంధించిన అంతరంగిక సమస్యనుండి ఎన్నో ప్రభుత్వాలకు సంబంధించిన పెద్ద సమస్యగా మారింది. జాతీయ సమస్య చివరకు కొత్త వలసరాజ్యాలను సంపాదించుటకు, వలసదేశ ప్రజలను దోచుకొనుటకు పెద్ద సామ్రాజ్యవాద దేశాలమధ్య యుద్ధ సమస్యగా మారింది. ఈ విధంగా మొదట నాగరిక దేశాలకు మాత్రమే సంబంధించిన యీ జాతీయ సమస్య క్రమంగా వలసరాజ్య సమస్యలో కలిసిపోయింది.

అయితే, యీ మార్పు తలవనితలంపుగా కలిగిన చారిత్రక సంఘటన కాదు; దానికీ కొన్ని కారణాలున్నాయి. మొదటిది సామ్రాజ్యవాద యుద్ధకాలంలో, ఇరుపక్షాలనున్న సామ్రాజ్యవాదుల ముఠాలుకూడ సైన్యాలలో చేరి తమకు తోడ్పడవలెనని వలసదేశాల ప్రజలను కోరక తప్పిందికాదు. దీనివలన ఆ ప్రజల్లో చైతన్యం కలిగి వారిలో పోరాటంకొరకు, దాస్యవిముక్తులౌటకు తీవ్రమైన వాంఛను కల్గించింది. జాతీయ సమస్య ప్రపంచవ్యాపితమైన వలస దేశాల సమస్యగా మారుటకింకో కారణం కూడా వుంది. దాని మూలాన్నే మొదట చిన్నదిగా ప్రారంభమైన దాస్యవిముక్తి పోరాటం క్రమంగా ప్రపంచాన్నంతటినీ చుట్టుముట్టింది. ఈ సామ్రాజ్యవాద ముఠాలు, టర్కీని ముక్కలుచేసి తమలో తాము పంచుకొనుటకు, టర్కీని రూపుమాపుటకు ప్రయత్నం చేశాయి. మహమ్మదీయ ప్రజలందరిలో చాలా నాగరికమైయుండి వారికి నాయకస్థానంలోవున్న టర్కీ సహజంగా దీన్ని అంగీకరించలేకపోయింది. తన శత్రువులపై యుద్ధం ప్రకటించి, తూర్పు దేశాల ప్రజలను సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్యమంలో సంఘటితపరచింది. మూడోకారణం. సోవియటు రష్యా రంగంమీదికి ప్రవేశించడం. సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటంలో సోవియట్ రష్యా పొందిన అఖండ విజయాలు, తూర్పుదేశాల బానిస ప్రజలలో వుత్సాహాన్ని, ఆశను కల్పించేయి. వారిలో స్వాతంత్ర పిపాసను రగుల్కొల్పివారిని పోరాటానికి తయారుచేసేయి. అటు ఐర్లండు నుండి ఇటు ఇండియా వరకువున్న పీడిత ప్రజలందరూ ఒక్కుమ్మడిని సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్యమాన్ని సృష్టించారు.

ఈ కారణాలన్నిటివలన బూర్జువా సమాజం జాతీయసమస్యను పరిష్కరించి ప్రజలమధ్య శాంతిని నెలకొల్పలేక పోవుటయేగాక, తమనిర్బంధ విధానము వలస దేశాలలోని పీడిత జాతులలో అణగియున్న పిపాసను రగుల్కొల్పి వారందరూ ప్రపంచ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా యుద్ధభూమిలోనికి వొచ్చేలా చేసింది.

జాతీయసమస్యను పరిష్కరించగల్గింది వివిధజాతులు పరస్పర సహకారంతో, సుహృద్భావంతో నివసించుటకు తగిన పరిస్థితులను కల్పించగల్గినది, ఒక్కసోవియట్ ప్రభుత్వపరిపాలనయే; శ్రామికవర్గ నియంతృత్వమేనని చెప్పక తప్పదు.

పెట్టుబడిదార్ల అధికారం, వుత్పత్తి సాధనాలలో వ్యక్తిగత ఆస్తిహక్కు, వర్గభేదాలూ వున్నంతకాలం జాతులమధ్య సమానత్వం అనేది అసాధ్యం; పెట్టుబడిదార్లు అధికారంలో వున్నంతకాలం, వుత్పత్తిసాధనాలను వశపర్చుకొనుటకుపోరాటం జరుగుతున్నంత కాలం

జాతులమధ్య సమానత్వంకాని, వివిధజాతుల శ్రామిక ప్రజాసామాన్యం మధ్య సహకారం కాని వుండజాలవు. జాతులమధ్య అసమానత్వమును పోగొట్టుటకు అన్ని జాతులకు చెందిన శ్రామిక ప్రజాసామాన్యంమధ్య సహకారంపై ఆధారపడిన సమాజవ్యవస్థను స్థాపించాలంటే పెట్టుబడిదారీ విధానాన్ని నాశనంచేసి సోవియటు వ్యవస్థను స్థాపించుటే యేకైకమార్గమని చరిత్ర మనకు తెలుపుతూంది.

చరిత్ర ఇంకోవిషయాన్ని కూడా స్పష్టంగా తెలియజేస్తూంది. ఒక ప్రజా జాతీయ విజాతీయ బూర్జువా వర్గాలను కూలద్రోసి సోవియటు వ్యవస్థను నిర్మించుకొన్న తర్వాత కూడ ప్రపంచంలో సామ్రాజ్యవాదం బలీయమై వున్నంతకాలం తమ ఇరుగుపొరుగు సోవియట్ రిపబ్లిక్కుల ఆర్థిక, సైనిక సహాయంవుంటేనే తప్ప తమ నూతన సామాజిక వ్యవస్థను కాపాడుకోలేరు. సోవియటు రిపబ్లికులు అన్నీ ఒకే రాజకీయ సమాఖ్యలో కలిసి సంపదలన్నిటినీ కేంద్రీకరించి బలమైన ఐక్య ఆర్థిక, సైనిక శక్తిగా తయారైతేనేతప్ప ప్రపంచ సామ్రాజ్యవాదుల సంయుక్తశక్తి నెదుర్కోలేరనే విషయం, 'హంగరీ' యొక్క వుదాహరణనుబట్టి పూర్తిగా తెలుస్తూంది.

రష్యన్ సోవియట్ ఫెడరేషన్ అటువంటి రాజకీయ సమ్మేళన (Political Union) యొక్క సజీవమైన రూపమే.

కామ్రేడ్స్, రష్యన్ సోవియట్ ఫెడరేషన్‌లో జాతీయ సమస్య పరిష్కారానికి మన పార్టీ నిర్ణీత కార్యక్రమం నెరవేర్చవలసిన అవశ్యకతను తెలయజేయుటకే యీ పై విషయములన్నీ వివరింపవలసివచ్చింది.

సోవియట్ పరిపాలన క్రింద రష్యాలోను, యితర సోవియటు రిపబ్లిక్కులలోను కూడ పాలకపాలిత జాతులుగాని, మాతృవలస దేశాలుగాని, దోపిడీదార్లు, పీడితులుగాని, లేకపోయినప్పటికీ రష్యాలో 'జాతీయ సమస్య' యిప్పటికీ పూర్తిగా పరిష్కారం గాలేదు. చాలాకాలం నుంచి అనాగరికంగావున్న వివిధజాతుల ప్రజలు ఆర్థికంగా, రాజకీయంగా, వైజ్ఞానికంగా సత్వరాభివృద్ధిచెంది మధ్యరష్యాతో సమానస్థితికి వచ్చుటకు తగిన అవకాశాలను కల్పించిననాడే సమస్య పూర్తిగా పరిష్కరింపబడుతుంది. జారిస్టు ప్రభుత్వం యుక్రేన్, అజర్‌బైజాన్, టర్కీస్తాన్ వగయిరా దేశాలను రాజకీయంగా అభివృద్ధి చేయుటకు వీసమంతైనా ప్రయత్నించి యుండలేదు. సరిహద్దు ప్రదేశాలలోని ప్రజల యొక్క వైజ్ఞానికాభివృద్ధికి ఎన్నో దాటరాని అడ్డంకులు కల్పింపబడినై. ఇతర జాతుల ప్రజలను బలవంతంగా 'రస్సిఫై' (russify) చేయుటకు తీవ్రంగా ప్రయత్నించింది. రష్యన్ ప్రభుత్వ సహాయంతో రష్యన్ భూస్వాములు, పెట్టుబడిదార్లు, కిర్ఘిజ్‌లు, చెచెన్లు, ఒసెట్లు మొదలగు ప్రజల భూములనాక్రమించి వారిని, నిస్సహాయులను చేశారు. ఆ ప్రజలను సర్వనాశనం చేశారు. అట్టి ప్రజల అభివృద్ధి విషయంలో కూడ మనం పూర్తి బాధ్యత వహించాలి. గ్రేట్ రష్యన్ జాతి ఎంతోకాలం అధికారంలో వుండడంవలన ఆ అధికారచిహ్నాలు నేటికి రష్యన్ కమ్యూనిస్టులపై ప్రభావాన్ని చూపుతున్నాయి. వారు తాముగొప్పవారమనుకుంటూ

వెనుకబడియున్న అనాగరికజాతులతో దగ్గర సంబంధాల నేర్పరచుకొనుటగాని, వారి అభివృద్ధికొరకు కృషిచేయుటగాని పట్టించుకోవడంలేదు. వారి అవసరాలు గుర్తించి తమ పార్టీపనిలో సరిహద్దు ప్రదేశ ప్రజల యొక్క సాంఘిక జీవనంలోని, విజ్ఞానంలోని తేడాలను, ప్రత్యేకతలను గుర్తించక, రష్యన్ గ్రేట్ పవర్ ఛావునిజమ్ (జాతీయ దురహంకారం) వైపుకు మొగ్గుతూండే కొద్ది రష్యన్ కమ్యూనిస్టుల మతాలను గురించియే ఇక్కడ నేను మాట్లాడుతున్నాను. చిరకాల నిర్బంధాలకు గురియైపోయినజాతుల్లోని కమ్యూనిస్టులపై కూడ తత్ఫలితాలు యిప్పటికీ కన్పిస్తున్నాయి. వారొకప్పుడు తమ శ్రామిక ప్రజాసామాన్యం యొక్క ప్రయోజనాలను జాతీయ ప్రయోజనాలనుండి వేరుపరచలేకుండా వున్నారు. నేటివ్ కమ్యూనిస్టులలో కొన్ని సమయాల్లో కన్పించే సంకుచిత, జాతీయవాదం సంగతి యిక్కడ సూచింపబడుతూంది. ఈ సంకుచిత జాతీయతయే తూర్పున 'పాన్-ఇస్లామిజమ్, పాన్-టర్కీజమ్' వుద్యమాలకు పురిగొల్పింది. ముఖ్యంగా కిర్ఘిజ్, బష్కిర్, గోర్చి తెగలను సర్వనాశనంనుండి కాపాడి వారికి కావలసిన భూమిని కులక్ వలసదారుల నుండి లాక్కొనైనా వారికిప్పించాలి.

పార్టీయొక్క తక్షణ కర్తవ్యముల సంగతి చెప్పేను. ఇపుడు సరిహద్దు ప్రదేశాలలో, ముఖ్యంగా తూర్పుదేశాల్లోని ప్రత్యేక ఆర్థిక జీవిత పరిస్థితులకనుగుణంగా మనపార్టీ విధానాన్ని మార్చుకొనుట అనేకర్తవ్యాన్ని గూర్చి మాట్లాడతాను.

అక్కడ ఇంచుమించు మూడుకోట్ల ప్రజలు అందులో చాలాభాగం టర్కిష్ ప్రజలువున్నారు. పారిశ్రామిక విధానం అంటే యేమిటో యెరుగరు. వారింకా వెనుకటి భూస్వామ్య విధాన దశలోనే వున్నారు. అందుచేత వారిలో యించుమించుగా శ్రామికవర్గం లేనేలేదని చెప్పవచ్చును. ఇప్పుడువారు ఒక్కసారిగా ఆదిమ ఆర్థిక వ్యవస్థ ("ప్రిమిటివ్ ఎకానమీ") నుండి నేటి సోవియటు ఆర్థిక వ్యవస్థలోకి మారవలసియున్నది. ఇది కష్టసాధ్యమైనపనేగాని, అసాధ్యంకాదు; ఈ ప్రజలయొక్క ఆర్థిక జీవిత విధానంలోని ప్రత్యేకతలు, ఇవేకాక వారి చరిత్ర, సాంఘిక జీవితం, విజ్ఞానం వీటన్నిటినీ కూడ మనం జ్ఞాపకం వుంచుకోవాలి. ఇక్కడ మధ్యరష్యాలో ప్రాధాన్యత వహించిన విధానాలనే అనాలోచితంగా భిన్ననాగరికతా దశలోవున్న యీ ప్రజలలో ప్రవేశపెట్టజూచుట చాలా ప్రమాదకరమైన పని. రష్యన్ సోవియట్ ఫెడరేషన్ యొక్క ఆర్థిక విధానాన్ని యిక్కడ ఆచరణలో పెట్టేటప్పుడు సరిహద్దు ప్రదేశాలకు మాత్రమే సంబంధించిన (Peculiar to the border regions) వారి ఆర్థిక జీవితంలోని వర్గనిర్మాణంలోని, చారిత్రక సాంప్రదాయాలలోని ప్రత్యేకతలను మనం ముఖ్యంగా దృష్టిలో వుంచుకోవాలి. ఆహారపదార్థాల కోటాలను నిర్ణయిస్తూ, "పీపుల్సు కమిస్సేరియట్ ఆఫ్ ఫుడ్" కిర్ఘిజియాలోని మహమ్మదీయ ప్రజలకు పందులను సరఫరా చేయవలసిందిగా కోరింది. మహమ్మదీయులు పందిని అసహ్యించుకుంటారు. వారి పందుల నేవిధంగానూ వుపయోగించుకోరు. ఈ విషయం మామూలుగా ప్రతివానికీ తెలిసియుంటుంది. కాని అటువంటి ముఖ్యమైన ఆచారభేదాలను కూడా కొందరు గుర్తించకుండా వున్నారన్న విషయం ఈ వుదాహరణను

బట్టి స్పష్టమౌతుంది. ఇటువంటి అసంగతాలను (Incongruities) సరిదిద్దుకొన్న సంగతి గూర్చి యెక్కువగా చెప్పనక్కరలేదు.

కామ్రేడ్ చిషెరిన్ వ్యాసాలకు సమాధానం యిమ్మనికోరుతూ ఒక కాగితం నాకిప్పుడే వొచ్చింది. కామ్రేడ్స్, ఆ వ్యాసాలను నేను చాలా జాగ్రత్తగా చదివేను. అవి సారస్వతంగా మాత్రమే వుపయోగిస్తాయని నా అభిప్రాయం. వాటిలో నాలుగు పొరపాట్లు-తప్పు అభిప్రాయాలు-వున్నాయి. ఒకటి సామ్రాజ్యవాద రాజ్యాలమధ్య పరస్పర వ్యతిరేకత లేదంటాడు, కామ్రేడ్ చిషెరిన్. సామ్రాజ్యవాదులమధ్య అంతర్జాతీయ ఏకాభిప్రాయత చాలాయెక్కువ వున్నదంటాడు; వివిధ సామ్రాజ్యవాద ముఠాల రాజ్యాల (ఫ్రాన్సు, అమెరికా, బ్రిటన్, జపాను మొదలగు) మధ్యగల పరస్పర వ్యతిరేకతలు లేవంటాడు: అవి తప్పకుండా వున్నాయని, అవే యుద్ధాలకు దారితీస్తున్నాయని అందరికీ తెలిసిన సంగతే. సామ్రాజ్యవాద ప్రభువుల ఏకాభిప్రాయతను అతిశయోక్తిగా చెప్పేడు. వారి మధ్యగల ఆంతరంగిక విరుద్ధాల యొక్క బలాన్ని తక్కువచేసి చెప్పేడు. ఆ వైరుధ్యాలు తప్పకుండా వున్నాయి. వాటినాధారంగా చేసికొనే మన విదేశాంగశాఖ (People's commisseriate of foreign affairs). యొక్క కార్యక్రమం నడుపబడుతూంది. కామ్రేడ్ చిషెరిన్ యొక్క రెండో పొరపాటు యేమిటంటే కొత్తగా నిర్మింపబడిన జాతీయ రాజ్యాంగాలకూ (జెకోస్లోవేకియా, పోలండు, ఫిన్లండు మొదలగువాటిమీద, ఆర్థికంగా, సైనికంగా అధికారం కల్గియున్న గ్రేట్ పవర్సుకూ మధ్యగల వైరుధ్యాలకు కూడా యితడు తగిన ప్రాధాన్యత యివ్వలేదు. (గ్రేట్‌పవర్సు) అగ్రరాజ్యాలకు యీ జాతీయ ప్రభుత్వాలు లొంగియున్నప్పటికీ కూడా లేక ఆ లొంగియుండుటచేతనే కావచ్చు కూడాను, ఆ రెంటిమధ్యా పరస్పర వైరుధ్యాలున్నాయి. పోలండు, ఎస్తోనియా మొదలగు దేశాలతో జరిగిన రాయబారాల్లో యివన్నీ బైటపడ్డాయి. ఈ వైరుధ్యాలను సరిగా గుర్తించి, వాటిని వుపయోగించుకొని తన స్థానమును బలపర్చుకొనుటయే మన విదేశాంగశాఖ (Peoples Commissariat of Foreign affairs) యొక్క ప్రధానోద్దేశం. కామ్రేడ్ చిషెరిన్ యెంతో ఆశ్చర్యం కలుగుజేసేట్టుగా యీ విషయం యొక్క ప్రాముఖ్యతను తక్కువ అంచనా వేసేడు. కామ్రేడ్ చిషెరిన్‌యొక్క మూడో తప్పుయేమిటంటే, అతడు 'జాతీయ స్వయం నిర్ణయత్వము'ను గురించి అనవసరమైనవి చాలా చెప్పేడు; అప్పుడే జాతీయ స్వయంనిర్ణయత్వంలోని అసలు అర్థంపోయి అది యిప్పుడు సామ్రాజ్యవాదులచేత ప్రయోగింపబడుతూన్న అర్థశూన్యమైన వివాదంగా మారింది. ఈ నినాదాన్ని మనం రెండేళ్ళక్రితమే వొదిలిపెట్టిన విషయం చిషెరిన్ మరచిపోయినట్లున్నాడు. మన ప్రస్తుత కార్యక్రమంలో యీ నినాదం లేనేలేదు. మన కార్యక్రమంలో యిప్పుడున్నది నిర్ణీతమైన అర్థంకూడాలేని జాతీయ స్వయంనిర్ణయత నినాదంకాదు. అంతకంటే మంచిదీ, స్పష్టమైన నిర్వచనంగలదీ ఐన "జాతుల యొక్క రాజకీయంగా విడిపోవుటకు హక్కు" అనే నినాదం. ఈ రెండింటికీ చాలా తేడావుంది. తన వ్యాసాల్లో కామ్రేడ్ చిషెరిన్ యీ యదార్థాన్ని

గమనించలేదు. అందువలన యెన్నడో వదలివేయబడిన పాతనినాదం మీద అతడు చేసిన విమర్శనలన్నీ శుద్ధ వృధా ప్రయాసలయ్యాయి. ఎందుచేతనంటే నా 'థీసిస్'లో కాని, పార్టీ ప్రోగ్రాములోగాని యెక్కడా "స్వయం నిర్ణయత్వం" (self determination) గురించి ఒక్కమాటకూడా లేదు. వాటిలో వున్నది ప్రజలయొక్క రాజకీయంగా విడిపోయే హక్కును గురించే. వలసదేశాల్లో స్వాతంత్ర్యోద్యమాలు చెలరేగిన యీప్రస్తుత పరిస్థితులలో యిది మనకొక విప్లవకరమైన నినాదం. సోవియటు రిపబ్లికులన్నీ ఐచ్ఛికంగానే 'సమాఖ్య'లో చేరుటవల్లనూ, రష్యన్ సోవియట్ ఫెడరేషనులోని ప్రజలందరూ దానిని కోరుటచేతనూ, 'విడిపోయేహక్కు' అమలు జరువబడలేదు కాని బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా, జపానులక్రిందనున్న వలసదేశాలకు, అరేబియా, మెసపొటేమియా, టర్కీ, హిందూస్తాన్ మొదలగు బానిస దేశాలకు సంబంధించినంతవరకు యీనినాదం (విడిపోయే హక్కు) విప్లవనినాదమే. దాన్ని మనం వొదిలివేయుట అంటే 'ఎంటెన్టి' (entent = రెండు రాజ్యాలవారికి గల పరస్పర మైత్రి) యొక్క వలలో పడిపోయేమన్న మాటే. అతడి వ్యాసాల్లోని నాలుగో పొరపాటు, వాటిలో యేమీ ఆచరణలో పెట్టవలసిన సూచనలు లేవు. వ్యాసాలు వ్రాయుటలో అట్టేకష్టంలేదు; గాని "కామ్రేడ్ స్టాలిన్ థీసిస్‌కి వ్యతిరేకంగా" అని దానికి పెద్దపేరుపెట్టినపుడు దానిలో తగిన విషయ ప్రాధాన్యత వుండాలి. అధమం యేవో కొన్ని ప్రతిసూచనలైనా (counter proposals) వుండాలి. కాని అతని వ్యాసాల్లో అట్టి ఆచరణీయమైన సూచన ఒక్కటికూడా నాకు కన్పించలేదు. కామ్రేడ్సు, ఇంతటితో ముగించబోతున్నాను. మనం ఈక్రింది నిర్ణయాలకు వొచ్చేము. బూర్జువా సమాజం జాతీయ సమస్యను పరిష్కరించక పోవడం అటుంచి పైగా దానిని క్లిష్టతరంచేసి వలసదేశాల సమస్యగా తయారుచేసి తనకే వ్యతిరేకంగా అటు ఐర్లండు నుండి యిటు హిందుస్తాన్ వరకు ఒక శత్రురంగాన్ని నిర్మించుకుంది; తన తెలివి తక్కువ పోలసీవలన ఉత్పత్తి సాధకాల సమిష్టి యజమాన్యం మీద నిర్మితమైన సోవియటు రాజ్యాంగం ఒక్కటే జాతీయ సమస్యను ధైర్యంగా ఎదుర్కొని పరిష్కరించగలదు. సోవియటు ఫెడరేషనులో పాలకజాతులు, పీడితజాతులు వుండవు. జాతీయ నిర్బంధ విధానం తొలగింపబడింది. పాతబూర్జువా వ్యవస్థనుండి వారసత్వంగా వచ్చిన నాగరిక, అనాగరకజాతులమధ్య (వైజ్ఞానిక, ఆర్థిక, రాజకీయ) అసమానత్వం వుండుట వలన జాతీయ సమస్య ఒక కొత్తరూపంలో ప్రత్యక్షమైంది. వెనుకబడివున్న జాతుల ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానికాభివృద్ధిని త్వరపరచుటకు, చాలా అభివృద్ధిదశలోవున్న మధ్యరష్యాతో కలుసుకొనుటకూ, వారికి తగిన అవకాశాలు కల్పించుటకు అవసరమైన విధానాలను కార్యక్రమాన్ని అవలంబించి దానిని పూర్తిగా పరిష్కారం చేయాలి. నేను మీముందుంచిన "జాతీయ సమస్యపై థీసిస్"లోని మూడో సెక్షనులోనున్న ఆచరణీయములైన సూచనలు మన యీ కర్తవ్య నిర్వహణకు వుపకరిస్తాయి.

## చర్చకు సమాధానం

కామ్రేడ్స్,

జాతీయ సమస్యమీద ఈ సమావేశం (కాంగ్రెస్)లో జరిగిన చర్చలో అతి ప్రధానమైన విషయం యేమిటంటే, మనం జాతీయ సమస్యపై ప్రకటనలు చేయడంనుండి రష్యా (పరిపాలక) పునర్విభజన ద్వారా సమస్యకు ఆచరణసాధ్యమైన పరిష్కారమార్గానికి వొచ్చేం. అక్టోబరు విప్లవ ప్రారంభంలో జాతులకు 'విడిపోయేహక్కు' (right to secede) వుందని ప్రకటించడంతో వూరుకున్నాము. 1918లోనూ, 1920లోనూ, వెనుకబడియున్న జాతుల శ్రామిక ప్రజాసామాన్యానికీ, రష్యన్ శ్రామికవర్గానికీ మధ్య దగ్గర సంబంధాలు నెలకొల్పేఆశయంతో రష్యానంతనూ జాతీయ సూత్రానుగుణ్యంగా వివిధ పరిపాలనా 'యూనిట్సు'గా విభజించేము. ఇప్పుడు యీ సమావేశంలో సమస్యనంతనూ ఆచరణయోగ్యమైన గట్టి పునాదిపై వుంచాము. ఆ సందర్భములో "రష్యాతో కలిసియున్న యీ స్వపరిపాలిత ప్రాంతాలు (Autonomous regions) స్వతంత్ర రిపబ్లికులలోని శ్రామిక ప్రజాసామాన్యం ఎడల, పెటీబూర్జువావర్గం ఎడల పార్టీ విధానం ఏవిధంగా వుండాలి" అనే విషయం కూడా నిర్ణయింపబడాలి. "ఈ థీసెస్ ఆచరణ సాధ్యంకాదని "కామ్రేడ్ జాటోన్స్కీ అనడం నాకు చాలావింతగా వుంది. ఇపుడు నా చేతిలో అతడు తయారుచేసిన థీసెస్ వుంది. యే కారణంచేతనో అతడు దానిని ఈ సమావేశం యొక్క దృష్టిపధంలోకి రానీయలేదు. ఆ థీసిస్ అంతలోనూ నిర్మాణయుక్తమైన సూచన ఒకటికూడ లేదు. రష్యన్ సోవియట్ ఫెడరేషన్ అనే పేరు మార్చి "ఈస్టు యూరపియన్" అనే పేరుంచాలని "రోస్సిస్కోయి" అనే దానికి బదులు "రష్యన్" లేక "గ్రేట్ రష్యన్" అనే మాట వుపయోగించాలనీ తప్ప జాటోన్స్కీ థీసిస్‌లో ఇంకో సూచన లేనేలేదు.

తర్వాత విషయం. చర్చలో పాల్గొనిన ప్రతినిధులనుండి నేనెంతో ఎక్కువ ఆశించాను. రష్యాలో 22 సరిహద్దు ప్రదేశాలు (border regions) వున్నాయి. వీటిలో కొన్ని పారిశ్రామికంగా బాగా అభివృద్ధి చెందినై. ఆ విషయంలో రష్యాకు వీటికీ అట్టేతేడాలేదు. మరికొన్ని పెట్టుబడిదారీ వ్యవస్థలోకి ప్రవేశించనే లేదు; వాటికీ, మధ్యరష్యాకూ ఎంతో తేడా వుంది. ఇంకా కొన్ని పూర్తిగా అణగద్రొక్కివేయబడి సంపూర్ణంగా నాశనమై పోయేదశలో వున్నాయి. ఈ థీసిస్‌లో యీ సరిహద్దు ప్రదేశాల భిన్నత్వాన్ని పూర్తిగా సోదాహరణంగా విశదీకరించుట అసాధ్యమైనపని. పార్టీ మొత్తానికి సంబంధించిన 'థీసిస్'లో ఒక టర్కీస్తాన్‌ను గురించియే వ్రాయాలి, ఒక్క అజర్ బైజాన్‌ను, ఒక్క యుక్రేన్ గూర్చి మాత్రమే వుండాలి, అని అడగడంలో సబబులేదు. అన్ని సరిహద్దు ప్రదేశాలలోను వున్న సామాన్య లక్షణాలనే (common features) ఏరి థీసిస్‌లో వాటికొక రూపం ఇస్తాము. ప్రత్యేకతలు వదలిపెట్టబడతాయి. 'థీసిస్'లను ఇంకో విధంగా తయారుచేయుటను మానవుడింకా కనిపెట్టలేదు. రష్యనేతర జాతులు ఎన్నో గుంపులుగా విభజింపబడాలి. 'థీసిస్'లో ఆ పద్ధతే అవలంబించబడింది. రష్యనేతర జాతుల జనాభా 6 కోట్ల 50 లక్షలు. రాజ్యాలు

(states) గా అభివృద్ధి చెందుటలో మధ్యరష్యాకంటె వెనుకబడియున్నారు అనేది వీరందరికీ వర్తించే సామాన్య లక్షణం. తమ మాతృభాషలో తమ స్వంత సోవియట్ స్టేట్‌లైఫ్ (state life) ను అభివృద్ధి చేసికొనుటకు యీ జాతులకు-వాటిలోని శ్రామిక ప్రజాసామాన్యానికి సహాయం చేయుటకు మనం చేయవలసిన కృషి అంతా పూర్తిగా చేయుటే మనకర్తవ్యం. 'థీసిస్'లోని 'సూచనల' సెక్షనులో యీ 'సామాన్యలక్షణము' (common feature) ను గురించి వ్రాయబడింది. తర్వాత బోర్డరు రీజియన్సులోని ప్రత్యేక లక్షణమునకు యింతకన్న స్పష్టమైన నిర్వచనం ఇవ్వవలెనంటె ఆ 6కోట్ల 50 లక్షల్లోంచి, పెట్టుబడిదారి దశలోనే ప్రవేశించని 3 కోట్ల టర్కిష్ ప్రజలను వేరుచేయవలసి యుంటుంది. కొన్ని విషయాల్లో రష్యన్ రాష్ట్రాలకన్న అజర్ బైజాన్ చాలా నయమని (వుత్కృష్టమైనదని) చెప్పిన కామ్రేడ్ మిట్కోయన్ వాదన తప్పు. బహుశా అజర్ బైజాన్ అని చెప్పినపుడు అతని దృష్టిలో "బాకూ" నగరం వుంది. అజర్ బైజాన్ గడ్డలోనుండి బయల్దేరిందికాదు, బాకూ నగరం: అది, నోబెల్, రాత్‌షిల్డు, విషీ యింకా యితరుల ప్రయత్నాల వలన అంటే బైటివారి (విదేశీయులు) కృషివలన నిర్మింపబడింది. అజర్ బైజాన్ మాత్రం ఎంతో వెనుకబడియుంది. ఆ దేశపు ప్రజలలో యింకా మధ్యయుగపు పితృస్వామ్య-భూస్వామ్య (patriarchal-feudal) సంబంధాలు మాత్రమే యిప్పటికీ అమల్లోవున్నాయి. ఆ కారణంచేత నేను అజర్ బైజాన్‌ను పెట్టుబడిదారీ వ్యవస్థలోనికి రాని సరిహద్దు దేశాల గ్రూపులో చేర్చేను. వాటిని సోవియట్ ఆర్థిక వ్యవస్థలోనికి తెచ్చుటకుగాను కొన్ని నిర్ణీత మార్గాలవలంబించవలసియుంది. థీసిస్‌లో దీన్ని గురించి చర్చింపబడింది. ఇవి రెండూకాక యించుమించు 1 కోటికి మించకుండావున్న (స్థిరనివాసాలులేని) పశువుల్ని మేపుటే ప్రధానవృత్తిగా గల (pastoral) గుంపులున్నాయి. వారిలో యింకా 'గుంపు జీవితం' (tribal form of life) యొక్క ప్రాబల్యం యేమీ తగ్గలేదు. వారింకా వ్యవసాయవృత్తిని కూడా అవలంబించనేలేదు. కిర్ఘిజ్‌లు, వుత్తర టర్కీస్తాన్ ప్రజలు, బష్కీర్లు, చెఛెన్లు, ఓసెట్సు, ఇంగుషేలు మొదలగు వారీ రకానికి చెందినవారే. ఈ ప్రజలకు సంబంధించి నంతవరకు మనం మొట్టమొదట చేయవలసినవని వారికి కావలసిన 'భూమి'ని వాళ్ళకిప్పించాలి. అంతటితో వాళ్ళ గురించిన చర్చ ఆపేసేం. ప్రత్యేకం కిర్ఘీజులకో, మరొకరికో వేరే అవకాశం ఇవ్వడం అనవసరం. యిందులో-వారైతే బష్కీరియా, కిర్ఘీజియా, గోర్ట్సిలలోని దుస్థితిని గురించి (అక్కడ సాగు చేసుకోవడానికి భూముల్లేక మలమల మాడిపోతున్నారు) యెక్కువ చెప్పి యుండేవారు. కాని యీ సందర్భంలో కామ్రేడ్ శఫరోవ్ చెప్పినది ఏదో ఒక కోటి జనాభాగల గ్రూపుకే వర్తిస్తుంది; అందుచేత అతనుచేసిన సూచనలను సరిహద్దు ప్రదేశాలన్నిటికీ వర్తింపజేయజూచుట తెలివితక్కువ పని. ఈ గ్రూపును మినహాయిస్తే మిగిలిన 3 కోట్ల 50 లక్షల రష్యనేతర ప్రజలకు యీ వుపపాదనల ప్రాధాన్యత శుద్ధశూన్యం. కొన్ని జాతుల గ్రూపుల విషయములో కొన్ని క్లాజులకు కామ్రేడు శఫరోవ్ చేసిన స్పష్టమైన వుపపాదనలకూ; సవరణలకూ నేను వ్యతిరేకుడను కాదు. కాని వాటిని అందరికీ వర్తింపజేయచూచుటకు మాత్రం నేను అంగీకరించను. అతడి వుపపాదనల్లో ఒక దానిని

గురించి కొంచెం చెపుతాను. ఆ వుపపాదనలో "జాతీయ వైజ్ఞానిక స్వయం నిర్ణయత్వము" (National Cultural Self Determination) అనే పదం వుపయో గింపబడింది. దానిలో యిలా వుంది.

రష్యా తూర్పు సరిహద్దు ప్రాంతాల ప్రజలకు తమ జాతీయ వైజ్ఞానిక స్వయంనిర్ణయత్వం, తమ స్వభాషలో విద్య మొదలగు అవకాశాలను సామ్రాజ్యవాద విధానం కించిత్తైనా యివ్వలేదు. అందువలనవారు పెట్టుబడిదారీ నాగరికత యొక్క వైజ్ఞానికాభివృద్ధిలో పాల్గొనలేక పోయేరు.

ఈ ఉపపాదనలో పూర్తిగా 'బండిస్టు' లక్షణాలున్నై. జాతీయ వైజ్ఞానిక స్వయం నిర్ణయత్వం 'బండిస్టుల' పంథా. ఈ నినాదాన్ని మనం వొదిలేసి చాలాకాలం అయింది. యేమీ అర్థంలేని యీ పదజాలాన్ని మళ్ళీ పునరుద్ధరించవలసిన అవసరంలేదు.

కమ్యూనిస్టులు కృత్రిమంగా తెల్లరష్యన్ జాతి అనేదాన్ని కల్పిస్తున్నారని కొందరు అపవాదు వేస్తున్నారు. ఇందులో ఏమీ నిజంలేదు. తెల్ల రష్యనులకు వేరే ఒక భాషవుంది. వారి భాష ద్వారా వారి విజ్ఞానమును పెంపొందించుటకెంతో వీలుంది. 5 సం॥రాలు క్రిందట యుక్రేనియన్ జాతిని గురించి కూడా ఇలాగే మాట్లాడేవారు. ఈమధ్య కూడా యుక్రేనియను రిపబ్లిక్కు, యుక్రేనియన్ జాతి అనేవి అసలులేవనీ, అవి జర్మనుల సృష్టి మాత్రమే అని కొందరు గట్టిగా చెప్తున్నారు. కాని 'యుక్రేనియన్ జాతి' అనేది వుంది. ఆ ప్రజల విజ్ఞానాభివృద్ధికి తోడ్పడుట కమ్యూనిస్టుల విధి. మనం చరిత్రకు ఎదురీదలేము. కొన్ని యుక్రేనియన్ నగరాలలో ప్రస్తుతం రష్యన్ ప్రాబల్యం ఎక్కువగా ఉండవచ్చు. కాని కాలక్రమేణా ఇవన్నీ యుక్రేనియన్ జాతిలో కలసిపోయి తీరుతాయి. 40 యేండ్ల క్రితం 'రీగా' జర్మన్ పట్టణంగా వుండేది. కాని ఇప్పుడు అది పూర్తిగా లెట్టుల నగరంగా మారిపోయింది. జాతీయతకు పల్లెటిప్రాంతాలే ఆయువుపట్లు. అక్కడ నుండి వచ్చిన ప్రజలే పట్టణాలు పెరిగి పెద్దవడానికి కారణం. అందుచేత తప్పకుండా పట్టణాలు కూడా అసలు జాతీయతను పొందితీరుతాయి. 50 ఏండ్ల క్రితం హంగరీలోని పట్టణాలన్నిటిలో జర్మనీజాతిదే ప్రాబల్యం; అట్టిది నేడు 'మాగియర్' జాతిదే వాటన్నిటిలో ప్రాబల్యం. తెల్లరష్యన్లు కాని వారెక్కువగావున్న తెల్లరష్యన్ నగరాలలో కూడా ఇదే జరుగుతుంది.

చివరను ఈ థీసిస్‌లోని సూచనలను పూర్తిగా ఆచరణలో పెట్టేవిధానాలను ఆలోచించుటకుగాను వివిధ ప్రాంతాల ప్రతినిధులతో ఒక కమిటీని ఎన్నుకోవాలని సూచన చేస్తున్నాను. (applause) (అంగీకారాన్ని తెలియజేస్తూ కరతాళధ్వనులు)



ప్రజలు భూమిలాంటివారు. కమ్యూనిస్టులమైన మనం విత్తనాలు లాంటివారం - మనం ఎక్కడకు వెళ్ళినా - మనం ప్రజలతో ఐక్యమవ్వాలి - ప్రజల్లో వేరూని పెరిగి వారి మధ్యనే వికసించాలి.
-మావో

# సోవియట్ రిపబ్లిక్కుల సమ్మేళన (Amalgamation)

## సోవియట్ల ప్రథమ సమావేశంలో (డిశంబరు 30-1922) ఇచ్చిన రిపోర్టు

కామ్రేడ్స్,

ఈరోజున సోవియటు ప్రభుత్వ చరిత్రలో ఒక నూతన అధ్యాయం ప్రారంభం అవుతుంది. వెనుకటి దశలో సోవియటు రిపబ్లిక్ ప్రతీదీ స్వసంరక్షణను ముఖ్యంగా చూసుకుంది. ఇప్పుడు జరుగుతున్న క్రొత్తదశలో, సోవియట్ రిపబ్లిక్కులన్నీ కలసి ఒకే సంఘటిత సమాఖ్యగా నిర్మింపబడుతున్నాయి. దేశంలోవున్న ఆర్థిక దుస్థితిని తొలగించుటకు, సోవియట్ ప్రభుత్వమును అంతర్జాతీయ రాజకీయాలలో బలీయమైన శక్తిగా చేయుటకు ఈ కలయిక అత్యవసరం. సోవియటు ప్రభుత్వం బలబడితేనే అది అంతర్జాతీయ పరిస్థితిని శ్రామికులకు అనుకూలంగా ఉండేలా చేయగల్గుతుంది.

అయిదేండ్లక్రితం సోవియట్ ప్రభుత్వానికి కొంచెమైనా బలము, పలుకుబడి లేదు. శత్రువులు దాన్నెంతో నిరసన భావంతో చూసేవారు. చాలామంది సోవియట్ సానుభూతి పరులు కూడా దాని బలహీనతను చూసి జాలిపడేవారు. ఆ దశలో సోవియట్ ప్రభుత్వం తనబలం మీదకంటె శత్రువులయొక్క నిర్వీర్యతమీదనే ఆధారపడింది. సోవియట్ శత్రువులు రెండుముఠాలుగా చీలి (ఆస్ట్రో-జర్మన్ ముఠా; ఆంగ్లో-ఫ్రెంచిముఠా) తమలో తాము పోరాడుకుంటూ వుండుటవలన వారు తమశక్తిని సోవియటు ప్రభుత్వం మీదకు త్రిప్పలేకపోయేరు. ఇది సోవియట్ ప్రభుత్వ చరిత్రలో యుద్ధకాలంలో వచ్చిన క్లిష్టదశ (Period of wartime disruption) కాని కోల్చాక్, డెనికిన్ దండయాత్రలతో సోవియటు ప్రభుత్వం తన నిస్సహాయత తెలుసుకొని, నిస్తబ్దతనుండి మేల్కొని, రెడార్మీని నిర్మించుకొని శత్రువులవోడించింది.

సోవియట్ ప్రభుత్వ చరిత్రలోని రెండోదశ నాటినుంచి మొదలైంది. ఈ కాలంలో సోవియట్ ప్రభుత్వం తనశక్తులను దేశంలోని ఆర్థిక దుస్థితిని తొలగించుటకు కేంద్రీకరించింది. ఆ దశ ఇంకా పూర్తవలేదు. కాని ఇప్పటికే ప్రభుత్వం ఎన్నో విజయాలను సాధించింది. నిరుడు దేశాన్ని గగ్గోలు పరచిన కరువును జయప్రదంగా ఎదుర్కొని దానిని నివారించగల్గింది. దేశంలో వ్యవసాయంలో ఎంతో అభివృద్ధి కల్గింది; తేలిక పరిశ్రమలు పునరుద్ధరింపబడినై. పారిశ్రామిక నాయకత్వం వహించుటకు సమర్ధులైనవారు చాలామంది తయారు అయేరు. వారే మన భావిపారిశ్రామికాభివృద్ధికి ఎంతో తోడ్పడగలరని మన విశ్వాసం. ఆర్థిక విచ్ఛిత్తిని సంపూర్ణంగా నిర్మూలించుటకు మనం చేసినది చాలదు; ఆ పనిని మనం జయప్రదంగా కొనసాగించగల్గుటకు అన్ని సోవియట్ రిపబ్లిక్కులయొక్క శక్తులను కేంద్రీకరించుట అవసరం. మన ప్రధాన పరిశ్రమలను మరల స్థాపించాలంటే సోవియటు రిపబ్లికులన్నిటియొక్క ఆర్థిక సంపదనంతనూ సంఘటిత పరచాలి. ఇదంతా

సాధ్యపడుటకు సోవియటు రిపబ్లిక్కులన్నీ ఒకే సంఘటిత రాజ్యాంగం (confederated state) గా ఏర్పడాలి. ఆ పని యీ రోజున జరుగుతూంది; మన ఆర్థిక వ్యవస్థను వుద్ధరించుటకుగాను ఈరోజున రిపబ్లిక్కులన్నీ ఒకటిగా కలిసి తమ శక్తులనన్నిటినీ కేంద్రీకరించబోతున్నాయి.

యుద్ధంమూలాన దేశంలో చెలరేగిన అరాజకాన్నెదుర్కొనేందుకుగాను, సోవియటు ప్రభుత్వం యొక్క మూలస్తంభాలలో నొకటైన రెడార్మి నిర్మితమైంది. ఇపుడు దేశంలోవున్న ఆర్థిక దుస్థితిని, విచ్ఛిత్తిని తొలగించుటకుగాను, "సోవియటు రిపబ్లిక్కుల యూనియను (Union of Soviet Republics)" నిర్మింపబడుతూంది. అది తప్పకుండా సోవియటు ఆర్థిక వ్యవస్థా నిర్మాణానికి చాలా తోడ్పడుతుంది.

ఈనాడు సోవియటు ప్రభుత్వం ఒకగొప్ప శ్రామికవర్గశక్తిగా అభివృద్ధి చెందింది. శత్రువులకు దానియెడల వెనుకటి నిరసనభావం పోయింది. వారిపుడు మన యూనియను అంటే ఎంతో కోపంతో పళ్ళు కొరుకుతున్నారు. ఇదీ సోవియటు ప్రభుత్వం పుట్టిన తర్వాత యీ అయిదేండ్లలోనూ అది పొందిన అభివృద్ధి.

కామ్రేడ్స్,

ఈరోజున పాతరష్యాపై నూతన రష్యాయొక్క సంపూర్ణ విజయాన్ని మనం చూస్తున్నాం. యూరపు ప్రజలను అణచిపెట్టియుంచిన-ఆసియా ప్రజలపై దారుణ నిర్బంధవిధానాన్ని రుద్దిన పాతరష్యా అవతరించింది. నేటితో కొత్త రష్యా సంపూర్ణ విజయాన్ని సాధించింది; అది సరిహద్దు జాతులపై జరిగే నిర్బంధవిధానం అంతరింప జేసింది. పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోసింది. శ్రామిక వర్గనియంతృత్వాన్ని స్థాపించింది; తూర్పు దేశాల ప్రజలను మేల్కొల్పింది: పశ్చిమదేశాల్లోని కార్మికులను ఉత్తేజితులను గావించింది; పార్టీ యొక్క ఎర్రజెండాను ఒక రాజ్యాంగ పతాకంగా చేసింది. ఆ పతాకం క్రింద సోవియటు రిపబ్లికుల ప్రజలందరిని సమీకరించి వాటన్నిటిని కలిసి సోవియటు రిపబ్లిక్కుల యూనియను (U.S.S.R.) ను స్థాపించి 'భావి' ప్రపంచ సోషలిస్టు రిపబ్లిక్కు స్థాపనకు మార్గదర్శకమైనది.

కమ్యూనిస్టులు కబుర్లుచెప్పుటేగాని కార్యాచరణకు పూనుకోరని కొందరు మనమీద ఒక అపవాదు వేస్తున్నారు. అట్టి వారోమారు కళ్ళు తెరచి యీ అయిదేండ్ల సోవియటు ప్రభుత్వ చరిత్రను చూచినట్లయితే కమ్యూనిస్టులు ఎంతో బాగా నిర్మించగలరని వారికి తెలుస్తుంది. నిన్న ప్రతినిధుల సభలో ఆమోదించబడిన 'రిపబ్లిక్కుల యూనియను' సంధి ప్రకటనను ఆమోదించి అమల్లో పెట్టుటకు సమావేశమైన ఈ కాంగ్రెసు యొక్క కార్యక్రమాన్ని బట్టిచూస్తే కమ్యూనిస్టులు పాతవాటినెంత పట్టుదలతో నాశనం చేస్తారో అంతకన్నా బాగానే కొత్తవాటిని నిర్మించగలరని స్పష్టమవ్వాలి.

నిన్న వివిధ రిపబ్లిక్కుల యొక్క ప్రతినిధుల సభలో ఆమోదింపబడిన (తయారుచేయబడిన) ప్రకటన చదువుతున్నానువినండి. (U.S.S.R.) కాన్స్టిట్యూషన్ ప్రకటన. Declaration of the Constitution of the U.S.S.R.)

"సోవియటు రిపబ్లిక్కులు స్థాపించబడినప్పటినుండీ ప్రపంచ సోషలిస్టుపక్షం, పెట్టుబడిదారీ పక్షం అనే రెండు పక్షాలుగా చీలిపోయింది.

"పెట్టుబడిదారీ 'క్యాంపు' (camp) లో జాతి వైషమ్యాలు, అసమానతవలన ప్రజల బానిసత్వం, జాతీయ దురహంకారం, జాతీయ నిర్బంధ విధానం, చిత్రవధలు, సామ్రాజ్యవాద దురంతాలు, యుద్ధాలు మాత్రమే వుంటాయి.

"మన సోషలిజం 'క్యాంపు'లో పరస్పర విశ్వాసం, శాంతి, జాతీయ స్వాతంత్ర్యం, సమానత్వం, వివిధ ప్రజల మధ్య సహకారం, సుహృద్భావం వుంటాయి.

"జాతుల ఆటంక రహితమైన అభివృద్ధిని ఒక మానవుని ఇంకొక మానవుడు దోచుకునే విధానంతో సమన్వయపరచి జాతీయ సమస్యను పరిష్కరించుటకు పెట్టుబడిదారీ ప్రపంచంలో ఎంతోకాలంగా చేసిన ప్రయత్నాలన్నీ నిష్ఫలములయ్యేయి. అంతకంతకు యీ సమస్య క్లిష్టతరమై చివరకు పెట్టుబడిదారీ విధాన నాశనంకే దారితీసేలా వుంది. బూర్జువావర్గం వివిధ జాతుల మధ్య సుహృద్భావాన్ని, సహకారాన్ని కల్గించలేదని స్పష్టంగా తేలిపోయింది.

"ఒక్క సోవియట్ల ఆధ్వర్యం క్రిందనే, ఒక్క ప్రజాబాహుళ్యం యొక్క సహకారాన్ని కల్గియున్న శ్రామికవర్గనియంతృత్వంలోనే జాతీయ నిర్బంధ విధానం సమూలంగా నాశనం చేయబడి, ప్రజలమధ్య పరస్పర విశ్వాసం పెంపొందుటకు తగిన వాతావరణం సృష్టింపబడింది. ఒక్క సోవియట్ల ఆధ్వర్యం క్రిందనే వివిధజాతుల ప్రజలు సోదరభావంతో సహకారం చేయుటకు కావలసిన పునాదులు వేయబడినై.

"అట్టి పరిస్థితులుండుటవలననే సోవియట్ రిపబ్లిక్కులు ప్రపంచ సామ్రాజ్యవాదుల దాడులనెదుర్కొని జయించగల్గినై. అట్టి పరిస్థితులుండుటవలననే సోవియటు రిపబ్లికులు అంతర్యుద్ధాన్ని ముగించి తమ వునికిని కాపాడుకొనుటకు, తమ ఆర్థిక నిర్మాణ కార్యక్రమం ప్రారంభించుటకు వీలు కల్గింది.

యుద్ధకాలంలో దేశం ఎంతో నష్టపడింది. పంటలుపోయి భూములు పాడుపడినై. పరిశ్రమలు నిలిచిపోయేయి. వుత్పత్తి శక్తులు కుంటుపడినై. ఆర్థిక సంపద నాశనమైంది. ఆ నష్టాన్నంతనూ పూడ్చి మరల తమ ఆర్థిక వ్యవస్థను నిర్మించుకొనుటకు వివిధ రిపబ్లిక్కుల వ్యక్తిగత individual) ప్రయత్నాలవలన సాధ్యపడదు. ఈ రిపబ్లిక్కులన్నీ వేర్వేరుగా పరస్పరసహకారం లేకుండా వున్నంతకాలం జాతీయ ఆర్థిక వ్యవస్థా పునరుద్ధరణ అసంభవమైంది.

"పైగా ఈ రిపబ్లిక్కులకు చుట్టూవున్న పెట్టుబడిదారీ దేశాలనుండి దండయాత్రల భయంపోలేదు. అంతర్జాతీయ పరిస్థితి అధ్వాన్నంగా వుంది. అట్టి పరిస్థితులలో యీ సోవియట్ రిపబ్లిక్కులన్నీ కలిసి తమ ఐక్యతా బలంతో శత్రువుల నెదుర్కొనగల్గితేనే స్వరక్షణ చేసికోగలుగుతాయి.

"అంతేకాక, సోవియటు ప్రభుత్వ నిర్మాణంలో వర్గస్వభావం అంతర్జాతీయంగా వుంటుంది (international in its class nature). దానివలన కూడా సోవియటు రిపబ్లిక్కులలోని శ్రామిక ప్రజాసామాన్యం ఒక ఐక్యసోషలిస్టు కుటుంబంగా ఏర్పడుటకు ప్రోత్సహింపబడుతారు.

"ఈ పరిస్థితులన్నీ సోవియట్ రిపబ్లిక్కులు ఒకేరాజ్యాంగంలో సంఘటితం కావలసిన ఆవశ్యకతను స్పష్టపరుస్తున్నాయి. రిపబ్లిక్కులను శత్రువుల నుండి రక్షించుటకు, ఆంతరంగిక ఆర్థికాభివృద్ధిని త్వరపరచుటకు, ప్రజల జాతీయాభివృద్ధిని నిరాటంకముగా కొనసాగించుకు తగిన శక్తిసామర్థ్యాలు అట్టి ఐక్యరాజ్యాంగమునకు మాత్రమే వుంటాయి.

"సమాన గౌరవ ప్రతిపత్తులననుభవించే వివిధ జాతుల ప్రజలందరియొక్క ఐచ్ఛిక సమ్మతిలోనే యీ సోవియటు రిపబ్లిక్కుల యూనియను (U.S.S.R.) సృష్టింపబడింది. ఆ ప్రజలందరూ సోవియట్లు కాంగ్రెసులో ఈ యూనియన్ను నిర్మింపబడాలని తీర్మానించారు. యూనియనునుండి ఇష్టం వచ్చినపుడు వేరుపడుటకు (Secede) ప్రతి రిపబ్లిక్కుకూ హక్కువుంది. సోషలిస్టు సోవియటు రిపబ్లిక్కులన్నిటికీ-ఇప్పుడున్నవి, ముందు ముందు స్థాపింపబడేవీ కూడ- "యూనియను" లోనికి ప్రవేశంవుంది. 1917లో ప్రారంభమైన వివిధ ప్రజలమధ్య సహకారం, సుహృద్భావం యీ 'యూనియను' ప్రభుత్వం క్రింద యింకా యెన్నో రెట్లుగా పెంపొందింపబడతాయని గట్టిగా చెప్పగలము; ప్రపంచ పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా యిదొకపెట్టని గోడగా వుపకరిస్తుంది; అన్ని దేశాల కార్మికులు ఒకే ప్రపంచ సోషలిస్టు సోవియటు రిపబ్లిక్కులో సమ్మేళనమగుటకు యిదొక క్రొత్తసోపానం అని చెప్పవచ్చును.

"బలమైన పునాదులపై నిర్మింపబడిన సోషలిస్టు సోవియటు రిపబ్లిక్కుల ప్రతినిధులమైన మేము సోవియటు సోషలిస్టు రిపబ్లిక్ యూనియను (U.S.S.R.) స్థాపన కొరకు సంధిపత్రం వ్రాయుటకు నిశ్చయించేము".



" సిద్ధాంతం ప్రజల హృదయాల్లో బాగా నాటుకు పోయిన వెనువెంటనే అది ఒక (మహోత్తరమైన) భౌతికశక్తిగా పరిణమిస్తుంది".

- మార్క్స్

# ప్రాగ్దేశ ప్రజల విశ్వవిద్యాలయం : దాని రాజకీయ విధులు

## The Political Tasks of the University of the Peoples of the East

(యూనివర్శిటీ విద్యార్థుల సభలో యిచ్చిన వుపన్యాసం)

కామ్రేడ్స్,

మీ ప్రాగ్దేశ శ్రామికుల కమ్యూనిస్టు విశ్వవిద్యాలయం (Communist University of the Toilers of the East) నాలుగవ వార్షికోత్సవ సందర్భములో నా అభివందనములు. తూర్పుదేశాల కొరకు కమ్యూనిస్టులను తయారు చేసే కార్యభారాన్ని మీ యూనివర్శిటీ విజయవంతంగా నిర్వహించగలుగుతుందని విశ్వసిస్తున్నాను.

నాకున్న పనితొందరవలన యింతకంటె తరచుగా మిమ్ములను కలుసుకొనుటకు వీలు కలుగుటలేదు. మన్నింతురుగాక.

ఇపుడు, మీ యూనివర్శిటీ యొక్క రాజకీయ విధులేమిటో (Political tasks) తెలుసుకుందాం.

యూనివర్శిటీ విద్యార్థులలో ద్వందత్వం కన్పిస్తొంది. 50కి పైగా ప్రాగ్దేశాలనుండి వచ్చిన విద్యార్థులిందులో వున్నారు. వారందరూ తూర్పుదేశాలనుండి వచ్చినవారే. అభివృద్ధిలో పూర్తిగా వేర్వేరుగా వున్న రెండు దశలకు ప్రాతినిధ్యం వహించే రెండు "గ్రూపు"లున్నాయి. వారిలో అందులో ఒక గ్రూపు తూర్పు సోవియట్ రాష్ట్రాలనుండి వచ్చేరు. అక్కడ బూర్జువావర్గం నిర్మూలించబడింది. సామ్రాజ్యవాదం కూలద్రోయబడి శ్రామికుల అధికారం స్థాపించబడింది. రెండో 'గ్రూపు' వలస బానిస దేశాల నుండి వచ్చినవారు. ఆ దేశాల్లో యింకా పెట్టుబడిదారీవిధానం అధికారంలో వుంది. సామ్రాజ్యవాదుల నిర్బంధ విధానము దోపిడీ యింకా చాలా తీవ్రంగా వున్నాయి. వారు సామ్రాజ్యవాదాన్ని కూలద్రోసి, తమ స్వాతంత్ర్యమును సంపాదించుకోలేదు.

అంటే రెండురకాల "తూర్పు"లున్నాయి. రెండూ వేర్వేరు మార్గాలలో అభివృద్ధి చెందుతున్నాయి. వేర్వేరు జీవిత విధానాలను కలిగియున్నాయి.

విద్యార్థి సామాన్యంలోని యీ ద్వంద్వస్వభావం (Dual character) యూనివర్శిటీ చేసే పనిపై కొంతవరకు ప్రాబల్యాన్ని కలిగియుంది. ఈ యూనివర్శిటీ ఒక కాలును సోవియట్ భూమిమీదను, రెండో కాలును వలస బానిసదేశాల మీదను కల్గియుండుటకు కారణం యిదే.

దీనిని బట్టియే యూనివర్శిటీ యొక్క కార్యాచరణలో కూడ రెండు భిన్నవిధానాలు కన్పిస్తున్నాయి. ఒకదానియొక్క ఆశయం తూర్పుసోవియట్ రిపబ్లిక్కుల్లో పనిచేయుటకు తగిన కమ్యూనిస్టులను తయారుచేయుట, రెండోదాని వుద్దేశం వలస బానిస దేశాల

శ్రామిక ప్రజాసామాన్యం యొక్క విప్లవావసరములకు తగిన నాయకత్వం వహించుటకు తగిన కమ్యూనిస్టులను తయారు చేయుట.

ఈ యూనివర్శిటీ ఎదుర్కొనే రెండువిధాలైన కార్యభారములకు కూడ అదే కారణం. ఆ రెండింటిని వరసగా పరిశీలిద్దాం.

**1. తూర్పు సోవియట్ రిపబ్లికుల విషయంలో యీ యూనివర్శిటీ కర్తవ్యములు.**

ఈ సోవియట్ రిపబ్లికులకూ, వలస బానిస దేశాలకూ మధ్య వాటి వునికిలో అభివృద్ధిక్రమంలోవున్న ప్రత్యేక లక్షణాలు, తేడాలు యేమిటి?

**ఒకటి :** ఈ రిపబ్లికులు స్వాతంత్ర్యమును కలిగియున్నాయి; వాటిపై స్వారీచేసే సామ్రాజ్యవాదం కూలద్రోయబడింది.

**రెండు :** అవి జాతులుగా అభివృద్ధి చెందుతూన్నది సోవియటు ప్రభుత్వం యొక్క ఆధ్వర్యం క్రింద గాని బూర్జువా పరిపాలన క్రింద కాదు. ఇది చరిత్రలో యెన్నడూ కనివిని యెరుగని విషయం; సోవియట్ దేశంలో మాత్రమే అది సాధించబడింది.

**మూడు :** ఈ జాతులు పారిశ్రామికంగా చాలా వెనుకబడి యుండుట వలన తమ అభివృద్ధికి వారు పూర్తిగా సోవియటు యూనియనులోని పారిశ్రామిక కార్మికవర్గంపై ఆధారపడవచ్చును.

**నాలుగు :** సోవియట్ యూనియనులో సభ్యులుగా శ్రామికవర్గ నియంతృత్వం క్రింద స్వాతంత్ర్యము అనుభవిస్తూ వున్న యీ రిపబ్లికులు మనదేశంలో సోషలిజం స్థాపించడంలో సమాన బాధ్యతను వహించి వుత్సాహంతో ముందుకు రావాలి; వొస్తాయి కూడాను.

ఈ రిపబ్లిక్కుల్లోని కార్మికులు, రైతులు చైతన్యవంతులై సోషలిజం స్థాపనలో తమపాత్రను సరిగా నిర్వహించే స్థితికి వచ్చుటకు వారికి సహాయం చేయుట, వారందరి మధ్య సోదరభావాన్ని పెంపొందించే పరిస్థితులను-ఆయా రిపబ్లికుల ప్రత్యేక జీవిత పరిస్థితుల కనుగుణ్యంగా కల్పించుట ఇవే ప్రధాన కర్తవ్యాలు.

## 1. తూర్పు సోవియటు దేశాల్లో పనిచేసే కమ్యూనిస్టుల కర్తవ్యాలు.

(1) తూర్పు సోవియటు రిపబ్లికులలో పారిశ్రామిక కేంద్రాలు నెలకొల్పి రైతాంగము కార్మికవర్గంతో సన్నిహిత సంబంధంలోనికి వచ్చేలా చేయాలి. ఈ పని అప్పుడే ప్రారంభం అయింది. సోవియటు యూనియను ఆర్థికాభివృద్ధితోబాటు యిది కూడా ముందుకుపోతుంది. ఈ దేశాలలో అన్నిరకాల ముడిపదార్థాలు దొరుకుతాయి. అందుచే ఈ పని త్వరలో పూర్తి అవుతుందనే ధైర్యం కలుగుతూంది.

(2) వ్యవసాయమును ముఖ్యముగా ఇర్రిగేషన్ (నీటిపారుదల సౌకర్యాలు)ను అభివృద్ధి చేయాలి. ట్రాన్స్‌కకేషియాలోను, టర్కీస్తాన్‌లోనూ యీపని అపుడే జరుగుతూంది.

(3) రైతాంగంలోనూ, చేతిపనివాళ్ళలోనూ సహకార సంస్థలను నిర్మించి పెంపొందించాలి. యీ తూర్పు సోవియటు రిపబ్లికులు సోవియట్ ఆర్థిక వ్యవస్థాభివృద్ధితో కలుసుకోవాలంటే యిదొక్కటే నమ్మకమైన మార్గం.

(4) సోవియట్లకూ, ప్రజాసామాన్యంకూ మధ్య దగ్గర సంబంధం కల్గించాలి. వాటి నిర్మాణంలో 'జాతీయత'ను పాటిస్తూ శ్రామిక ప్రజాసామాన్యం యొక్క నిరంతర సహకారంతో సత్వరాభివృద్ధిని చెందే "జాతీయ సోవియట్ రాజ్యాంగ సంస్థ" (National Soviet State Organisation) ను నెలకొల్పాలి.

(5) జాతీయ సంస్కృతిని అభివృద్ధి చేయాలి. దేశవ్యాపితంగా స్కూళ్ళు యేర్పరచాలి. వాటిలో సామాన్యవిద్యకు (General education), వృత్తివిద్యలకు, సాంకేతిక శిక్షణ (Technical training) కు కూడా అవకాశాలుండాలి. విద్యాబోధనంతా దేశభాష (Native language) లోనే జరగాలి. వీటన్నింటిద్వారా ఆ ప్రాంతీయ (Native) ప్రజల్లో నుండి సోవియట్లకు, పార్టీకి, ట్రేడు యూనియన్లకు సభ్యుల్ని తయారుచేయాలి.

ఈ పనులన్నీ సరిగా నిర్వర్తిస్తేనే తూర్పు సోవియటు రిపబ్లిక్కులలో సోషలిస్టు నిర్మాణ కార్యక్రమం సులువుగా జరుగుతుంది.

తూర్పు సోవియటులోని "ఆదర్శప్రాయములైన రిపబ్లిక్కులు" అని తరచూ వింటుంటాం. "ఆదర్శప్రాయమైన రిపబ్లికు" (Model republic) అంటే యేది? తన కర్తవ్యములన్నిటినీ మనస్ఫూర్తిగా నిర్వహించి తద్వారా ఇరుగు పొరుగు వలన బానిస దేశాలలోని కార్మికులను, రైతులను స్వాతంత్ర్య సంపాదనా వుద్యమాలలోనికి నడిపించేదే మోడల్ రిపబ్లిక్.

జాతుల ప్రజాసామాన్యానికీ, సోవియట్లకూ సన్నిహిత సంబంధం కల్పించడం (Naturalising the Soviets) గురించి చెప్పేను. కాని Naturalising the Soviets అంటే అర్థం యేమిటి; ఆచరణలో అది యే విధంగా వ్యక్తమౌతుంది? ఈ మధ్యన జరిగిన టర్కీస్తాన్‌లో జాతీయ సరిహద్దుల సవరింపు (Delimitation) సోవియట్లకూ, ప్రజాసామాన్యానికీ మధ్య సన్నిహిత సంబంధం యెలా ఏర్పర్చాలి అనేదానికి మంచి వుదాహరణ. ఈ "సరిహద్దుల సవరింపు" బోల్షివిక్కుల మోసం అని బూర్జువా పత్రికలన్నీ ప్రచారం చేసేయి. కాని నిజంగా యిందులో యేమీ 'మోసం' (trickery) లేదు. టర్క్‌మన్‌స్తాన్, ఉజ్బెకిస్తాన్ ప్రజల యొక్క "మాతో సన్నిహితంగావుండే పరిపాలనాంగములు (Organs) కావాలి" అనే వుదాత్తాశయం యొక్క నిర్మాణ రూపమే యీ "సరిహద్దుల సవరింపు". విప్లవానికి పూర్వం యీ రెండు దేశాలు కూడా అసంఖ్యాకములైన చిన్న

ముక్కలుగా, చిన్న జమీందారీలుగా, (Khamates), రాజ్యాలుగా విభజింపబడి ఐక్యత అనేది లేకుండా వుండేవి. ఎప్పుడూ ఏదో బలవంతమైన రాజ్యం వీరిని మోసగించి తన దోపిడీ విధానం సాగించేది. ఆ చిన్నచిన్న ముక్కలన్నిటినీ కల్పి స్వతంత్ర్య రాజ్యాలుగా ఐక్యపరచవలసిన సమయం వచ్చింది. టర్క్‌మెన్‌స్తాన్, ఉజ్జెకిస్తాన్‌ల ప్రజలను వారివారి ప్రభుత్వాంగములతో ఐక్యపరచాలి. ఇపుడు జరిగిన యీ "సరిహద్దుల సవరింపు" చెల్లాచెదరైయున్న యీ ముక్కలన్నిటినీ ఐక్యపరచి రెండు స్వతంత్ర రాజ్యాలుగా నిర్మించుటకే ముఖ్యముగా వుద్దేశింపబడింది. అది జరిగాక ఆ రాజ్యాంగాలు రెండూ కూడ సోవియటు యూనియనులో సమాన ప్రతిపత్తిగల సభ్యులుగా చేరేయి. తూర్పు దేశాల ప్రజల వుదాత్తాశయాలను, కోర్కెలను సరిగా గుర్తించి అవి వ్యక్తీకరింపబడుటకు సరియైన రూపాన్ని బోల్షివిక్కులు సూచింపగలిగినారని, వివిధజాతుల శ్రామిక ప్రజా సామాన్యం ఐచ్ఛిక సహకారంతో సోవియటు యూనియనులో సమాన హోదాగల సభ్యులుగా వున్నారనీ దీన్ని బట్టి తెలుస్తుంది. 'పోలండ్'ను ఐక్యపరచుటకు బూర్జువావర్గం యెన్నో యుద్ధాలు చేసింది. కొన్ని నెలల ప్రచార కార్యక్రమంతోనే కమ్యూనిస్టులు టర్క్‌మెన్‌స్తాన్, ఉజ్బెక్‌స్తాన్‌లను ఐక్యపరచేరు. పరిపాలనాంగములను, వివిధజాతుల శ్రామిక ప్రజాసామాన్యంతో దగ్గర సంబంధం లోనికి తెచ్చుటకు యిదీ మార్గం.

బోల్షివిక్కుల జాతీయ విధానం సరియైనదనుటకదే నిదర్శనం. తరువాత తూర్పు సోవియటు రిపబ్లిక్కులోని జాతీయ సంస్కృతియొక్క స్థాయి (level) ని హెచ్చించుటను గూర్చి కూడా చెప్పేను. అయితే జాతీయ సంస్కృతికీ, శ్రామికవర్గ సంస్కృతికీ సమన్వయం కుదుర్చుట ఎలాగ? విజ్ఞానంలో బూర్జువా సంస్కృతి, సోషలిస్టు సంస్కృతి అని రెండు రకాలున్నాయనీ, "జాతీయ సంస్కృతి కావాలి" అనే నినాదం అమాయకులైన కార్మికుల్లో జాతీయతా విషబీజాలను నాటుటకు బూర్జువావర్గం లేవదీసే అభివృద్ధినిరోధక కోర్కెయనీ లెనిన్ యుద్ధానికి పూర్వమే చెప్పేడు. ఒక ప్రక్క జాతీయ సంస్కృతిని, దేశభాషల్లో విద్యాబోధనను, పాఠశాలలను అభివృద్ధిచేసి వివిధజాతుల ప్రజలనుండి కమ్యూనిస్టులను తయారు చేయవలసియుంది; మరో ప్రక్క సోషలిజమును, శ్రామికవర్గ సంస్కృతిని నిర్మించవలసియుంది. ఈ రెండింటికీ సమన్వయం కుదుర్చుట యెట్లు? ఈ రెండింటి మధ్యనూ సమన్వయింపరాని వైరుధ్యం వుందా? లేదని గట్టిగా చెప్పగలం. మనం ఒక శ్రామికవర్గ సంస్కృతిని నిర్మిస్తున్నాం. నిజమే, కాని శ్రామిక సంస్కృతి అన్నిచోట్లా ఒకేరూపం వుండదు. సోషలిస్టు సమాజ నిర్మాణ కార్యక్రమంలోకి ఆకర్షింపబడిన వివిధ జాతుల ప్రజలలో వారివారి భాష, సాంప్రదాయ భేదాలనుబట్టి ఈ శ్రామిక సంస్కృతికూడా వేర్వేరు రూపాలనుపొంది భిన్నరూపాలలో వ్యక్తీకరింపబడుతుంది. సోషలిజం ఒక విశ్వమానవ సంస్కృతి (Universal Human Culture) దిశకు సాగిపోతూంది. అందలి విషయం ఎప్పుడూ సోషలిజమునకు సంబంధించినదే, దాని అభివృద్ధికి తోడ్పడేదే; కాని దాని రూపం మాత్రం జాతీయంగా వుంటుంది. (Socialist in Content and National in Form) శ్రామిక విజ్ఞానం ఎల్లప్పుడూ జాతీయ సంస్కృతిని తోసిరాజనదు; పై పెచ్చు

దానికి బలాన్ని, విషయ ప్రాముఖ్యతను ఇస్తుంది. జాతీయ సంస్కృతి శ్రామిక విజ్ఞానానికి వ్యతిరేకం కాదు. పైగా దానికి తన జాతీయ రూపాన్నిచ్చి బలపరుస్తుంది. జాతుల నిర్మాణం, వారి జాతీయ పోరాటాలు బూర్జువావర్గ ఆధ్వర్యం క్రింద నడచినంతకాలం ఆ వర్గమే అధికారంలో వున్నంత కాలం... "జాతీయ సంస్కృతి" అని వారు చేసిన గోలంతా బూర్జువావర్గ కోరికే, అది వారి వున్నతి కొరకే ఉద్దేశింపబడింది. "జాతీయ సంస్కృతి" శ్రామికవర్గ కోర్కెయగుట, దానికొరకు శ్రామికవర్గం ఆందోళనచేయుట, పోరాడుట అనేవి సోవియట్ ప్రభుత్వం ఆధ్వర్యం క్రింద జాతులు సంఘటితపడుట శ్రామికులు అధికారంలోకి వచ్చిన తర్వాతనే ప్రారంభమైంది. ఈ రెండు భిన్న పరిస్థితుల (Situations) మధ్యగల ప్రధాన భేదాన్ని గ్రహించలేనివాళ్ళు లెనినిజమ్‌ను కాని లెనినిస్టు దృక్పథం నుండి జాతీయ సమస్యలోని నిగ్గునుగాని చస్తే అర్థం చేసుకోలేరు.

కాట్‌స్కీ మొదలైన వాళ్ళు కొందరు సోషలిస్టు యుగంలో మిగిలిన భాషలన్నీ నశించిపోయి ఒకే ప్రపంచభాష సృష్టింపబడుతుందంటారు. కాని యీ ఏకభాషా సిద్ధాంతంలో నాకేమీ నమ్మకంలేదు; ప్రపంచానుభవం కూడా యీ సిద్ధాంతానికి వ్యతిరేకంగానే కన్పిస్తూంది. ఇప్పటివరకూ సోషలిస్టు విప్లవం భాషలసంఖ్యను ఎక్కువచేసిందేగాని తగ్గించలేదు; సోషలిస్టు విప్లవం మానవసంఘాన్ని పునాదులకంటా కదిపేసి వారిలో చైతన్యం కల్గించి రాజకీయరంగంలోనికి ప్రవేశపెట్టింది. అంతక్రితం నిగూఢంగా జాగృతములైయున్న ఎన్నో జాతులలో గొప్ప సంచలనం కల్గింది. ఎన్నో కొత్తజాతులు తమతమ భాషలతో సంప్రదాయాలతో ముందుకొచ్చేయి. తత్ఫలితంగా భాషలసంఖ్య ఎక్కువైంది. విప్లవం వాటినన్నిటిని మేల్కొల్పి పైకి తెచ్చేవరకు జారిస్టు రష్యాలో 50కి పైగా జాతులు, గుంపులు ఉన్నాయని ఎవరూ అనుకోలేదు. ఎందరు ప్రజలనో బంధవిముక్తులజేసి వారిలో చైతన్యం కల్గించుట ద్వారా అక్టోబరు విప్లవం ఆ ప్రజల కొక నూతన జీవితాన్ని, నూతనాభివృద్ధిని కల్గించింది. ఈ రోజుల్లో ఇండియా అంతా ఒకటే (జాతి)గా భావింపబడుతూంది. కాని ఇండియాలోనే విప్లవోద్యమం చెలరేగిన పరిస్థితిలో నేటివరకూ విస్మృతములైయున్న ఎన్నో జాతులు, తెగలు-తమతమ ప్రత్యేక భాషతో సంప్రదాయాలతో - సంస్కృతితో ముందుకువచ్చి రంగంలోనికి ప్రవేశిస్తాయని నిస్సందేహంగా చెప్పవచ్చును. వివిధజాతులు శ్రామిక సంస్కృతిలో భాగస్వాములవాలి; దాని నిర్మాణంలో, అభివృద్ధిలో వారు శ్రద్ధవహించాలి అనేటట్లయితే ఒకటేమార్గం వుంది. ఆ శ్రామికవర్గ సంస్కృతికి తమ తమ భాషా సంప్రదాయాలకనుగుణమైన రూపాన్నిచ్చి దానిని తమదిగా చేసికోవాలి.

ఈమధ్యనే కొందరు బుర్యట్ కామ్రేడ్సు విశ్వమానవసంస్కృతికి జాతీయ సంస్కృతికి మధ్యగల సంబంధమును గురించిన క్లిష్టసమస్యలను విశదీకరించవలసినదిగా నాకొక వుత్తరం వ్రాసేరు. దానిలో :

"మాకు గడ్డుగా కన్పిస్తూన్న ఈ క్రింద క్లిష్ట సమస్యలను గూర్చి విశదీకరించమని కోరుతున్నాము. కమ్యూనిస్టు పార్టీ అంతిమాశయం ఒకే విశ్వమానవ సంస్కృతిని

నెలకొల్పుట. వివిధ స్వపరిపాలిత రిపబ్లిక్కులలో అభివృద్ధి చెందుతూన్న జాతీయ సంస్కృతులనుండి ఒకే విశ్వమానవ సంస్కృతిలోనికి మార్పు జరగడం ఎలాగ? వివిద జాతీయ సంస్కృతుల ప్రత్యేకతలు (భాష, మొదలగునవి) ఒకటిగా కలిసిపోవుట ఏవిధంగా జరగాలి?" అని ప్రశ్న వేస్తున్నారు.

ఈ బుర్యట్ కామ్రేడ్సు యొక్క సందేహాలకు సమాధానం నేనింతకు ముందు చెప్పినదాంట్లోనే వుంది:

విశ్వమానవ శ్రామిక సంస్కృతి నిర్మాణక్రమంలో యీ ప్రత్యేక జాతులన్నీ లీనమైపోవా? అని బుర్యట్ కామ్రేడ్సు ప్రశ్నిస్తున్నారు. తప్పకుండా కొన్ని జాతులావిధంగా కలిసిపోవచ్చును; కలుస్తాయి కూడాను. అట్టి క్రమం చరిత్రకు కొత్తదేమీకాదు. మునుపటినుండీ వుంది; కాని ఇక్కడ ఒక ముఖ్యవిషయం గమనించాలి. కొన్ని జాతులు తమ వ్యక్తిత్వాన్ని కోల్పోయి, ఇతరులతో కలిసిపోయే క్రమంతో బాటే, అసంఖ్యాకములైన జాతులు తమ వ్యక్తిత్వాన్ని బలపర్చుకుని అభివృద్ధిచెందే క్రమంకూడా నడుస్తూనే వుంటుంది. ఎందుచేతనంటే జాతుల అభివృద్ధి అనే జనరల్ క్రమం యొక్క ఫలితమే ఈ లీనమైపోవు క్రమం. (Process of assimilation) ఆ కారణంవలననే కొన్ని జాతులు తమ వ్యక్తిత్వమును కోల్పోవుటకు అవకాశం వున్నంతమాత్రాన ఈ క్రింద సూత్రం యొక్క వాస్తవికతకు భంగం కలగదు. విశ్వమానవ సంస్కృతి జాతీయ సంస్కృతిని పెంపొందిస్తుంది గాని దానికి వ్యతిరేకంగాదు. అదేవిధంగా జాతీయ సంస్కృతి విశ్వమానవ సంస్కృతికి కొత్త అందాన్నిచ్చి బలపరుస్తుంది గాని, దానిని వ్యతిరేకించదు అనే దానిలో ఏమీ అసంబద్ధత లేదు.

జనరల్‌గా ఇవి తూర్పు సోవియటు రిపబ్లికులలోని కమ్యూనిస్టుల నెదుర్కొనే సమస్యలు, వారు నిర్వర్తించవలసిన విధులూను. ఇదీ ఈ విధులయొక్క స్వభావం, విషయమూను.

ఈ తూర్పు సోవియట్ రిపబ్లిక్కులు ప్రధానంగా వ్యవసాయదేశాలు. ప్రస్తుతదశలో ఆర్థికాభివృద్ధి త్వరితగమనంతో నడుస్తూంది. రైతాంగమునకెన్నో సదుపాయాలు చేయబడుతున్నై. ఈ మహదవకాశాన్ని వుపయోగించుకోవాలి. సోవియట్ యూనియనులో సోషలిజం నిర్మాతలుగా యీ రిపబ్లికులను తయారుచేయుటకూ, యీపై చెప్పిన కర్తవ్యాలను పూర్తిగా నిర్వహించుటకూ తయారుకావాలి.

మనపార్టీ ప్రస్తుతం రైతాంగం ఎడల నవలంబించే విధానం (రైతులకు భూములు కవులుకిచ్చుట, కూలిపనివాళ్ళను పెట్టుకొనుటకు అనుమతి, ఇంకా ఇతర సదుపాయాలు ఇచ్చుట) పార్టీ యొక్క అపజయాన్ని సూచిస్తూందని కొందరు అంటున్నారు. దాంట్లో కొంత నిజం లేకపోలేదు. కాని, సోవియట్ ప్రభుత్వం, పార్టీ తమ కార్యక్రమాన్ని విజయవంతంగా కొనసాగించుటకు కావలసిన ప్రధానశక్తులన్నింటినీ తమచేతిలో

వుంచుకున్నారు. త్వరితగతిని ముందుకు సాగిపోతున్నారు. అదే సమయంలో ప్రధాన కార్యక్రమానికి అడ్డురాని కొన్ని చిన్న మినహాయింపులు ఇవ్వబడినై. కరెన్సీ విలువ స్థిరీకరణ (Stabilise) చేయబడింది. పరిశ్రమలు, రాకపోకల సౌకర్యాలు అభివృద్ధి చెందుతున్నై. క్రెడిట్ సిస్టమ్ (దేశీయార్థిక వ్యవస్థ అంతమీద దీని ప్రాబల్యం వుంటుంది.) ప్రభుత్వం చేతిలోవుంది. ఈ ఆయుధాలన్నీ ప్రభుత్వం చేతిలో వున్నంతకాలం ఏదో ఒక రంగంలో వెనక్కిపోయినా అది మొత్తం పోరాటాన్ని జయప్రదంగా ముందుకు తీసికొనిపోవుటకే వుపయోగిస్తుంది. ఆ దృష్ట్యా, యీనాడు రైతాంగాన్కి కొత్తగా యివ్వబడిన రాయితీలువారిని సోషలిస్టు నిర్మాణ కార్యక్రమంలోనికి ఆకర్షించుటకే వుపయోగిస్తాయి.

దీనినుండి తూర్పు సోవియటు రిపబ్లిక్కులు నేర్చుకోవలసిందేమిటి? వాటిని కూడా సోవియట్ ఆర్థిక వ్యవస్థలోని యితరులతో సమాన హోదాకు తెచ్చుటకు గాను అచటి కమ్యూనిస్టులకు యిది ఒక మంచి ఆయుధంగా వుపయోగిస్తుంది.

వ్యవసాయక ప్రాంతాలలో పార్టీవిధానంకీ, తూర్పు సోవియట్లలోని కమ్యూనిస్టుల కార్యక్రమంకీ వున్న సన్నిహిత సంబంధం యిదే.

ఈ సందర్భంలో మీ యూనివర్శిటీయొక్క కర్తవ్యం పైన చెప్పిన కార్యనిర్వహణానికి సమర్థులైన కమ్యూనిస్టుకేడరును, శిక్షణయిచ్చి తయారుచేయుటే.

తన చుట్టూవున్న జీవిత వాతావరణంకీ, యూనివర్శిటీకి చాలా దగ్గర సంబంధం వుంది. తన చుట్టూ వున్న జీవిత సమస్యలకది దూరంగా ఉండజాలదు. ప్రజాజీవితం దానిలో ప్రతిబింబించాలి. ప్రస్తుతం తూర్పు సోవియటు రిపబ్లికుల నెదుర్కొంటూన్న సమస్యలనుండి అది తప్పించుకోవడానికి వీల్లేదు. వాటి పరిష్కార విషయంలో అదికూడా బాధ్యత వహించాలి. అందుచే కమ్యూనిస్టు కేడర్సును తయారు చేసేటపుడు ఆ రిపబ్లిక్కుల తక్షణావసరములను, వారు నిర్వర్తించవలసిన విధులను పూర్తిగా దృష్టిలో వుంచుకోవాల్సి యుంటుంది.

తూర్పు సోవియట్లలో పనిచేస్తూన్న కమ్యూనిస్టుల ఆచరణలో రెండు రకాల తప్పుడుపంథాలు పొడచూపుతున్నాయి. నిజమైన విప్లవ యోధుల్నీ, సిసలైన కమ్యూనిస్టులను తయారు చేయాలంటే ఆ తప్పుడు పంథాలకు (Deviations) యీ యూనివర్శిటీలో స్థానం వుండరాదు. వాటి నెదుర్కొని తొలగించుట దీని కర్తవ్యం.

మొదటి తప్పుడు పంథాయేమిటంటే అతిసూక్ష్మీకరణము : అంటే (over simplification). పెద్ద సమస్యలనుకూడ అతిచులకనగా, సులువైనవిగా పరిగణించుట. బాగా అభివృద్ధిచెందియున్న మధ్యరష్యాకు తగిన ఆర్థిక విధానాలను పూర్తిగా భిన్న ఆర్థికాభివృద్ధి దశలో వున్న బోర్డర్ రిపబ్లికులలో పూర్తిగా ప్రవేశ పెట్టాలి అంటారు వీరు. ఆ సూత్రాలు, విధానాలు, యిక్కడ ఆచరణ సాధ్యాలా అనే ఆలోచనేలేదు వారికి. ఈ పంథాననుసరించే కామ్రేడ్సు రెండు సంగతులు గుర్తించుటలేదు. కేంద్రంలోనూ సరిహద్దు ప్రదేశాలలోనూ

పరిస్థితులు ఒకేరకంగా లేవనీ, అవెంతో భిన్నంగా వున్నాయనీ వారు గుర్తించుట లేదు; తర్వాత తూర్పు సోవియటు రిపబ్లికులలో కూడా అన్నీ సమాన స్థాయిలో లేవు. వాటి పరిస్థితుల మధ్య యెన్నో ప్రధానమైన భేదాలున్నాయి. ఉదాహరణ: జార్జియా, ఆర్మీనియాలలో ప్రజలు యెక్కువ జాతీయ చైతన్యం కలిగియున్నారు. చెచెన్యా, కబార్డా మొదలగువాటిలో జాతులు పూర్తిగా సంఘటిత పరుపబడలేదు; కిర్ఘిజ్‌స్తాన్ మొదలగు వాటి స్థితి పై రెండింటికీ మధ్య దశలో వుంది. తమ పనిని ఆయా ప్రాంతీయ పరిస్థితుల కనుగుణంగా మార్చుకుంటేనేతప్ప, ప్రతిదేశం ప్రజలయొక్క ప్రత్యేకతలను జాగ్రత్తగా గుర్తించి తన కార్యక్రమాన్ని వాటికి సరిపడేటట్లు చేసుకుంటేనే తప్ప అతడు చేసిన పనిలో స్థిరత్వం గట్టితనం యేమీవుండదు. పునాదులులేని కట్టడం మాదిరి తయారౌతుంది అని యీ కామ్రేడ్సు తెలిసికోవడం లేదు. దీనివల్ల చివరికి కలిగే ఫలితం ఈ కామ్రేడ్సు ప్రజాసామాన్యంనుండి వేరైపోతారు. వట్టి గాలికబుర్లు చెప్తూ తమ నినాదాల్లో మాత్రమే అతివాదులుగా తయారౌతారు. ఇటువంటి అతి సూక్ష్మీకరణ పంథాకు ప్రబల శత్రువులుగా వుండే కమ్యూనిస్టులను తయారుచేయాలీ యూనివర్సిటీ.

ఇక రెండో తప్పుడు పంథా అవలంబించేవారు ప్రాంతీయ ప్రత్యేకతలకు, భేదాలకు అనవసరమైన ప్రాముఖ్యతనిస్తూ, సోవియటు యూనియనులోని పారిశ్రామిక ప్రదేశాలకూ, తూర్పు సోవియటు రిపబ్లిక్కులకూ మధ్యగల కామన్ విషయాలను విస్మరిస్తున్నారు. సోషలిస్టు కర్తవ్యాలను వదలిపెట్టి సంకుచిత జాతీయతయొక్క అవసరాలకూ, ఆశయాలకూ తగినట్టుగా తమ కార్యక్రమం మార్చుకుంటున్నారు. ప్రాంతీయ ప్రత్యేకతలకు అనవసర ప్రాముఖ్యతనిచ్చి తమ అసలు కర్తవ్యాలను పూర్తిగా మరచిపోతున్నారు. ఈ కామ్రేడ్సుకు తమ దేశంయొక్క ఆంతరంగికాభివృద్ధిని గురించి విచారమేలేదు. కాలక్రమేణ ఆ అభివృద్ధి సహజంగానే జరుగుతుంది. దాని విషయం మనం పట్టించుకోనక్కరలేదు అంటారు. వాళ్ళకు కావలసింది "విదేశ" రాజకీయాలు, తమ రిపబ్లికు సరిహద్దులను పెంచడం, ఇరుగు పొరుగు రిపబ్లికులతో లావాదేవీలు వీలైతే వాటిలోంచి కొంత ప్రదేశం కలుపుకోవడం తద్వారా దేశంలోని బూర్జువా జాతీయవాదుల సానుభూతిని సంపాదించడం, ఇవేకాని దేశం యొక్క అభివృద్ధి సంగతి వారికక్కరలేదు. ఈ డీవియేషను ఫలితం వాళ్ళు సోషలిజంనుండి వేరైపోయి మామూలు బూర్జువా జాతీయవాదులుగా తయారౌతారు.

ఈ సంకుచిత జాతీయతకు ఏమాత్రం అవకాశం ఇవ్వకుండా వుండే కమ్యూనిస్టులను తయారుచేయాలీ యూనివర్సిటీ.

ఇవీ తూర్పుసోవియటు రిపబ్లికుల ఎడల ప్రాగ్దేశ ప్రజల విశ్వవిద్యాలయం నిర్వర్తించవలసిన విధులు.

## 2. వలసల బానిసదేశాల ఎడల యూనివర్శిటీ విధులు

ఇక వలస బానిసదేశాల ఎడల యూనివర్శిటీ విధులేమిటో చూద్దాం. ఈ దేశాల, తూర్పు సోవియటు రిపబ్లికుల జీవితంలో, అభివృద్ధిలో రెంటిని వేరుపరచే ప్రత్యేక లక్షణం ఏమిటి?

(అ) ఈ దేశాలు సామ్రాజ్యవాదం క్రిందనే జీవిస్తున్నాయి, అభివృద్ధి చెందుతున్నాయి.

(ఆ) ఈ ప్రజలమీద ఒక ప్రక్కను విదేశ సామ్రాజ్యవాద ప్రభుత్వం, ఇంకో ప్రక్క స్వజాతీయ బూర్జువావర్గం కూడా స్వారీ చేస్తున్నాయి. ఈ ద్వంద్వదోపిడీ విధానం ఆ దేశాలలోని సంక్షోభాన్ని తీవ్రతరం చేస్తోంది.

(ఇ) వీటిలో ఇండియా మొదలైన కొన్ని దేశాలలో పెట్టుబడిదారీ విధానం సత్వరాభివృద్ధి చెందుతూ ఆయాదేశాలలో శ్రామికవర్గం ఏర్పడి బలవడుటకు కారణమౌతూంది.

(ఈ) విప్లవోద్యమం ముందుకు సాగినకొలదీ అటువంటి దేశాల్లోని జాతీయ బూర్జువావర్గం రెండుకక్షలుగా చీలిపోతుంది. ఇందులో ఒకపార్టీ పెటీ బూర్జువా విప్లవాన్ని కొనసాగించాలంటుంది. రెండోకక్ష (పెద్దబూర్జువాలు) రాజీ బేరాలకు దిగి, చివరకు సామ్రాజ్యవాదంతో చేతులు కలిపి ఒక ముఠాగా తయారౌతుంది.

(ఉ) ఈ సామ్రాజ్యవాద ముఠాకి వ్యతిరేకంగా సామ్రాజ్యవాద వ్యతిరేక పక్షం ఏర్పడుతుంది. శ్రామికులు, విప్లవాన్ని కొనసాగించాలనే పెటీబూర్జువావర్గమూ కలిసిన యీ పక్షం సామ్రాజ్యవాదం నుండి సంపూర్ణ విముక్తిని, దేశస్వాతంత్ర్యాన్ని కోరుతుంది.

(ఎ) అట్టిదేశాల్లో శ్రామికవర్గం యొక్క ఆధిపత్యం ప్రజాసామాన్యమును రాజీబేరాలాడే జాతీయ బూర్జువా వర్గ ప్రాబల్యంనుండి తప్పించుట-ఈ సమస్యలు చాలా త్వరితంగా ముందుకు వస్తున్నాయి.

(ఏ) ఈ పైన చెప్పిన ఆఖరు పరిస్థితి (ఎ) మూలంగా ఆ దేశాల్లోని జాతీయ స్వాతంత్ర్య సంపాదనోద్యమాలను నాగరిక పశ్చిమ దేశాలలోని శ్రామికోద్యమాలతో కలుపుట చాలా సులభం అవుతుంది.

దీనినుంచి కనీసం మూడు విషయాలు స్పష్టంగా తెలుస్తున్నాయి.

(1) విజయవంతమైన విప్లవం ద్వారా తప్ప ఈ వలస బానిసదేశాలు సామ్రాజ్యవాద శృంఖలాలనుండి విముక్తములగుట అసంభవం. స్వాతంత్ర్యం అనేది 'బహుమతి'గా ఎన్నడూరాదు.

(2) విప్లవం విజయవంతమవాలంటే, పెట్టుబడిదారీ పద్ధతుల్లో అభివృద్ధియైన యీ వలస-బానిసదేశాలు తమ స్వాతంత్ర్యం పొందాలంటే... రాజీబేరాలాడే జాతీయ బూర్జువా వర్గానికి బలంలేకుండా వేరుచేయాలి. విప్లవపంథాననుసరించే పెటీబూర్జువాను, ప్రజాసామాన్యాన్ని పెద్దబూర్జువాల పలుకుబడి నుండి తప్పించాలి; శ్రామికవర్గం యొక్క ఆధిపత్యం (Hegemony) స్థాపింపబడాలి; కార్మికవర్గంలోని చైతన్యంగల వారందరనూ ఒక స్వతంత్ర కమ్యూనిస్టుపార్టీలో సంఘటిత పరచాలి.

(3) ఈ దేశాలలోని స్వాతంత్రోద్యమాలకూ, పశ్చిమదేశాలలోని శ్రామికోద్యమాలకూ సన్నిహిత సంబంధం నెలకొల్పితేనే తప్ప యీ దేశాల్లోని యీ వుద్యమాలకు శాశ్వత విజయం చేకూరదు.

ఈ మూడు విషయాలను తమ విప్లవ కార్యాచరణకు పునాదిగా చేసికొని పనిచేయడం యీ దేశాలలోని కమ్యూనిస్టుల ప్రధాన కర్తవ్యం.

ఈ పరిస్థితులలో యీ వలస, బానిసదేశాలలోని విప్లవోద్యమాల కర్తవ్యాలు ఏమిటి?

ఈ వలస-బానిస దేశాలలోకూడా అన్నీ ఒకేరకంగాలేవు. వీటన్నిటినీ కలిపేసి వెనుక తూర్పువలసదేశాలుగా వ్యవహరించేవారు; కాని యీ నాడు వీటన్నిటిలో ఒకే పరిస్థితులులేవు. వాటి అభివృద్ధి దశలలో ఎన్నో తేడాలున్నాయి. పారిశ్రామికంగా ఎట్టి అభివృద్ధిలేకుండా, అసలు కార్మిక వర్గమనేదేలేని మొరాకో మొదలగు దేశాలున్నాయి; పారిశ్రామికంగా కొద్ది అభివృద్ధిచెంది చిన్న శ్రామికవర్గం వున్న చైనా, ఈజిప్ట్ మొదలగు దేశాలున్నాయి. పెట్టుబడిదారీ విధానం ఇంచుమించు బాగా అభివృద్ధిచెంది బహుసంఖ్యాకమైన జాతీయ శ్రామికవర్గంవున్న ఇండియా మొదలగు దేశాలున్నాయి. అంటే వెనుక 'బానిసతూర్పు'అని ఒకటిగా వ్యవహరింపబడే దానిలో యీనాడు పై మూడు రకాల దేశాలున్నాయి. వాటన్నిటినీ ఒకే తరహాలో కలపడం భావ్యంకాదు.

మొరాకోవంటి దేశాలలో జాతీయ బూర్జువావర్గం రెండుగా చీలి పోవడానికి (రాజీ-బేరాలాడే ముఠా, విప్లవోద్యమం కొనసాగాలనే ముఠా) అవసరమైన పరిస్థితులింకాలేవు. ఆ అవకాశాన్ని వుపయోగించుకుని దేశంలోని ప్రజలందరనూ సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటంలో ఐక్యపరచవలసిన కర్తవ్యం కమ్యూనిస్టుల మీద వుంది. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జరిగే పోరాటం వృద్ధిపొందేకొలదీ; ముఖ్యంగా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జయప్రదమైన విప్లవం జరిగాక-కమ్యూనిస్టు భావాలు కలవారందరినిచేర్చి ప్రత్యేకంగా కమ్యూనిస్టుపార్టీని నిర్మించవలసి వుంటుంది.

చైనా, ఈజిప్ట్ దేశాలలో అపుడే బూర్జువావర్గం రెండుగా చీలిపోయింది; కాని "రాజీకి పాకులాడే" పెద్దబూర్జువాల ముఠా ఇంకా పూర్తిగా సామ్రాజ్యవాదంతో కలిసిపోలేదు.

ఆ పరిస్థితులలో యునైటెడ్ నేషనల్ ఫ్రంట్ నిర్మించే తలంపును వదలుకొని కార్మికులను, పెటీ బూర్జువావర్గాన్ని ఐక్యపరచి ఒక విప్లవసంఘాన్ని (Revolutionary bloc) నిర్మించాలి. ఒక్కొకప్పుడు ఈ 'రివల్యూషనరీ బ్లాకు' ఏకపార్టీగానే ఏర్పడవచ్చు - చైనాలోని 'క్యూమింటాంగ్ పార్టీవలె' - కాని అది ఎప్పుడూ పై రెండు శక్తులకూ - కమ్యూనిస్టు పార్టీ. పెటీ బూర్జువా విప్లవవాదులపార్టీ-కూడా ప్రతినిధ్యం వహించితీరాలి. ఈ "రివల్యూషనరీ బ్లాకు" జాతీయ బూర్జువావర్గం యొక్క రాజీతత్వాన్ని ప్రజలకు వెల్లడిచేస్తూ, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాటం సాగించాలి. ఇటువంటి ద్వంద్వపాత్ర (Doublerole) వహించే పార్టీయొక్క ఆవశ్యకత ముఖ్యంగా ఇటువంటి పరిస్థితులలో చాలావుంది. కాని అది కమ్యూనిస్టుపార్టీ స్వాతంత్ర్యమునకు భంగకరం కాకుండా, కమ్యూనిస్టుపార్టీ ఆందోళన ప్రచార స్వాతంత్ర్యానికి అడ్డురాకుండా, శ్రామికవర్గం కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన సంఘటితం అవడాన్ని ఆటంకపరచకుండా వుండి విప్లవోద్యమ నాయకత్వం వహించడానికి కమ్యూనిస్టుపార్టీకి అవకాశం కలుగజేసేలా వుంటేనే అట్టి ద్వంద్వపాత్ర వహించే పార్టీ యొక్క ఆవశ్యకత వుంటుంది. పై చెప్పిన వాటన్నిటికీ అంగీకరించకపోతే ఆ పార్టీలో చేరుట కమ్యూనిస్టుపార్టీ క్షేమానికే వ్యతిరేకంగా పరిణమిస్తుంది: బూర్జువా సభ్యుల ప్రాబల్యం ఎక్కువై కమ్యూనిస్టులు కూడా దానిలో కలిసిపోతారు. శ్రామికవర్గ నాయకత్వం కమ్యూనిస్టుపార్టీ చేతిలోంచి పోతుంది.

ఇండియావంటి దేశాలలోని పరిస్థితివేరు. అక్కడ జాతీయబూర్జువా వర్గం రెండుగా-రాజీపార్టీ, విప్లవపార్టీగా-ఎన్నడో చీలిపోయింది. వీటిలో రాజీపార్టీ సామ్రాజ్యవాదంతో అంగీకారానికి రావడంకూడా అపుడే జరిగిపోయింది. ఇందులోనేవుంది ఇండియావంటి బానిసదేశాలకూ, పైజెప్పిన చైనా, ఈజిప్టులవంటి వాటికీ మధ్యగల ప్రధానమైనభేదం. ఈ 'రాజీపార్టీ'లో జాతీయ బూర్జువావర్గంలోని మహాధనవంతులు, పలుకుబడి గలవాళ్ళూ వుంటారు. వాళ్ళకు తమ లాభాలుతప్ప దేశం సంగతి అక్కర్లేదు. విదేశీ సామ్రాజ్యవాదంకన్నా విప్లవం అంటే వాళ్ళకు భయం ఎక్కువ. విప్లవం అంటే వాళ్ళకున్న భయంవలన దేశస్వాతంత్ర్యానికి, విప్లవానికి శత్రువైన సామ్రాజ్యవాదంతో కలిసిపోయి, తమ దేశీయులైన రైతాంగానికి, కార్మిక వర్గానికి వ్యతిరేకంగా పోరాడుటకు తయారయేరు. ఈ 'బ్లాకొ' (సామ్రాజ్యవాదం + పెద్దబూర్జువా)ను విచ్ఛిన్నంచేస్తే తప్ప విప్లవం విజయవంతం కాజాలదు: కాని ఆ "బ్లాకొ"ను విచ్ఛిన్నం చేయాలంటే దానిలో చేరిన 'రాజీపార్టీ బూర్జువా'లపై దాడిని కేంద్రీకరించాలి. రాజీపార్టీయొక్క దేశద్రోహాన్ని ప్రజలకు వెల్లడిచేయాలి. శ్రామిక ప్రజాసామాన్యాన్ని ఆ వర్గంయొక్క (ప్రాబల్యం) పలుకుబడిలోనుండి తప్పించాలి. శ్రామికవర్గం ఆధిపత్యం వహించుటకు కావలసిన పరిస్థితులను కల్గించుటకు దీక్షగా కృషిచేయాలి. అంటే బూర్జువావర్గాన్ని, దానిప్రతినిధులను మెల్లిమెల్లిగా స్వాతంత్రోద్యమ నాయకత్వం నుండి తొలగించి, ఆ నాయకత్వం వహించుటకు ఆ దేశాల శ్రామికవర్గాన్ని తయారుచేయాలి; సామ్రాజ్యవాదవ్యతిరేక 'సంఘం'

(bloc) నిర్మించాలి. అందులో శ్రామికవర్గానికి ప్రాబల్యం, ఆధిపత్యం వుండేలా చూడాలి. అదీ చేయవలసినపని. ఒక్కొక్కపుడు పరిస్థితులను బట్టి యీ 'బ్లాకొ' కార్మికుల రైతుల జాయింటుపార్టీ స్వరూపంపొంది ఒకే వేదికపై నిలబడవచ్చును.

అట్టి దేశాల్లో స్వతంత్ర కమ్యూనిస్టుపార్టీల ఆవశ్యకతను కమ్యూనిస్టులెపుడూ దృష్టిపథంలో వుంచుకొని వాటి నిర్మాణానికి ప్రయత్నించాలి. ఎందువల్లనంటే కమ్యూనిస్టు పార్టీ ఒక్కటే శ్రామికవర్గ ఆధిపత్యాన్ని సంపాదించే సమర్థతగలది. 'రాజీపార్టీ' పెద్దబూర్జువాలు వేరుపరచేసేక, దేశంలోని పెటీబూర్జువా ప్రజాసామాన్యాన్ని సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటంలో నడిపించుటకుగాను కమ్యూనిస్టుపార్టీ బూర్జువావర్గంలోని విప్లవవాదులతో కలిసి ఒకే సంఘంగా తప్పకుండా ఏర్పడాలి.

అందుచేత, పెట్టుబడిదారీ విధానం బాగా అభివృద్ధిచెందియున్న వలస, బానిస దేశాలలోని విప్లవోద్యమాల తక్షణ కర్తవ్యాలు :

(1) కార్మికవర్గంలో చైతన్యవంతులైన వారందరినీ కమ్యూనిజంవైపుకు ఆకర్షించి, స్వతంత్ర కమ్యూనిస్టుపార్టీలు నిర్మించాలి.

(2) సామ్రాజ్యవాదుల, బూర్జువా రాజీవాదుల ముఠాకు వ్యతిరేకంగా కార్మికులు, రైతులు విప్లవవాదులైన మేధావివర్గంతో కూడిన జాతీయ విప్లవవాదుల సంఘమును (Bloc) స్థాపించాలి.

(3) ఆ 'బ్లాకొ'లో శ్రామికవర్గ ప్రాబల్యం వుండేలా చూడాలి.

(4) దేశంలోని పెటీబూర్జువా ప్రజా సామాన్యాన్ని బూర్జువా రాజీ వాదుల పలుకుబడిలోనుండి తప్పించుటకు కృషిచేయాలి.

(5) దేశ స్వాతంత్ర్యోద్యమానికి ఇతర దేశాలలోని శ్రామికోద్యమంతో దగ్గర సంబంధం ఏర్పరచాలి.

తూర్పు వలస-బానిసదేశాలలోని క్రియాశీల కార్యకర్తలు (active workers) యీ పై కార్యాచరణకు పూనుకోవలసియుంది.

ప్రస్తుత అంతర్జాతీయపరిస్థితిలో ఈ కర్తవ్యముల ప్రాధాన్యత ప్రాముఖ్యత మరీ ఎక్కువగా వుంది. నేటి అంతర్జాతీయ పరిస్థితి ఏమిటి ? ఈనాడు విప్లవోద్యమంలో ప్రతిష్టంభనం ఏర్పడింది; అది ముందుకు సాగిపోవటంలేదు. ప్రస్తుత పరిస్థితుల్లో నిస్తబ్దత (lull) ఏర్పడిందంటే ఏమిటి ? పశ్చిమదేశాల కార్మికులమీద, తూర్పువలస దేశాలమీద, ముఖ్యంగా అన్ని దేశాల్లో విప్లవోద్యమ నాయకత్వం వహిస్తున్న సోవియట్ యూనియనుమీద మునుపటికంటె ఎక్కువగా ఒత్తిడితెచ్చి వాటిని నాశనం చేయుటకు ప్రయత్నిస్తారని దీన్ని బట్టి తెలుస్తోంది. సోవియటు ప్రభుత్వంపై అటువంటి ఒత్తిడితెచ్చుటకు సామ్రాజ్యవాదులు ప్రయత్నాలు ప్రారంభించేరని నిస్సంశయంగా చెప్పవచ్చును. ఎస్తోనియా తిరుగుబాటు సందర్భంలో వాళ్ళుచేసిన నీచ ప్రచారం, సోఫియాలో ప్రేలుడు సందర్భంలో సోవియట్ యూనియనుమీద వాళ్ళుచేసిన అబద్ధ ప్రచారం, మామూలుగా బూర్జువా పత్రికలన్నీ

మనదేశానికి వ్యతిరేకంగా చేసే ప్రచార కార్యక్రమం - ఇవన్నీ మనమీద దండయాత్రకు ముందు చేయబడుతున్న సన్నాహాలు. ఈ ప్రచారం మూలంగా సోవియటు యూనియనుమీద వ్యతిరేకతను ప్రజల్లో కల్గించి సోవియటు యూనియను మీద నిందలను దైనందిన విషయంగా చేసి తాము సోవియటు యూనియను వ్యవహారాల్లో అన్యాయంగా కలుగజేసుకొనుటకు తగిన నైతిక వాతావరణం కల్పించుకొనుటే వారి యుద్దేశం. ఈ నీచ అబద్ధ ప్రచార ఫలితం యే విధంగా వుంటుంది ? సామ్రాజ్యవాదులు తీవ్రమైన దాడికి సాహసిస్తారా ? అనేవి ముందుముందు తెలుస్తాయి. ఈ దాడి స్వభావం చూస్తే వలస బానిసదేశాలకు కూడ దీనివలన చాలా చెడు కలగబోతూందని చెప్పవచ్చు. సామ్రాజ్యవాదం కొట్టబోయే దెబ్బకు యెదురుదెబ్బ కొట్టుటకు ఐక్యవిప్లవ శక్తులను తయారుగా చేయుట తక్షణం మనం సాధించవలసిన సమస్య. దానిని తప్పించుకునే వీలులేదు. యెదుర్కొని తీరాలి.

ఈ కారణంచేతనే వలస బానిస దేశాలలోని విప్లవోద్యమ తక్షణ కర్తవ్య నిర్వహణకు ఇంత ప్రాధాన్యత వుంది.

ఈ దేశాల విప్లవాభివృద్ధిలోని ప్రత్యేకలక్షణాలను గుర్తించి మనం పైన చెప్పిన వివిధ కర్తవ్య నిర్వహణకు సమర్థులైన "కేడర్సు"ను తయారుచేయుట (ఆయా దేశాల సభ్యులలోనుండియే) మీ యూనివర్శిటీ యొక్క ఆశయం, ఆదర్శం.

ఈ యూనివర్శిటీలో తూర్పు వలస-బానిస దేశాలనుండి వచ్చిన విద్యార్థులలో పది గ్రూపులున్నా - వారందరినీ సిసలైన విప్లవవాదులుగా తయారుచేయవలసియుంది. లెనినిజం సిద్ధాంతం అనే మహాయుధంతో, లెనినిజం యొక్క ఆచరణానుభవంతో ఆ దేశాల స్వాతంత్రోద్యమమే కర్తవ్యాలను పూర్తిగా నిర్వహించుటకు సమర్థులుగా వారిని తయారుచేయాలి.

ఈ దేశాలలోని 'వర్కర్సు'లో రెండు తప్పుడు పంధాలు కన్పిస్తున్నాయి. అసలైన విప్లవయోధులుగా శిక్షణ యివ్వాలంటే ఈ తప్పుడు పంధాల నెదుర్కోవాలి.

మొదటి తప్పుడు పంధా (Deviation) విప్లవోద్యమం జయప్రదం కావడానికి వున్న అవకాశాలను తక్కువ అంచనావేయడం, ఆ దేశాలలోని అభివృద్ధి యొక్క పరిమితి, స్థితులను సరిగా గమనించక ఈ వలస - బానిస దేశాలలో అన్నివర్గాలతో కూడిన (all embracing) జాతీయపక్షం స్థాపించుటకు గల అవకాశాలను యెక్కువ అంచనా వేయడం. ఈ డీవియేషన్ మూలంగా విప్లవోద్యమం యొక్క గౌరవమే నశించి, కమ్యూనిస్టులు కూడా బూర్జువా జాతీయవాదుల ప్రాబల్యంలోబడిపోవుట జరుగుతుంది. యూనివర్శిటీ ఈ తప్పుడు పంధాను దృఢనిశ్చయంతో యెదుర్కోవాలి.

**రెండో తప్పుడు పంధా:** విప్లవోద్యమావకాశాలను యెక్కువ అంచనా వేయడం సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో కార్మికవర్గం, బూర్జువా విప్లవవాదులు ఐక్యం కావలసిన

ఆవశ్యకతను తక్కువ అంచనా వేయడం. జవాలోని కమ్యూనిస్టులు-తమదేశానికి సోవియటు ప్రభుత్వం కావాలంటూ నినాదం లేవదీసి-యీ తప్పుడు పంథాలో పడ్డారు. ఈ పంథా వలన కమ్యూనిస్టులు ప్రజాసామాన్యంనుండి వేరై పోయి చిన్న ముఠాగా తయారౌతారు. సిసలైన విప్లవవాదులుగా తయారుచేయాలంటే యీ డీవియేషన్లను యెదుర్కోవాలి.

ఇవీ, తూర్పు సోవియట్ల యొక్క, వలస దేశాల యొక్క ప్రజల యెడల ప్రాగ్దేశ ప్రజల విశ్వవిద్యాలయం నిర్వహించవలసిన రాజకీయ కర్తవ్యాలు.

వీటిని యూనివర్సిటీ జయప్రదంగా నెరవేరుస్తుందని మనం విశ్వసిస్తున్నాం.

# జాతీయ సమస్య గురించి ఇంకోసారి

యుగోస్లోవ్ కమీషన్‌లో నా వుపన్యాసంలో (బోల్షివిక్ నం. 7 చూడండి) మూడు సమస్యలమీద అభిప్రాయభేదాలున్నాయని చెప్పేను.

(1) జాతీయ సమస్యను పరిష్కరించే మార్గాన్ని గురించి,

(2) ప్రస్తుత చారిత్రక యుగంలో

(3) జాతీయ సమస్యలో అంతర్జాతీయత ఎట్టిపాత్రను వహిస్తుంది ?

అనేదాన్ని గురించి

రెండో సమస్య విషయంలో "కామ్రేడ్ సెమిచ్ జాతీయ సమస్యను రైతాంగ సమస్యగానే భావిస్తున్నాడు అని నా వుపన్యాసంలో చెప్పేను (బోల్షివిక్ నం. 7)

అది ఎంతవరకు నిజం ? యుగోస్లావ్ కమీషన్‌లో కామ్రేడ్ సెమిచ్ వుపన్యాసంలోని ఈ క్రింది భాగం చదివితే మీకే తెలుస్తుంది.

"యుగోస్లావియాలోని జాతీయసమస్య సామాజికంగా ఏమి తెలియజేస్తూంది? సెర్బియన్ పెట్టుబడిదార్లకూ, క్రోట్-స్లోవిన్ పెట్టుబడిదార్లకూ మధ్య జరుగుతూన్న పోటీ, పోరాటంలోనే వుంది, దాని ప్రాముఖ్యత అంతా" (యుగోస్లావ్ కమీషన్‌లో సెమిచ్ వుపన్యాసం). సెర్బియన్ బూర్జువావర్గానికి, క్రోట్-స్లోవీన్ బూర్జువావర్గానికి మధ్య జరుగుతూన్న పోరాటానికి ఇందులో కొంత ప్రాముఖ్యత వుందనటంలో సందేహంలేదు. కాని ఇట్లు భిన్నజాతుల బూర్జువావర్గాల మధ్య జరిగేపోరాటంలో జాతీయోద్యమం యొక్క "సోషల్‌మీనింగ్ వుందని గ్రహించిన వాడెవడూ, జాతీయ సమస్య పూర్తిగా రైతాంగ సమస్య అని చెప్పడానికి వీల్లేదు. జాతీయ సమస్యల ఆంతరంగిక రాజ్యాంగ సమస్య నుండి ప్రపంచ సమస్యగా వలస బానిసదేశాల సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట సమస్యగా మారిపోయిన ఈ రోజున దానియొక్క సారాంశం ఏమిటి ? ఈ వలసల-బానిసజాతుల ప్రజాస్వామ్యం, ఆర్థిక దోపిడీ విధానానికీ, రాజకీయ బానిసత్వానికీ పాలితజాతుల్లోని సామ్రాజ్యవాద బూర్జువావర్గం తమ సంస్కృతి నాశనానికి చేస్తున్న యత్నాలకూ వ్యతిరేకంగా

జరిపే పోరాటంలోనే వుంది అసలు విషయం. జాతీయసమస్య ఈ రూపంలో మన ఎదుట ప్రత్యక్షమౌతూంటే వివిధ జాతుల బూర్జువావర్గాల పోరాటానికి ఎంత ప్రాముఖ్యత వుంటుంది ? ఎక్కువ ప్రాముఖ్యత ఎప్పుడూ వుండదు. ఒక్కొక్కపుడు అతిస్వల్పంగా వుంటుంది కూడాను. ఈ పోటీ పోరాటంలో ఒక దేశపు బూర్జువావర్గం ఇంకో జాతి బూర్జువావర్గాన్ని ఓడిస్తూంది లేక ముందు ఓడుతుంది అనేది కాదు ముఖ్యవిషయం; పాలకజాతిలోని సామ్రాజ్యవాదముఠా బానిసజాతుల ప్రజాస్వామ్యాన్ని ముఖ్యంగా, రైతాంగాన్ని నిర్బంధ విధానంకి లోనుగావించి దోచుకుంటూంది. అలా చేయటం ద్వారా వారినందరినీ సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటంలోకి తెచ్చి శ్రామిక విప్లవంలో భాగస్వాములుగా చేస్తూంది, అనేదే ముఖ్యవిషయం అని స్పష్టంగా తెలుస్తూంది. భిన్న జాతుల బూర్జువా వర్గాలమధ్య పోరాటమే జాతీయోద్యమంలోని "సోషల్ మీనింగు" అనేటట్టయితే జాతీయ సమస్య సంపూర్తిగా రైతాంగ సమస్యగా పరిగణించబడజాలదు. జాతీయ సమస్య రైతాంగ సమస్యయని చెప్పిననాడు దాని సోషల్ మీనింగ్ ఈ బూర్జువా వర్గాలపోరాటంలో వుండజాలదు. ఈ రెండూ ఒకదానికొకటి సమానం అవడానికసలు వీల్లేదు.

స్టాలిన్ 1912 చివరిభాగంలో వ్రాసిన "మార్క్సిజమ్-జాతీయ సమస్య" అనే కరపత్రంలోని ఒక పేరాను కామ్రేడ్ సెమిచ్ బైటికిలాగేడు. దానిలో "జాతీయపోరాటం బూర్జువావర్గాల మధ్య జరిగేపోరాటం" అని వుంది. ప్రస్తుత చారిత్రక పరిస్థితులలో జాతీయోద్యమాల "సోషల్ మీనింగ్"ని నిర్వచించే తన సూత్రం సరియైనదని ఋజువు చేయడానికి బహుశ అతడు సాక్ష్యం తెచ్చియుంటాడు. కాని స్టాలిన్ కరపత్రం సామ్రాజ్యవాద యుద్ధానికి పూర్వం వ్రాయబడింది. మార్క్సిస్టుల దృష్టిలో ఆనాటికింకా జాతీయ సమస్యలకు ప్రపంచ ప్రాముఖ్యత రాలేదు. మార్క్సిస్టుల కోరికయైన "స్వయం నిర్ణయహక్కు" అప్పటికింకా బూర్జువా ప్రజాస్వామ్య విప్లవంలో భాగంగానే పరిగణింపబడింది, కాని శ్రామికవిప్లవంలో భాగంగా చూడబడలేదు. అప్పటినుంచి అంతర్జాతీయ పరిస్థితిలో పూర్తి మార్పు వొచ్చింది. ఒక మూల యుద్ధం, యింకో ప్రక్క అక్టోబరు విప్లవం - ఈ రెండూ కలిసి బూర్జువా ప్రజాస్వామ్య విప్లవంలో భాగంగావున్న జాతీయసమస్యను శ్రామిక సోషలిస్టు విప్లవంలో భాగంగా మార్చేయి. ఈ విషయాలను గుర్తించక పోవడంలో అర్థంలేదు. స్వయం నిర్ణయహక్కు ప్రజాస్వామ్య వుద్యమంలో భాగంగా వుండడం యేనాడోపోయిందనీ, శ్రామిక సోషలిస్టు విప్లవంలో భాగంగా అది మార్పు పొందిందనీ లెనిన్ 1916లోనే "Discussion on Self Determination Summed up" అనే వ్యాసంలో చెప్పేడు. జాతీయ సమస్యమీద లెనిన్ యొక్క లేక యితర కమ్యూనిస్టుల రచనలను వుదహరించదలచుకోలేదు. ఒక నూతన చారిత్రక పరిస్థితి ఫలితంగా యీనాడు ఒక క్రొత్త యుగంలో ప్రపంచశ్రామిక విప్లవయుగంలో - ప్రవేశించాము. అటువంటపుడు, రష్యాలో బూర్జువా

ప్రజాస్వామ్య విప్లవకాలంలో వ్రాయబడిన స్టాలిన్ కరపత్రంలోని విషయాన్ని వుదహరించిన కామ్రేడ్ సెమిచ్‌ని యేమనాలి? సందర్భరహితంగా, కాలానికీ, ప్రదేశానికీ సంబంధంలేకుండా మన యెదుట ఈనాడున్న చారిత్రక పరిస్థితికి సంబంధం లేకుండా కామ్రేడ్ సెమిచ్ వీటిని వుదహరిస్తున్నాడన్నమాట. తద్వారా (డై లెక్టిక్సు) గతితార్కిక వాదం యొక్క సామాన్య సూత్రాలనే వుల్లంఘిస్తున్నాడు; ఒక చారిత్రక పరిస్థితిలో సరిపడినది ఇంకొక చారిత్రక పరిస్థితిలో తప్పుకావచ్చు అనే విషయాన్నే గుర్తించలేకపోతున్నాడన్నమాట. యుగోస్లావ్ కమిషన్‌లో నా వుపన్యాసంలో ఇదివరకే చెప్పియున్నాను. రష్యన్ బోల్షివిక్కుల ప్రకారం జాతీయ సమస్యలో రెండుదశలున్నాయని. అక్టోబరు విప్లవానికి పూర్వదశలో అది 'జనరల్' ప్రజాస్వామ్య వుద్యమంలో భాగంగా వుండేది. అక్టోబరు దిశలో, అది శ్రామికవిప్లవ సమస్య. జాతీయ సమస్య శ్రామికవిప్లవంలో ఒక భాగంగా తయారైంది. ఈ రెండింటికీ మధ్య గల భేదం ఎంతో ఎక్కువ ప్రాధాన్యతను కల్గియుందని వేరే చెప్పనక్కరలేదు. జాతీయ సమస్యలోని యీ రెండుదశల మధ్యగల తేడా యొక్క అర్థమును, ప్రాముఖ్యతను కామ్రేడ్ సెమిచ్ ఇప్పటికీ గుర్తించలేదనే అనుకుంటున్నాను.

జాతీయ సమస్య రైతాంగ సమస్యకాదనీ, అది వివిధజాతుల బూర్జువావర్గాల మధ్యపోటీ సమస్య అనీ కామ్రేడ్ సెమిచ్ అంటున్నాడు; నా దృష్టిలో యీ పొరపాటుకు కారణంయేమిటంటే "అతడు జాతీయోద్యమం యొక్క ఆంతరంగికశక్తిని, బలాన్ని తక్కువ అంచనా వేస్తున్నాడు; జాతీయోద్యమం యొక్క విప్లవ స్వభావాన్ని, ప్రజలనందరనూ ఆకర్షించే స్వభావాన్ని సరిగా అర్థం చేసికోలేకపోయేడు" (బోల్షివిక్ నం.7.)

కామ్రేడ్ సెమిచ్ యొక్క రెండో పొరపాటును గురించి అంతమాత్రం చాలును.



"వ్యక్తుల విషయంలో చెప్పినదే రాజకీయాలలోనూ, పార్టీల విషయంలోనూ, అవసరమైన దిద్దుబాట్లతో అన్వయిస్తుంది. తెలివిగలవాడు పొరపాట్లు చేయడనికాదు. అలాంటివాడు యింతవరకు లేడు. ఇకముందు ఉండబోడు. మరింత ప్రధానమైన పొరపాట్లు చేయకుండా, చేసిన పొరపాట్లను ముందుగానూ, సత్వరంగాను, సరిదిద్దుకునేవాడే తెలివైనవాడు."

**అతివాద కమ్యూనిజం : ఒక బాలారిష్టం**

# అనుబంధం 1

## జాతీయ సమస్యపై సోవియటు యూనియను కమ్యూనిస్టు పార్టీ ప్రధాన నిర్ణయాలు

## జాతీయ సమస్యపై తీర్మానం

## (రష్యను సోషల్ డెమోక్రాటిక్ పార్టీ 7వ అఖిల రష్యా సమావేశంలో ఆమోదింపబడినది : 1917 - ఏప్రిల్)

నిరంకుశ రాజరికాలచే ప్రారంభింపబడిన జాతీయ నిర్బంధ విధానాన్ని తమవర్గ అధికారాలను కాపాడుకొనుటకు, వివిధ జాతుల కార్మికులలో అనైక్యతను కలిగించుట కొరకు భూస్వాములు, పెట్టుబడిదారులు, పెటీబూర్జువావర్గాలు బలపరుస్తున్నాయి. "బలవంతుడిదే రాజ్యం" అనే సూత్రంపై నడుస్తూన్న నేటి సామ్రాజ్యవాదంకూడ యీ జాతీయ నిర్బంధ విధానాన్ని తీవ్రతరం చేస్తూంది.

పెట్టుబడిదారీ విధానంలో యెక్కడైనా జాతీయ నిర్బంధవిధానం తొలగించుట సాధ్యమైతే అది అన్ని జాతులకు, భాషలకు సమానహోదానిచ్చే సంపూర్ణ ప్రజాస్వామ్య ప్రభుత్వంలోనే సాధ్యమవుతుంది.

రష్యాలో భాగములుగా వున్న ప్రతిజాతికీ విడిపోవుటకు (to secede), వేరే స్వతంత్ర రాజ్యస్థాపన గావించుకొనుటకు హక్కు వుంది. ఈ హక్కును వ్యతిరేకించుట గాని, అది ఆచరణలో పెట్టుటకడ్డంకులు గలిగించుటగాని, దురాక్రమణ విధానాన్ని ప్రోత్సహించినట్టే భావింపబడుతుంది. నిజమైన ప్రజాస్వామ్య పద్ధతులపై అన్ని జాతులను సంఘటిత పరచుటకు, వివిధజాతులకు చెందిన శ్రామికులమధ్య ఐక్యతను నెలకొల్పుటకూ ఏకైక మార్గం శ్రామికవర్గం జాతుల 'వేరుపడే హక్కు'ను గుర్తించుటే.

'వేరుపడే; హక్కును ఇవ్వకపోవుట జారిస్టు నిర్బంధవిధానమునకే దారితీస్తుందనుటకు ప్రస్తుతం రష్యన్ తాత్కాలిక ప్రభుత్వంకీ (కెరన్స్కీ) ఫిన్లండుకూ మధ్య బయల్దేరిన పోరాటమే మంచి వుదాహరణ.

జాతులకు వేరుపడే హక్కు వుండడం ఒక విషయం: ఒక ప్రత్యేక సమయంలో ఒకజాతి వేరుపడాలా, అది దానికి లాభకరమా? అనేవిషయం మరొకటి. ఈ రెండిటికీ తేడా గ్రహించాలి. సోషలిజం కొరకు శ్రామికులు జరుపుతూన్న వర్గపోరాటం యొక్కయు, మొత్తం సామాజికాభివృద్ధి యొక్కయు ప్రయోజనాలను దృష్టిలో వుంచుకొని, అప్పటి ప్రత్యేక పరిస్థితియొక్క అవసరాలనుబట్టి శ్రామికవర్గ పార్టీయే వేరుపడుట మంచిదా? అవసరమా? అనే దాన్ని నిర్ణయించాలి.

కమ్యూనిస్టుపార్టీ విస్తృతమైన ప్రాంతీయ స్వపరిపాలనను, తమ బానిసత్వ నిర్మూలనను కోరుతుంది; నిర్బంధంగా ఒకేభాషను రాజ్యాంగం అంతటా సామాన్యభాషగా చేయుప్రయత్నాలను మానుకొని దేశీయభాషలకు ప్రోత్సాహం ఇవ్వవలెనంటుంది. ఆర్థిక, సామాజిక పరిస్థితులు, ప్రజలు యేజాతికి చెందినవారు, మొదలైన విషయాలనుబట్టి ఆయా ప్రాంతాల ప్రజలే స్వతంత్ర లేక స్వపరిపాలన ప్రదేశాల సరిహద్దులను నిర్ణయించాలి అని మనపార్టీ కోరుతుంది.

ఈ శ్రామికవర్గపార్టీ "జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలన" అనే దాన్ని పూర్తిగా నిరాకరిస్తుంది. కారణం ఆ విధానం ప్రకారం విద్య, మొదలగు వాటిపై ప్రభుత్వాని కధికారం వుండదు. జాతీయ ప్రతినిధిసభ (National Diets) ల వంటి వాటి పరం చేయబడుతాయి. ఆ అధికారం "జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలన" ఒకే ప్రదేశంలో నివశించే కార్మికులను ఒకే పారిశ్రామిక శాఖలో పనిచేసేవారిని కూడా - వారి జాతులను బట్టి జాతీయ సంస్కృతినిబట్టి విభజిస్తుంది; అంటే వేర్వేరు జాతుల బూర్జువా సంస్కృతికీ, కార్మికులకూ మధ్య అనుబంధాలను బలపరుస్తుంది; కాని ప్రపంచ కార్మికుల అంతర్జాతీయ సంస్కృతిని పెంపొందించుటయే కమ్యూనిస్టుపార్టీ యొక్క ఆశయం.

కొన్ని జాతులు మాత్రమే అనుభవిస్తూన్న ఎక్కువ అధికారాలను తీసివేస్తూ, అల్పసంఖ్యాకుల హక్కులపై నిర్బంధాలను తొలగిస్తూ రాజ్యాంగచట్టము' (Constitution) లో చేర్చాలని పార్టీ కోరుతూంది.

రష్యాలోని అన్నిజాతుల కార్మికులు, శ్రామిక వర్గసంస్థలలో (రాజకీయ, ట్రేడ్ యూనియను, కో ఆపరేటివ్, వైజ్ఞానిక సంస్థలు) సంఘటిత పడిననాడే వారి వర్గ ప్రయోజనాలను సాధించుకోగల్గుతారు. అట్లు సంఘటితమైననాడే అంతర్జాతీయ పెట్టుబడిదారీ విధానంపై బూర్జువా జాతీయత మీద విజయవంతమైన పోరాటాన్ని సాగించగలుగుతారు.



"పెట్టుబడిదారులతో రాజీధోరణి నవలంబించే సోషలిస్టు విప్లవపార్టీలకూ, తదితర మితవాద పార్టీలకూ రోజులు నిండిపోయాయి. ఆ పార్టీలు ఇక అభ్యుదయ పంధాన పురోగమించజాలవు. నవంబరు విప్లవానికి పూర్వమే ఆ పార్టీలన్నీ బూర్జువా పార్టీలుగా మారిపొయ్యాయి. పెట్టుబడిదారీ విధానం పతనమైపోకుండా ఆ విధానాన్ని సురక్షితంగా, సుస్థిరంగా ఉంచడానికే ఆ పార్టీలు పోరాడాయి. ఒక్క బోల్షివిక్ పార్టీ (కమ్యూనిస్టు పార్టీ) మాత్రమే బూర్జువా అధికారాన్ని కూలద్రోయడంలో ప్రజాపోరాటానికి నాయకత్వం వహించి నడిపింది. సోవియట్ల అధికారాన్ని స్థాపించడానికి కృషిచేసింది".

**- సోవియట్ కమ్యూనిస్టు పార్టీ చరిత్ర**



## పార్టీ కార్యక్రమంలో నుండి (Extract)

(రష్యన్ కమ్యూనిస్టుపార్టీ ఎనిమిదో కాంగ్రెస్‌చే ఆమోదింపబడినది. 1919 మార్చి)

### జాతులమధ్య సంబంధాల విషయంలో

జాతీయ సమస్యమీద రష్యన్ కమ్యూనిస్టుపార్టీ యీ క్రింది సూత్రాల ప్రకారం నడుస్తుంది.

(1) భూస్వాములు, బూర్జువావర్గానికి వ్యతిరేకంగా ఐక్యవిప్లవ పోరాటం సాగించుటకు వివిధజాతుల శ్రామికులను వారితో అంగీకరించే ఇతర వర్గాలను సంఘటితపరచాలి. వారి మధ్య సన్నిహిత సంబంధం నెలకొల్పాలి; ఇదే మనకు ప్రాతిపదిక.

(2) పీడితజాతుల శ్రామిక ప్రజాసామాన్యానికి పాలకజాతుల శ్రామికవర్గం యెడలగల అవనమ్మకాన్ని తొలగించాలంటే, అన్నిజాతులకు సమానమైన హక్కులీయాలి; ఏజాతికీ ఇతరులకులేని ఎక్కువ అధికారాలు (Privileges) వుండరాదు. వలసదేశాల, అస్వతంత్ర దేశాలకు గల "వేరుపడుటకు" (Secede) హక్కు గుర్తింపబడాలి.

(3) అదే ఆశయంతో సంపూర్ణఐక్యతాసిద్ధికి దారితీసే సంధిదశలో మార్గంగా (Transitional form) 'సోవియటు రకపు రాజ్యాల సమాఖ్య'ను పార్టీ సూచిస్తుంది.

(4) జాతియొక్క విడిపోవాలనే భావాన్ని ఎవరు వ్యక్తపరచాలి అనే సమస్యమీద రష్యన్ కమ్యూనిస్టుపార్టీ చారిత్రక వర్గ దృక్పథాన్ననుసరిస్తూంది. అందులో ఆ జాతి యొక్క చారిత్రకాభివృద్ధిదశను, అది మధ్యయుగపు నాగరికతనుండి బూర్జువా ప్రజాస్వామ్యం వైపుకు నడుస్తుందా, లేక బూర్జువా ప్రజాస్వామ్యంనుండి సోవియటు శ్రామిక ప్రజాస్వామ్యంగా పరిణామం చెందుతూందా అనే విషయాన్నీ గమనిస్తుంది.

ఎప్పుడైనా పాలిత, అస్వతంత్ర్యజాతుల ప్రజాసామాన్యంలో పాతుకొని యున్న అవిశ్వాసాన్ని, భయాన్ని పోగొట్టుటకు పాలకజాతుల శ్రామికవర్గం చాలా జాగ్రత్త తీసికొని ప్రత్యేక శ్రద్ధలో పనిచేయవలసియుంటుంది. అంతర్జాతీయ శ్రామికవర్గంలోని వివిధభాగాల మధ్య స్థిరమైన, ఐచ్ఛికమైన ఐక్యతను సాధించవలెనంటే యీ విధానం ఒక్కటే సరియైన మార్గం. సోవియటు రష్యాలో యెన్నో జాతీయ సోవియట్ రిపబ్లికులను ఐక్యపరచుటలో గలిగిన అనుభవం కూడా దీనినే సూచిస్తూంది.

# వివరణ సూచిక

1."బండ్" (పేజి:7) లిథుయేనియా-పోలండు, రష్యాల యూదుకార్మిక సమితి; సెప్టెంబరు 1897లో (విల్నా కాంగ్రెసులో) స్థాపింపబడినది. అది తన కార్యక్రమాన్ని ముఖ్యంగా యూదుకార్మికులలో యెక్కువగా ప్రచారం చేసింది. యూదు కార్మికులకు మాత్రమే సంబంధించిన విషయాలలో స్వతంత్రంగా వ్యవహరించే స్వపరిపాలిత సంస్థ"గా ఇది 1898లో రష్యన్ సోషల్ డెమోక్రాటిక్ లేబర్ పార్టీలో చేరింది. 1901 వరకూ "యూదులకు సమాన పౌరసత్వపు హక్కులు కావాలి" అనే ఒక్క రాజకీయ నినాదాన్ని మాత్రమే స్వంతంగా ప్రచారం చేసింది. 1903లో జరిగిన రష్యన్ సో.డె. లేబర్ పార్టీ రెండవ సమావేశంలో యూదు శ్రామికవర్గపు యేకైక ప్రతినిధిగా తాను గుర్తింపబడవలెననీ, పార్టీనిర్మాణం "ఫెడరల్ లైన్సు" మీద జరగవలెననీ బండ్ కోరిన కోర్కెలు నిరాకరింపబడుటతో అది పార్టీనుండి చీలిపోయింది. బండ్ యొక్క ఆరవ సమావేశంలో (1905) "జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలన" కోరుతూ తీర్మానించింది.

"సంస్కృతికి సంబంధించిన ఏ విషయంలోనూ (ప్రజల విద్య, మొదలగు) ప్రభుత్వానికధికారం వుండకూడదు. ఆ అధికారం అంతా 'జాతి'కి అంటే జాతికి ప్రాతినిధ్యం వహించే కొన్ని నిర్ణీత కేంద్ర, ప్రాంతీయ సంస్థలచేతిలో వుండాలి. ఆ సంస్థల సభ్యులు సార్వజనీనమైన సమానమైన 'బేలట్ వోటింగు' ప్రకారం యెన్నుకోబడాలి" 1906లో జరిగిన నాలుగో కాంగ్రెస్ తర్వాత బండ్ మరల రష్యన్ సో.డె. లేబర్ పార్టీలో చేరింది. కాంగ్రెస్ బండ్ యొక్క జాతీయ కార్యక్రమాన్ని గురించి చర్చించక దాన్నలావుంచింది. పార్టీలోపల జరిగే వివాదాలలో మామూలుగా బండ్ మితవాద (Right) పోలసీ నవలంబిస్తూ, మెన్షెవికులను బలపరుస్తూండేది. 1912లో అది 'లిక్విడేటర్సు'తో దగ్గర సంబంధం పెట్టుకుంది. యుద్ధకాలంలో (యేదో కొందరు అంతర్జాతీయ వాదులు మినహా) బండ్ జాతీయ రక్షణను ప్రచారం చేసింది. ఫిబ్రవరి విప్లవం తర్వాత అది సంయుక్త ప్రభుత్వాన్ని (కెరన్ స్కీ) బలపరుస్తూ బోల్షివికుల నెదిరించింది. 1918 చివర ప్రాంతాల్లో, బండ్‌లో తీవ్రవాద ముఠాలు బయల్దేరసాగినై. 1919 మేలో యుక్రేన్ కమ్యూనిస్టు బండ్ (ఇది అసలు బండ్ నుండి చీలిపోయింది.) యొక్క ప్రథమ మహాసభ కీవ్ నగరంలో జరిగింది. ఆ మహాసభలో యుక్రేన్ కమ్యూనిస్టు బండ్, యునైటెడ్ జ్యూయిష్ కమ్యూనిస్టు పార్టీతో కలిసిపోయి "జ్యూయిష్ కమ్యూనిస్టు లీగు"గా యేర్పడింది. దానిని ఆగస్టు 1919లో రష్యన్ కమ్యూనిస్టు పార్టీలో చేర్చుకున్నారు. తెల్ల రష్యాలో "జ్యూయిష్

కమ్యూనిస్టుపార్టీ"గా యేర్పడిన బండ్‌లోని తీవ్రవాదులు (left wing) మార్చి 1919లో రష్యన్ కమ్యూనిస్టుపార్టీలో కలిసేరు. చివరికి మార్చి 1921లో మిన్స్క్ నగరంలో జరిగిన మహాసభలో యేకొద్దిమందో తప్ప బండ్‌లో మిగిలిన వారంతా రష్యన్ కమ్యూనిస్టుపార్టీలో చేర నిశ్చయించేరు. చాలాకొద్దిమంది మాత్రం ఆంబ్రమోవిచ్ నాయకత్వంక్రింద పార్టీకి వెలుపలనే వుండిపోయేరు. అంతకు పూర్వమే పన్నెండో మహాసభలో (1920) సోవియటు ప్రభుత్వానికి వ్యతిరేకంగా తమ ఎత్తుగడలను వదలివేయాలని తీర్మానిస్తూ బండ్ తన ప్రధాన జాతీయతా నినాదమైన "జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలన" నినాదం శుద్ధ అనవసరం అని అర్ధరహితమని ఒప్పుకుంది. "పెట్టుబడిదారీ వ్యవస్థక్రింద కోరబడిన 'జాతీయ వైజ్ఞానిక స్వపరిపాలన' సోషలిస్టు విప్లవ పరిస్థితులలో అర్ధరహితంగా తయారౌతుంది."

బండ్ తొమ్మిదో మహాసభ : 1912 జూన్‌లో వియన్నా నగరంలో జరిగింది. నాలుగో డ్యూమా (రష్యా శాసనసభ) యెన్నికలను గురించీ, ఆగస్టు (లిక్విడేటరు) కాన్ఫరెన్సును (ఇందులో 'బండిస్టు'లు పాల్గొన్నారు.) సమావేశపరచడం గురించీ చర్చించబడింది. ఈ బండ్ తొమ్మిదో మహాసభ నిర్ణయాలన్నీ పూర్తిగా అవకాశవాద (ఏగాలికా గొడుగుపట్టే) లిక్విడేషనిస్టు స్వభావం కలిగియున్నాయి. (రాజరికాన్ని తొలగించి 'రిపబ్లికును' స్థాపించాలనే నినాదం వొదిలేసేరు; ప్రభుత్వ వ్యతిరేక కార్యక్రమం అంతా మూలబెట్టబడింది. శ్రామిక వర్గం యొక్క విప్లవాదర్శాలనే మరచిపోయేరు.) మెన్షెవిక్ లిక్విడేటర్సుతోనూ, పోలిష్ సోషలిస్టు పార్టీలోని తీవ్రవాదులతోనూ, సన్నిహిత సంబంధం యేర్పరుచుకొనుటకు అంగీకరించింది.

**2. జియోనిజమ్ :** (పేజి : 8) ఒక అభివృద్ధి నిరోధకమైన జాతీయ రాజకీయోద్యమం.

సభ్యులు ముఖ్యంగా యూదు బూర్జువావర్గం నుండి, మేధావివర్గంనుండి, మధ్యతరగతి వారినుండి, కార్మికులలోని చైతన్యంలేని తరగతులనుండీ వచ్చినవారు. యూదు కార్మిక ప్రజాసామాన్యమును 'జనరల్' శ్రామిక వర్గ పోరాటంనుండి వేరుచేయ ప్రయత్నిస్తుంది. పాలస్టయిన్‌లో యూదు బూర్జువా రాజ్యాంగ స్థాపన దాని ఆశయం

**3. పాన్ ఇస్లామిజమ్ :** (పేజి : 8) టర్కిష్, తాతార్ ప్రజలలోని వున్నతవర్గాల (ఖాన్స్, ముల్లాలు, భూస్వాములు, వర్తకులు) రాజకీయ సిద్ధాంతం. ఇస్లామ్ నవలంబించే జాతులన్నిటిని ఒకటిగా సంఘటితపరచుట దాని ఆశయం. పాన్ ఇస్లామిజమ్, పాన్-టర్కిజమ్ వంటిదే. (టర్కిష్, మహమ్మదీయ ప్రజలందరను టర్కుల ఆధిపత్యం క్రింద సంఘటిత పరచుట పాన్-టర్కిజమ్ యొక్క ఉద్దేశం.)

**4. లిక్విడేటర్ల కాన్ఫరెన్సు :** (పేజీ 9) యిది 1912 ఆగస్టులో వియన్నాలో జరుపబడింది. (దీనినే ఆగస్టు కాన్ఫరెన్సు అని కూడా పిలుస్తారు) ఒక బోల్షివిక్ వ్యతిరేక ముఠాను నిర్మించుటే దాని ప్రధానోద్దేశం. లిక్విడేటర్సు, బండ్, లెట్టిష్ సోషల్ డెమోక్రాట్లు, కకేషియన్ సోషల్ డెమోక్రాట్లలో ఒక భాగం-తమ ప్రతినిధులను యీ కాన్ఫరెన్సుకు పంపేయి. కాన్ఫరెన్సు వెనకాల వుండి మొదటినుండి చివరివరకూ నడిపించినవాడు ట్రాట్స్కీ.

**5. బాల్కన్ యుద్ధం :** (పేజీ:24) 1912లో ప్రారంభమైంది. టర్కీకి యెదురుగా బల్గేరియా, సెర్బియా, గ్రీసు, మాంటినీగ్రోలు యుద్ధం చేసేయి. దీనికి కారణం బాల్కన్ ద్వీప కల్పంలో "ఎంటెంటి" రాజ్యాలకూ (ఫ్రాన్సు, బ్రిటన్, రష్యా) ట్రిపిల్ అలయన్సులోని రాజ్యాలకూ (జర్మనీ, ఆస్ట్రియా-హంగరీ, ఇటలీ) మధ్యగల తగాదాలే. 1913లో పాతమిత్రుల మధ్యనే పంపకాలు తెగక మళ్ళీ రెండో బాల్కన్ యుద్ధం ప్రారంభమైంది; దాంట్లో బల్గేరియా ఓడిపోయింది. ఈ యుద్ధాలవలన పాత చిక్కులన్నీ బిగిసేయి. సామ్రాజ్యవాద యుద్ధానికి నాందీ ప్రస్తావనగా వుపయోగించేయి.

**6. జగీల్లో :** (పేజీ : 29) పోలిష్ సోషలిస్టుపార్టీ తీవ్రవాద ముఠాకు చెందిన 'జంగీల్లో' నాలుగో 'డ్యూమా'కు డెప్యూటీ (ప్రతినిధి) గా యెన్నుకోబడ్డాడు. వోటున్న కార్మికులలో యెక్కువ మంది పోలిష్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీనే బలపరిచేరు. కాని వారికి వ్యతిరేకంగా బండిస్టులు, పోలిష్ సోషలిస్టుపార్టీ, యూదు బూర్జువా జాతీయవాదులతో కలిసి ముఠాగా యేర్పడ్డారు. నాలుగో 'డ్యూమా'లోని సోషల్ డెమోక్రాటిక్ పార్టీలో లిక్విడేటర్సుదే మెజారిటీ అవడంతో సోషల్ డెమోక్రాట్ కాని 'జగీల్లో' సో.డె. పార్టీలో చేర్చుకోబడ్డాడు. ఇది బండ్ యొక్క విచ్ఛిన్న పంథా యెత్తుగడలకు సహకారం ఇచ్చినట్లయింది. దీనిమూలంగా పోలండ్ కార్మికవర్గంలో చీలికలెక్కువయ్యాయి.



"నాగరికతారంభంనుండి ఆస్తి చాలా విశేషంగా అనేక రూపాలలో పెరిగిపోయింది. దాని ఉపయోగాలు విస్తరించాయి. దాని స్వంతదారుల లాభంకోసం అది ఎంతో మెలకువతో నిర్వహింపబడుతూంది. ప్రజలకు సంబంధించినంతవరకు, లొంగతీయలేని మహాశక్తిగా అది తయారయింది. తాను సృష్టించిన మహాశక్తి యెదుటనే మానవ మేధస్సు కరచరణాలాడకుండా అయింది. అయినా, మానవుని బుద్ధి, ఆస్తిమీద ఆధిపత్యం సంపాదించగల రోజు వస్తుంది. రాజ్యానికీ, దానిచేత నిర్వహించబడుతున్న ఆస్తికి మధ్యనుండవలసిన సంబంధాలను నిర్వచిస్తుంది. ఆ ఆస్తిదారుల బాధ్యతలకు హక్కులకు హద్దుల్ని ఏర్పరుస్తుంది. వ్యక్తుల ప్రయోజనాల కన్నా, సమాజ ప్రయోజనాలు ముఖ్యం. ఆ రెండింటి మధ్య న్యాయమైన సంబంధాలను పరస్పర సమన్వయంగా ఏర్పరచాలి. ఆస్తిని సంపాదించడమే మానవజాతి ధ్యేయం కాదు. మానవుడు భూమి మీదికి వచ్చినప్పటినుంచి జరిగిన కాలంలో నాగరికత ఏర్పడిన తర్వాత నేటివరకు జరిగిన కాలం, అత్యల్పం. ఇంకముందు జరగవలసినకాలంలో కూడా ఈకాలం అత్యల్ప భాగమే. ఆస్తి సంపాదనయే ఆశయంగా, ఆదర్శంగా వుండే స్థితి ఆ సమాజంతోపాటు రద్దు అవుతుంది. ఏమంటే అటువంటి పద్ధతి ఆత్మ వినాశనకరం. ప్రభుత్వంలో ప్రజాతంత్రం, సమాజంలో సోదరభావం, హక్కులూ, సౌకర్యాలలో సమానత్వం, అందరికీ విద్య - ఇవి రాబోయే ఉత్తమ సమాజాన్ని సూచిస్తున్నాయి. అనుభవం, జ్ఞానం, విజ్ఞానం అటే దారితీస్తున్నాయి. ప్రాచీన కాలపు గణాలలో వుంటూ వచ్చిన స్వాతంత్ర్యం, సమానత్వం, సోదరభావం ఒక నూతన ఉన్నత రూపంలో పునరుజ్జీవితం అవుతాయి". (పురాతన సమాజం-1877)

-లూయీ హెచ్. మోర్గన్

